# శివరాత్రి మహాత్మ్యము

## సోమనామాత్యుడు

| | | | |
|---|---|---|---|
| అక్సెషన్ నెం | : 2749 | కాల్ నెం | : టి. 3-284 |
| ప్రతి | : తాళపత్రము; సమగ్రము | పత్రములు | : 46 |
| ప్రతిపరిమాణము | : 41 × 3.5 సెం.మీ. | పత్రపంక్తులు | : 6 నుండి 7 |

శా. శ్రీ మన్మంగళమూర్తి నాశ్రితజనశ్రేణీ మనోజ్ఞోల్లస
త్సీమాభ్యంతరవర్తి నర్తిత జగత్కీర్తిన్ మునీశామర
స్తోమా నీక మహేంద్రపద్మ భవసంస్తుత్యున్ ప్రవర్తింప నే
ప్రేమం గొల్తు నభీష్ట సిద్ధికి మదిం బెంపొందగా నిత్యమున్.

ఆ.వె. మత్స్యకూర్మకోల మనుజమృగాధిప ఖర్వరామ రామ రామ పాల
బుద్ధ కల్కిరూపములను సజ్జనకోటి బ్రోచు మాధవునిని బుద్ధి దలతు.

క. వాలాయము ప్రాణులు తన ప్రాలాయము చేసి వేడ్క వడి గల్పింప
న్వాలకు స్రష్టకు తామర చూలికి వందన మొనర్తు సురుచిరభక్తిన్.

*　　　　*　　　　*

వ. సమర్పితంబుగా యే నొనర్పంబూనిన పురాణ కథ ప్రారంభం బెట్టిదనిన.

సీ. మందార చందన మాధవ వటజంబు పనసామ్ర బహు తరుపాటవంబు
గజ గండ భేరుండ ఖడ్గవానర కిటి శార్దూల పంచాస్య సంభృతంబు
మదమరాళాంబుజ మధుపకైరవ చక్రవాక సంయుక్త పద్మాకరంబు
శౌనక మైత్రేయ శాండిల్య కౌండిన్య ముఖ్య సంస్థిత మహాముని కులంబు
వేదవేదాంగ సంతత విశ్రుతంబు సకలశాస్త్రేతిహాసార్థ సంభృతంబు
నగుచు శుకపిక రవరవంబైన నాగ్రగణ్యమై యొప్పు నైమిశారణ్య మిలను.

*　　　　*　　　　*

ముగింపు :

ఆ. వె. అనుచు బుద్ధిచెప్పి యారీతి పురిని చాటించి శంభునాజ్ఞ సంచితముగ
ధర్మరాజ భటులు ద్వారాటనుండియు యరుక గలిగి జగము నరయుచుండె.

వ. అని యివ్విధంబున శివరాత్రి మాహాత్మ్యం బామూల చూడంబుగా నిఖిల పురాణ వ్యాఖ్యాన వైఖరీ సమేతుం డగు సూతుండు నైమిశారణ్య పుణ్యక్షేత్రంబునందు విచిత్రంబుగా శౌనకాదిమునీంద్రులకు సంతసంబునం జెప్పి తదనంతరంబున నిట్లనియె.

సీ. ఈ మహాచారిత్ర మే మానవుండైన వినిన వ్రాసిన చదివినను రాజ
సూయంబు లొకనూరు వేయశ్వమేధముల్ భక్తితో నొనరించు ఫలముగలిగి
యాయురారోగ్యంబు లైశ్వర్యమును గలిగి యశమును నిష్టకామ్యమును గలిగి
తల్లిదండ్రులు నన్నలు దమ్ము లతివ లాప్తులును పుత్రమిత్రపౌత్రాభివృద్ధి
తరతరంబును తామరతంప రగుచు శివుని కృపనుండి యామీదజేరు నతని.

వ. అని వివరించి చెప్పె నని చెప్పి.

మాలిని. ఉన్నతజయశీలా యోగిసత్కాంతిజాలా
కిన్నరమునియక్షా కీర్తితోత్సాహదీక్షా
సన్నుతగుణదుర్గా సర్వలోకైకవర్గా
పన్నగమణిహారా భక్తచేతో(వి)హారా.

గద్య :

శ్రీ మన్మహామహేశ్వర కరుణాకటాక్షవీక్షణాలంకార కవితాచమత్కార లోకేరావు తరాన్వయపవిత్ర ధర్మయమంత్రిపుత్ర సహజ పాండిత్య సోమనామాత్య ప్రణీతంబైన వీర మహేశ్వరాచారసంగ్రహం బను పురాణోక్తతత్వం బగు శివరాత్రిమహాత్మ్యంబు నందు సమవర్తి చిత్రగుప్తామాత్య సహితుండై మహాదేవుని సన్ముఖంబునకుం జనుటయు తత్కాలువు కూటవర్ణనంబును, కృతాంతుండు ప్రదక్షిణపూర్వకంబుగా వినుతించి సుకుమారుండు తనయాజ్ఞోల్లంఘనంబు సేయుట వినుతించుటయు తత్కార ణంబున శివరాత్రి వ్రత లక్షణంబును విభూతి మహత్మ్యంబును, రుద్రాక్ష మహత్మ్యం

బును. పంచాక్షరీ మంత్ర రాజ విశేషంబును, శివనామోచ్చారణ ఫలంబును, భక్తజన లాంఛనాంకిత్య పుణ్య ప్రశస్తి. యమాంతకాంతకుని కథని కెరింగించుటయు, మద్భక్తులు నీ కసాధ్యులు. నవధ్యులు, వందనీయార్హులు నని శమనున కానతిచ్చుటయు, ఆతండా వృత్తాంతంబంతయు తనకింకరులకు వినిపించుటయు నన్నది సర్వంబును తృతీయాశ్వాసము.

విశేషాంశములు :

ప్రతి విలేఖనము :

కాలయుక్తి నామ సంవత్సర చైత్ర బహుళ ౧౩ సోమవారం మూడు ఘామల వరకు కొమ్మనాపల్లి సన్యాసికుమారుడు కృష్ణమ్మ శివరాత్రి మహత్మ్యం శ్రీ ఉమా మాహేశ్వరార్పణంగా వ్రాసెను.

ఇందు మూడాశ్వాసములు గలవు. వ్రాత స్పష్టము గ్రంథ మచ్చటచ్చట శైథిల్యము నొందినది.

# శివలీలావిలాసము

## కూచిమంచి తిమ్మకవి

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 494 | కాల్ నెం | : టి8-8 9 |
| ప్రతి | : తాళపత్రము; సమగ్రము. | పత్రములు | : 84 |
| ప్రతిపరిమాణము | : 86.5 × 8. 5 సెం మీ | పత్రపంక్తులు | : 6 |

ప్రారంభము :

శ్రీనగజాఘనస్తన విస్ఫురత్వర సంకుమ చైజనాధిపం
కానిశవాసితస్ఫుట భుజాంతరు డిందు సుధాపయస్సదృ
గ్భూసురకీర్తి పీఠపురకుక్కుటలింగమహాప్రభుం డశే
షానతభక్తపాలనపరాయణు డీవుత మా కభీష్టముల్.

క. మగని సగమేన నెలకొని మగురంబలయందు నాభిమూలం బగుచున్
జగ మేలు సర్వమంగళ జగ మే లిడుగాత మాకు సమ్యక్కరుణన్.

*　　　　*

వ. సమర్పణంబుగా నా రచియింపం బూనిన శివలీలావిలాసం బను శృంగారరస ప్రబంధంబునకుం గథావిధానం బెట్టిదనిన.

తే.గీ. అనిన గాంగేయు డప్పాండుతనయు బలికె వత్స నే మున్ను నారదువలన విన్న
తెరగు నీ కిప్పు డెలమితో నెరుగజేతు నింపు దైవార విను మని యిట్టులనియె.

*　　　　*

ఆ.వె. మొదల కమలగర్భు డుదకంబులె సృజించి పిర్య మందులోన విడిచె నది స
హస్రకర నిభ ప్రభాంచితమై హిర ణ్మయస్వరూపమైన యండ మయ్యె.

వ. అయ్యండంబునందు చరాచరాత్మకంబైన సకల ప్రపంచంబు సృజియించి వృద్ధి బొందింపుచుండె నంత :

*　　　　*

ముగింపు :

క. అని గిరిసుత నర్ధాంగంబున జాహ్నవి నుత్తమాంగమున నిడి కమలా
సనముఖ్యులు గొలువగ శివు డెన యొదవని తీవి జగము లేలుచునుండెన్.

సీ. గడితంపు మున్వన్నెపౌడల దుప్పటియును పసమీరు బంగారు పట్టుచేల
రుచిరాభినవయవ రుద్రాక్షమాలికల్ మురువైన హారుమంజి ముత్తిసరులు
భువనాభిరామ విభూ త్యంగరాగంబు సారకాశ్మీర పటీర చర్చ
భూరిశోభాకీర్ణ భుజగ భూషణములు మణిమయతపనీయ మండనములు

తే.గీ. పాండురారుణవర్ణ విభ్రాజమాన గాత్రమును గల్గి శృంగారగరిమ నలరు
నర్ధనారీశ్వరేశ్వరు డభవు డిందు మౌళి భక్తాళి ననయంబు మనుచుచుండు.

తే.గీ. అనుచు భీష్ముడు పాండు పుత్రునకు గంగకథ యెఱిగింప నలరి యా పృథుబలుండు
నిటలలోచను దలపున నిలిపి మ్రొక్కి యతితరామోద హృదయుడై యలరుచుండె.

తే.గీ. శాలివాహన శకవర్షసంఖ్య వసుధ గాగశశిసంజ్ఞ నలరు ధాతాబ్దమునను
తగ రచించిన యీకృతి ధరణి యందు నా సుధాకర తారార్క మగుచునుండు.

మా లి ని :

ప్రముదిత ముని జాలా భక్తాలోకానుపాలా శమసమదవిభాంగా చారుగంగోత్తమాంగా.
ప్రమథగణ సనాథా పార్వతీప్రాణనా........కుక్కుటాధీశరూపా.

గ ద్య :

ఇది శ్రీమత్కుక్కుటేశ్వర కరుణాకటాక్ష నిరీక్షణ సంలబ్ధ సరసకవితాసామ్రాజ్య ధురంధర ఘనయశోబంధుర కౌండిన్యసగోత్ర పవిత్ర కూచిమంచి గంగనామాత్య పుత్ర సకల సంస్కృతాంధ్రలక్షణకళా కౌశలాభిరామ తిమ్మకవి సార్వభౌమ ప్రణీతంబైన శివలీలా విలాసం బను శృంగారరసప్రబంధంబునందు సర్వంబును ద్వితీయాశ్వాసము.

వి శే షాం శ ము లు :

కవి తన యభీష్ట దైవ మగు కుక్కుటేశున కీకావ్యము నర్పించెను. గ్రథారంభమున రుక్మిణీపరిణయము సింహశైల మాహాత్మ్యంబు, నీలపెండ్లికథ, రాజశేఖర విలాసము, అచ్చతెనుగురామాయణము మున్నగు తాను రచించిన గ్రంథములను పేర్కొని వాని నన్నిటిని పార్వతీవల్లభునకే యంకిత మొసంగినట్లు చెప్పుకొనెను.

గంగజననము, చరిత్ర, మహిమాదులు, గంగ శివుని యర్ధాంగి యగుట మున్నగునవి ఇందలి కథాంశములు. గ్రంథాంతమున ఫలశ్రుతి గలదు.

ఈ ప్రతి బిల్లకంటి బిల్వనాథం శెట్టిగారిది. ఇందు రెండు ఆశ్వాసములు పూర్తిగా నున్నవి. చివరిపత్రము మాత్రము ఇంచుక శిథిలమైనది. లిపి స్పష్టము. ప్రతి చక్కగ నున్నది.

# శుకచరిత్రము

## పరశురామపంతుల రామమూర్తి

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 704 | కాల్ నెం | : టి 8-96 |
| ప్రతి | : తాళపత్రము; సమగ్రము. | పత్రములు | : 146 |
| ప్రతిపరిమాణము | : 35×4.5 సెం.మీ. | పత్రపంక్తులు | : 6 |

ప్రారంభము :

శా. శ్రీమన్నిర్మల శుద్ధసత్వమయదృక్చేతోగతి ప్రాపిత
ప్రేమాధ్యోన్నత నూత్నరత్నయుతహారోదగ్రభాస్వత్పరం
ధామాకారకళావధూసమరసాత్మావ్యక్తరూపాత్త చి
ద్వ్యామానందుడు మాధవుండు గృప మమ్మున్ బ్రోచుచుండందగన్.

ఉ. ఫాలమునందు దృష్టియును, పైపెనుపచాపయు నౌ దలం గళా
శాలియు గంగయుం గలిగి సంతతమంగళ సచ్చిదాత్ముడై
కాలుని గెల్చి కాయజుని గాల్చి పురత్రయ మూడ్చి భూజగ
జ్జాల మడంచు శంభుడగు సామి మమున్ గరుణించుగావుతన్.

చ. సరసిరుహాసనస్థుడ....సద్గురుజన్యకటాక్షవీక్షణ
స్ఫురణన వేదవాక్యపరిపూర్తినిజెంది సదాప్రపంచవి
స్తర పరికల్పనం బెసగ సత్యగతిస్థితి హంసవాహుడై
స్థిరతర చంద్రతేజుడగు దేవుడు మా దెస నుండుగావుతన్.

o o o

వ. .... ... యొనర్పంబూనిన శుకచరిత్రం బను మహాప్రబంధంబునకు కథానిబంధనం బెట్టిదనిన

క. .... యోగధ్యానపరిజ్ఞేయుని .... జితేంద్రియుని ...ని మునిరా
డ్గేయుని గాంగేయుని కౌం తేయాగ్రణి యడిగె తద్విధయా...కుడై.

ముగింపు :

చ. వెలుపల లో వెలుంగుచును విశ్వములోగల నీవు మన్మనో
జలజమునన్ వెలుంగుచు యశంబున మత్కులజాతులెల్ల వ
ర్థిల పరికింపంగా శుకచరిత్రము బల్కితి దీని ధాత్రిలో
పల వెలయంగ చేయుము కృపాకర వైభవరామ రాఘవా ॥

* *

మా॥ అభవవిభవశోభా హాటకాంభోజనాభా
శుభగుణసముదాయా శుద్ధబోధానుమేయా
త్రిభువనపరిపాలా దేవకార్యానుకూలా
సభయనికృతిదూరా జానకీచిత్తచోరా ॥

* *

గద్య :

ఇది శ్రీమద్గురులింగమూర్తి చరణకమలసేవావిధేయ సద్గురుకరుణాకటాక్షవీక్షణాను గ్రహోపలక్షిత శ్రీరామమంత్రోపాసనాప్రకారజ్ఞానధౌరేయ తన్మంత్రాధిష్ఠానదేవతా తత్వానుసంధాన లక్షణభాగధేయ వేదాంతకవితావిచిత్రవిజ్ఞేయ బ్రహ్మవిద్వజ్జనగేయ పరశురామ పంతుల రామమూర్తి నామధేయ ప్రణీతంబైన శుకచరిత్రం బను వేదాంత గ్రంథంబు నందు సర్వంబును పంచమాశ్వాసము సంపూర్ణము.

విశేషాంశములు :

ప్రతివిలేఖనము :

శాలివాహనశకవర్షంబులు 1777 ఏవంప్రవర్తమాన చాంద్రమాన పింగళనామ సంవత్సర చైత్రబహుళ త్రయోదశ్యౌ సౌమ్యవారం యామంవరకు శుకచరిత్ర వేదమూర్తి పొల్కంపల్లి సుబ్బయ్యగార్కి శ్రీమాన్ గొల్లూరు పెద్దయ్య వ్రాసియిచ్చిన గ్రంథం సంపూర్ణం.

5 ఆశ్వాసములు. వ్రాత బాగుగానే యున్నది. శైథిల్య గ్రంథపాతములు లేవు.

ఇతడు శ్రీరామభక్తుడు. గ్రంథ మారామునికే అంకితము. శ్రీరామమంత్రోపాసనాపరుడు.

# శుకసప్తతి

## పాలవేకరి కదిరీపతి

| | | | |
|---|---|---|---|
| ఆక్సేషన్ నెం | : 472 | కాల్ నెం | : టి 3-52 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము. | పత్రములు | : 116 |
| ప్రతిపరిమాణము | : 43×3.5 సెం. మీ. | పత్రపంక్తులు | : 5 నుండి 6. |

ప్రారంభము :

ఉ॥ శ్రీకమలాక్షియై మెలగు సీత తటిద్రుచినొంద లక్ష్మణ
శ్రీకరబాహుదండమున జేర్చు ధనుర్లత యింద్రచాప శో ।
భాకృతి దాల్ప మేరుశిఖరాశ్రయ నీరదలీల సింహపీ
ఠీకమనీయుడౌ జయపటిష్ఠుని శ్రీరాఘురాము నెన్నెదన్.

మ. వర వామాంకమృగేంద్రపీఠి నెలమిన్ వర్తించి ప్రాంచత్కృపా
కర వీక్షాంకురచంద్రికన్ సకలలోకశ్రేణి నీదేర్చుచున్
వర సౌభాగ్యధురీణయౌ జనకరాడ్వంశాబ్ధిజాతం సువ
ర్ణరుచిస్ఫూర్తిసమేత సీత త్రిజగన్మాతం బ్రశంసించెదన్,

*  *

వ. అంకితంబుగా నా యొనర్పంబూనిన శుకసప్తతి యను మహాప్రబంధంబునకు
కథాక్రమం బెట్టిదనిన.

క. వెలయు నలఘు ప్రభావో జ్జ్వలు డింద్ర. ప్రస్థపురి నసామాన్య గుహాః
కలితదృఢబాహుబలని ర్దలితాహితరాజు ధర్మరాజు ధరిత్రిన్.

చ. అత డొకనాడు నిండుకొలువై బలవైరి మహోన్నతిన్ మరు
త్సుతుడు, కిరీటి, మాద్రితనయుల్ తనదండన యుండి కొల్వ రా
జతతి కిరీటకోటి విలసన్మణిమంజులదీపపుంజరం
జితచరణుండు ధర్మజుడు చెంత వసించిన ధౌమ్యు నిట్లనున్.

క. తెలివిగల భూమిసురుడవు కులంగుఁడవు మాకు కథకకుంజర నిను నే
నలఘుమతి నొక్కకార్యము దెలిపెద వివరింపవే సుధీజనతిలకా.

ఉ. భామలచిత్తముల్ దెలియ బ్రహ్మకునైన వశంబుగాదు త
త్కామితయత్నముల్ దెలుప ధాత్రి విచిత్రములండ్రు గావునన్
నామదియే తదీయ కథనంబు వినం గడగెన్ మహీసుర
గ్రామణి యాన తిమ్మనుడు రాజబిడౌజుని గంచు వేడుకన్.

వ. అపుడా ధౌమ్యమహర్షిపర్యుండు నిరవధికకుతూహలధుర్యుండై స్త్రీజనంబులచిత్తంబు లోకాతీతదుష్కృతంబు తదీయకృతసాహసకార్యంబు అనివార్యంబు లగు నిక్కువం బందులకు నొక్క ఇతిహాసంబు గలదు మున్ను మహాదేవుండు పార్వతీవరారోహ కతి రహస్యంబున నానతిచ్చిన తెరం గెరింగించెద సావధానుండవై యాకర్ణింపుము

* * *

ముగింపు :

క. త్యాగధ్వజ మెత్తించిన మాగత యా .... .... మనుచున్
బోగముచెలి ధన మెల్లం బ్రోగులుగా నొసగె సకలమున్ వినుతింపన్.

సీ. పట్టెనామములు గీడ్పరచి నూతనవిభూతిని త్రిపుండ్రంబులు దీర్పవచ్చు
ద్వయము బోజెట్టి శైవపురాణపద్యపాలికలు వేమారు వర్ణింపవచ్చు
వనమాలికలు బారపైచి రుద్రాక్షపూసల పేరు లరుత నెక్కొలుపవచ్చు
విష్ణుసంకీర్తనల్ విడిచి శంకర .... ర్వ మృడశబ్దములె యుచ్చరింపవచ్చు

గీ. గాని భుజములకాయలు గాచియున్న తప్తముద్రలు .... ....
.... ....
.... ....

గద్య :

ఇది శ్రీమత్కదిరీనృసింహకటాక్షవీక్షణసమాగతకవితాధార పాలవేకరి కులకలశాంభోనిధి సుధాకర తాడిగోళ్ళకరియమాణిక్యనృపహర్యక్షపౌత్ర పవిత్రచరిత్ర కదురధరామండలా

ఖంతలపుత్ర విద్వత్కవిరక్షణానుసంధాయక కిదిరీపతినాయక ప్రణీతంబైన శుక సప్తతి యను మహాప్రబంధంబునందు ప్రథమాశ్వాసము.

వి శే షాం శ ము లు :

ఇందు రెండాశ్వాసములు పూర్తిగాను, మూడవ ఆశ్వాసము కొలదిగను గలదు. కృతికర్త వంశవర్ణన లిఖించుటకు ముఖ్యమగు పత్రము శిథిలమై యున్నది.

కవికి సీతాలక్ష్మణులతో శ్రీరామచంద్రుడు కలలో ప్రత్యక్షమై శుకసప్తతి కృతి తన కర్పణంబు సేయు మని యాజ్ఞాపించెను.

గ్రంథము శిథిలావస్థలో నున్నది. క్రిమిదష్ట మైనది.

# శృంగార నైషధము

## శ్రీనాథుడు

| | | | |
|---|---|---|---|
| **ఆక్సెషన్ నెం** | : 3999 | **కాల్ నెం.** | : టి-267 |
| **ప్రతి** | : తాళపత్రము; సమగ్రము. | **పత్రములు** | : 101 |
| **ప్రతి పరిమాణము** | : ౪8×3.5 సెం.మీ. | **పత్ర పంక్తులు** | : 6 నుండి 8 |

ప్రా రం భ ము :

శా. శ్రీరామా కుచమండలీ మృగమద శ్రీగంధ సంవాసిత
స్ఫారోదార భుజాంతరుండు ధరణీసంశ్లేషసంభావనా
పారీణుండు కృతార్థు జేయు గరుణాపాథోధి పద్మాక్షు డిం
పారన్ మామిడిపెద్దమంత్రిసుతు సింగామాత్యచూడామణిన్.

మ. కనకక్షోణిధరంబు కార్ముకముగా గద్రూతనూజుండు శిం
జినిగా మాధవు డమ్ముగా బురము లక్షీణైకదోశ్శక్తి గె

ల్చిన జో దీశ్వరు డిచ్చుగాత జయలక్ష్మిసుస్థిరైశ్వర్య శో
భనముల్ పెద్దయ సింగమంత్రికి జగత్ప్రఖ్యాత సత్కీర్తికిన్.

ఉ. హాటకగర్భుచేత కమలాసనుచే జతురాశ్యకంఠ శృం
గాటక వీథికాకృత విగాహ చతుశ్రుతిచేత దేవతా
కోటికిరీట సంఘటిత కోమల పాద సరోజుచే జగ
న్నాటకసూత్రిచేత గృతినాథుడు గాంచు చిరాయు రున్నతుల్.

* * *

వ. అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నా యొనర్పం బూనిన యిమ్మహాప్రబంధంబునకుం గథానాయకుండు.

సీ. తపనీయదండైక ధవళాతపత్రితో ద్దండతేజః కీర్తి మండలుండు
నిర్మల నిజకథానిమిష కల్లోలినీ క్షాళితాఖిల జగత్కల్మషుండు
వితతనవద్వయ ద్వీప నానాజయ శ్రీవధూటీ సమాశ్లిష్టభుజుడు
నిఖిలవిద్యానటీ నృత్తరంగస్థలా యతనాయమాన జిహ్వాస్థలుండు

గీ. ప్రస్తుతింపంగ దగు సముద్భట కఠోర చటుల గుణటంక్రియాఘన స్తనితఘోష
చాపనీరదభవ శరాసార సమితి జలవదహిత తేజోదవానలుడు నలుడు.

ముగింపు :

వ. అనుచు నిజవంశమకుటమాణిక్యంబైన రోహిణీ రమణునకు రమణీ సమేతంబుగా పుష్పాంజలి సమర్పించి యంగుళీయక మణిప్రభావసమ్మోహంబు చంద్రికాప్రవాహంబుపై వెల్లిగొన భూవల్లభుండు, పాణిపల్లవంబులు మొగిడ్చి ఫాలభాగంబునం గీలుకొలిపె, నవ్విధంబున నా దంపతు లనురాగసంపద బొంపిరిబోవం బూజ్యంబులగు రాజ్యంబులగు రాజ్యసుఖంబు లనుభవింపుచుండిరి. తత్కాలంబునం జాతుర్వర్ణ్యంబులు నిజధర్మంబులు దప్పక మెలంగె. వాతజ్వరాగ్ని క్షుత్పిపాసాది వ్యాధి తస్కర భయంబు లుడిగె. పర్జన్యుండు కాలంబు దప్పక వర్షించె. దేశంబులు ధనధాన్య సమృద్ధంబు లయ్యె. సురభు లమృతంబులు గురిసె. తరువులు పుటపుటకంబున మధుస్యందంబు జెందె. సకలజనంబులు పరమానందంబునుం బొందిరి.

* * *

మాలిని. జగదవనధురీణా సాధురక్షాప్రవీణా
నగపతి సమధైర్యా నందితాచార్యవర్యా
యగణితగుణభద్రా త్యాగముద్రాసముద్రా
విగత సకలదోషా విశ్వలోకైకభూషా.

గద్య :

ఇది శ్రీమత్కమలనాభపౌత్ర మారయామాత్యపుత్ర సకలవిద్యాసనాథ శ్రీనాథ నామధేయ ప్రణీతం బైన శృంగారనైషధ కావ్యంబునందు అష్టమాశ్వాసము సంపూర్ణము.

విశేషాంశములు:

ప్రతి విలేఖనము :

భావనామ సం॥ అధిక ఆషాఢ శు ౧౨ పూర్వయామంవరకు మాతృకప్రకారం వ్రాసి ముగించిన శృంగార నైషధ కావ్యం.

ఈ ప్రతియందు 8 ఆశ్వాసములు పూర్తిగ నున్నవి. లిపి స్పష్టముగ నున్నది. స్వల్పముగ అక్షరదోషములు గలవు. ప్రతి బాగున్నది.

# శృంగార నైషధము

## శ్రీనాథుడు



ప్రతి : తాళపత్రము; సమగ్రము. పత్రములు : 157

ప్రతి పరిమాణము : 41 × 4 సెం.మీ. పత్ర పంక్తులు : 5 నుండి 7

విశేషాంశములు :

ఈ ప్రతియందు ఎనిమిది ఆశ్వాసములు పూర్తిగా గలవు. ప్రతి కొంత క్రిమిదష్టమై కొన్ని పత్రములు విరిగిపోయినవి. లిపి స్పష్టము. ప్రతి విలేఖనమున స్వల్ప దోషము

ఉన్నవి. ఇందు అటనట ప్రతివిలేఖనమున కొన్ని ఖాళీప్రదేశములు పోయిన పదముల కొరకు వదలబడినవి.

# శృంగార నైషధము

## శ్రీనాథుడు

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 4624 | కాల్ నెం | : టి 3-43 |
| ప్రతి | : తాళపత్రము; సమగ్రము. | పత్ర ములు | : 181 |
| ప్రతి పరిమాణము | : 36×4 సెం.మీ. | పత్రపంక్తులు | : 6 |

ఈ ప్రతియం దెనిమి దాశ్వాసము లున్నను మధ్య రెండు పత్రములు లుప్తము. కొన్ని పత్రములు కొలదిగా శిథిలమైనవి. ఈప్రతి కొంత క్రిమిదష్టమై పాతబడి అంచులు నలుపు దిరుగుచున్నవి. లిపి స్పష్టము. ప్రతివిలేఖనమున చాలదోషములు కలవు.

# శృంగార నైషధము

## శ్రీనాథుడు

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 509. | కాల్ నెం. | : టి 3-91 |
| ప్రతి | : తాళపత్రము; సమగ్రము. | పత్రములు | : 147 |
| ప్రతి పరిమాణము | : 41.5×3.5 సెం.మీ. | పత్ర పంక్తులు | : 7 |

వి శే షాం శ ము లు :

ఈ ప్రతియం దాశ్వాసాంతము లోపించినది. ఇం దటనట అక్షరదోషములు కలవు. స్వల్పముగా క్రిమిదష్టమైనది. మొత్తముమీద ప్రతి బాగుగనే యున్నది.

# శృంగార నైషధము

## శ్రీనాథుడు

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 481 | కాల్ నెం | : టి 3-5 |
| ప్రతి | : తాళపత్రము ; అసమగ్రము. | పత్రము | : 141 |
| ప్రతి పరిమాణము | : 33.5×3.5 సెం.మీ. | పత్ర పంక్తులు | : 5 |

విశేషాంశములు :

గ్రంథము క్రిమిదష్టమై యున్నది. గ్రంథశైథిల్య గ్రంథపాతములు కలవు. వ్రాత దోషములు కలవు. ఇందు ప్రారంభమునుండి చతుర్థాశ్వాసమున కొంతభాగము వరకు మాత్రమే గలదు.

# శృంగార నైషధము

## శ్రీనాథుడు

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 5280 | కాల్ నెం | : టి 8-42 |
| ప్రతి | : తాళపత్రము ; అసమగ్రము. | పత్రములు | : 96 |
| ప్రతి పరిమాణము | : 42×3.5 సెం.మీ. | పత్ర పంక్తులు | : 8 |

విశేషాంశములు :

ఈ ప్రతియందలి లిపి స్పష్టముగ లేదు. ప్రతి కొంతక్రిమిదష్టమై శిథిల మగు చున్నది. ప్రతివిలేఖనమున దోషములు కలవు. ఈ ప్రతి సప్తమాశ్వాసమువరకు మాత్రమే కలదు.

# శృంగార నైషధము

## శ్రీనాథుడు

ఆక్సెషన్ నెం : 4628 కాల్ నెం : టి 3-45

ప్రతి : తాళపత్రము ; అసమగ్రగము. పత్రములు : 69

ప్రతి పరిమాణము : 39×4 సెం.మీ. పత్ర పంక్తులు : 8 నుండి 10

విశేషాంశములు :

ఈ ప్రతి చాల పురాతన మైనది. నలుపుదిరిగినది. కొన్ని పంక్తులు కనిపించుటలేదు. కొన్ని పత్రములు తునుకలుగా మిగిలినవి. ఇందలి లిపి స్పష్టముగా లేదు. ప్రతి విలేఖనమున చాల దోషము లున్నవి. ఈ ప్రతియందు ప్రథమ అష్టమాశ్వాసములు లేవు.

# శ్రీకాళహస్తి మాహాత్మ్యము

## ధూర్జటి

ఆక్సెషన్ నెం : 5648 కాల్ నెం : టి 3-120

ప్రతి : తాళపత్రము ; అసమగ్రగము. పత్రములు : 96

ప్రతి పరిమాణము : 34×4 సెం.మీ పత్ర పంక్తులు : 6

ప్రారంభము :

శ్రీవిద్యానిధియై మహామహిమచే జెన్నై వశిష్ఠాజ లూ
తావాతాశన సామజాటవిక గోత్రాదేవ నత్రిక్కర రా
జీవాక్షియుగ యాదవాధిపులకున్ శ్రేయస్కరంబైన యా
ర్యావామాంగము దివ్యలింగము మదీయాభీష్టముల్ జేయుతన్.

సీ. హిమధరాధర మండలేశ్వరకుల హేలి కామణి తనువల్లికా ప్రసూత
అసిత కంధర సింధురాజినాంబర ఘోర గంధ ఖండనకర గంధలహరి
సంతత శివభక్తి సామరస్య జ్ఞాన సారమరంద నిష్యందధార
పరమ హంసోత్తంస భావ భృంగవ్రాత తన్మయావస్థా ప్రధాన సుకవి

గీ. నిఖిల విద్యా రహస్య పాణీపరాగ పాళికా పూరితా ఖండ పద్మజాడ
పేటియై యొప్పు చంద్రార్ధ కూటకోటి జోటి గొబ్బెద జ్ఞాన ప్రసూనకలిక.

* * *

వ. అనేక దండ నమస్కారంబు లాచరించి నా రచియించం బూనిన కాళహస్తి మహాత్వంబను కథానిధానంబునకుం బ్రధానస్థానంబైన పురం బెట్టిదనిన ॥

సీ. సంసార పారదోచ్చాటనానల కీల కలుష సంచయ తామ్రగంధకంబు
కమలలతామూలకంద కుద్దాలంబు సంకల్ప పాషాణ టంకముఖము
రాగశాలి వనాంకుర కురంగ లియ్యంబు శంకా కళంక భుజంగనకులి
నవ మనోగోరాజ నాసికారజ్జువు కోపనేక్షణ విశిఖానలంబు

గీ. దేవ్యదేశిక హంసోపదిష్టమార్గ నిర్గుణధ్యాన సంధాన నిరుపమాన
సౌఖ్యసంపన్న సాధకజన నివాస మమృతలింగాకరము కాళహస్తిపురము.

ముగింపు:

క. ఆ జంగములుం దా నును భోజనమొనరించి వాలి పూజించిన యా
రాజ కళాధరు చరితము రాజము ... ....దువుకొనుచు రాజిల్లంగన్.

శా. తారాప్రోష్మలు గాలసూతుడు వియద్వారాశి వెంటాడి ప్రా
ష్ఠారంభంబును బుట్టి బెట్టి నులివాయు ... ... ....
.... .... .... .... .... ....
.... రంజనారన్వేచిన జాలమో యనగ శాఖాకించ నత్వంబునం
దారానాయకమండ ....గ్రావకూటంబు ....
.... లకుసుంభము మార్పుకొండకుం గూంక
టి రత్నము .... .... .... ....

ఆశ్వాసాంతము :

శ్రీ మత్కాళహస్తీశ్వర చరణకమల సేవాపరాయణ సిం ....నారాయణ జక్కయ నారాయణ తనూభవ భవపరాఙ్ముఖ ధూర్జటి ప్రణీతంబైన కాళహస్తి మాహాత్మ్యంబు నందు ద్వితీయాశ్వాసము.

విశేషాంశములు :

గ్రంథము క్రిమిదష్టము. గ్రంథపాత శైథిల్యములు కలవు. ఎక్కువగ్రంథము లోపించి నది. గ్రంథమునందలి పెక్కుపత్రములు కుడి ఎడమభాగములు లోపించి మధ్య భాగముమాత్రమే శేషించియున్నవి. మొత్తమెన్ని ఆశ్వాసములు గలవో పేర్కొనుట కష్టము. రెండవఆశ్వాసాంత గద్యమాత్రమే కలదు. గ్రంథాంతములేదు. వ్రాయసకాని పేరు లేదు. వ్రాతస్పష్టము. వ్రాత దోషములు కలవు.

# శ్రీకాళహస్తి మాహాత్మ్యము

## ధూర్జటి

అక్సెషన్ నెం : 487 కాల్ నెం : టి 3 - 72

ప్రతి : తాళపత్రము; సమగ్రము. పత్రములు : 54

ప్రతి పరిమాణము : 42.5 × 4 సెం.మీ. పత్ర పంక్తులు : 8.

విశేషాంశములు :

ఈ ప్రతి పార్శ్వములందు, ఊర్ధ్వఅధోభాగములందు శిథిలమై కొన్ని పద్యభాగములు లోపించినవి. గ్రంథాంతతాళపత్రములు పూర్తిగా శిథిలమైయున్నవి. ప్రతి నలుపు దిరిగినది. లిపి స్పష్టముగనే యున్నది. అక్షరదోషములు స్వల్పముగా గలవు. ఈ ప్రతియందు నాలుగు ఆశ్వాసములు గలవు.

# శ్రీకృష్ణ కర్ణామృతము

## వెల్లపూడి పెద్దామాత్యుడు

ఆక్సెషన్ నెం : 4850. కాల్ నెం : బి 3 - 71.
ప్రతి : తాళపత్రము; అసమగ్రము. పత్రములు : 106.
ప్రతి పరిమాణము : 23 × 3.5 సెం.మీ. పత్ర పంక్తులు : 7.

ప్రారంభము

శ్లోకః. శార్దూల విక్రీడితం॥

బర్హోత్తంస విలాసికుంతలభరం మాధుర్యమగ్నాననం
ప్రోన్మీలన్నవయౌవనం ప్రవిలసద్వేణు ప్రణాదామృతం
ఆపీన స్తనకుట్మలాభి రభితో గోపీభి రారాధితం
జ్యోతి శ్చేతసి నశ్చకాస్తి జగతా మేకాభిరామాద్భుతం.

ఉ. చక్కని ముద్దు నెమ్మొగము చందమున .... ద హాసమున్
చొక్కపు జవ్వనంబు శిఖిజుట్టిన బర్హము వేణునాదమున్
నెక్కొన జిక్కి గోపికలు నిండు ........చకుట్మపాళిచే
నెక్కుచు గారవించ .... మనోహరతేజము బొల్చు నా మదిన్.

శ్లో॥ ............ తరస్మి .... మృతవిముగ్ధ ముఖాంబురుహం మధుశిఖిపించ
............ త మనోజ్ఞకచప్రచయం విషయవిషామిషగ్రసనగృధ్నుని చేతసి మే .......

ముగింపు

చ. అలరులగోలలున్ జెరు ............ శ శంఖచక్రముల్
కరములు నా .... లగ కాంచనవేణువు రెండుచేతుల
న్మెరయగ కోటిసూర్యరుచి మీరిన గోప .... మా .... మన్మథు
.... రి ........ హనాంగుని మనంబున నిల్పెద నిష్టసిద్ధికిన్.

శ్లోకం. శార్దూల విక్రీడితం :

యా ప్రీతిర్విదురార్పితే మురరిపో కుంత్యర్పితే యా దృశీ
యా గోవర్ధనమూర్తియా చ పృథుకే స్త ........... తే
భారద్వాజసమర్పితే శబరికా ద త్తే ధరే యోషితాం
యా ప్రీతి · · ..... ని ........ రచితే మత్తోమితే తాంకురం.

మ. రమణీపన్నము రాధికాధరము భారద్వాజు విందున్నని
ప్రమదా భు క్తము మాతృద త్తకుచధా .... విప్రుము న్గొంగుల
ష్యము .... విదుర మృష్టాన్నంబు కుంతీ . . . ...
. . . . . . గైకొనునట్లు కవిత కృష్ణా . . .

మాలిని॥ విమల . . . విస్ఫురన్నీలగాత్రా
అమరనికరవాత్రా అబ్ధి కన్యాబ్జమిత్రా
సమ . . . పాత్రా చక్రి . . . త్రా
శమితవిమితగోత్రా సంశ్రితా . . . . త్రా.

ఇతి శ్రీలీలాశుకకవి రచితే కర్ణామృతాఖ్యానే తృతీయోధ్యాయః

గద్య :

మ. ఇది కృష్ణాశ్రయయోగిపుంగవ కృ ........ తసావన్యతా
భ్యుదయ శ్రీవిభవప్రభావ చిదచిద్బోధ క్షమాశాం
తిదయా .... పెల్లపు మణిపెద్దామాత్య వెంగాగ్రణీ
గదితా శ్వాస ......... కర్ణామృత శ్రీకృతిన్.

విశేషాంశములు :
ప్రతివిలేఖనము :

వికారినామ సంవత్సర చైత్రశుద్ధ౩లవరకు రాజామంత్రిప్రగడ మట్టయ్యగారి ప్రతిలో వున్నక్రమానను చేవెళ్ళ వెంకటరాముని కుమారుడు పేరయ్య కర్ణామృతము సంపూర్ణముగా వ్రాసుకున్నాడు.

గ్రంథము క్రిమిదష్టమైనది. ప్రథమపత్రము లోపించినది. గ్రంథశైథిల్య, గ్రంథ పాతములు కలవు. వ్రాతదోషములు కలవు.

ఈ ప్రతియందు తెలుగు పద్యములతోబాటు లీలాశుకుడు రచించిన సంస్కృతశ్లోకములును కలవు.

# శ్రీకృష్ణ మాయావిజయము
## లక్ష్మీకాండము
## గోమఠ శ్రీనివాసాచార్యులు

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 2252 | కాల్ నెం | : టి 3-6 |
| ప్రతి | : కాగితము ; సమగ్రము. | పుటలు | : 87 |
| ప్రతి పరిమాణము | : 21×17.5 సెం.మీ. | పుట పంక్తులు | : 22 |

ప్రా రం భ ము :

శా. శ్రీరాధా మధురాధరాధరసుధా శృంగార సారంబు సీ
త్కార ప్రౌఢిమ దెల్పవచ్చెదవు మా కౌగిళ్లకన్నం ఘనం
బేరా నాదగు గోపకన్యల రతిన్ మెప్పించు శ్రీ కృష్ణ ద
ర్యారూఢంబుగ సిద్ధిరాట్కుల నృసింహక్ష్మాపతిన్ బ్రోవుతన్.

ఉ. తానసపాయినీత్వమును దప్పక నాథు డనేక రూపముల్
బూనినచో తదానుగుణభూతి దలిర్చి రమాంశసంభవా
నూనమహత్వ మేర్పడ వినోదిలు రుక్మిణి తత్సపత్నియౌ
శ్రీనిధి సత్యయున్ విభవశీలుని జేతురు నారసింహునిన్.

o o o

క. భాగవతు ల్మేలన శుక భాగవత ప్రోక్త పుణ్య భాగవతంసం
బౌ గురు భగవచ్చరితము బాగుగ వినుచుండి నరుని పౌత్రుం డొకటన్.

సీ. ఒకవేళ నీల నీలోజ్వల భాసియై యొకవేళ చంద్రికా ద్యోతు దగుచు
నొకవేళ కెంపుల యొరపుమై నింపుచు త్రిగుణైక భాసియై దివ్యమహిమ

సర్వంబు తానయై నిర్వహతను విష్ణు డాడెడి యద్భుత క్రీడ లాత్మ
నూహించి యెరుదంది యోగి సన్నుతుడైన ప్రహ్లాదు డాడిన పలుకు నిలుప

గీ. విశ్వమయత నున్న విధమున బ్రహ్మాది జంతు లయమునందు సర్వశూన్య
గాఢతమముతోన పడలి యొక్కడై తేలి యాడు గర్వితనము హరికె గలదు.

ముగింపు

వ. రాజోత్తమా వినుము. నిత్య సత్వజ్ఞానం బగు ఏకత్వంబు దొరంగుటచే అనిత్య నిస్సత్వాజ్ఞానానేక రజోగుణశక్తి ప్రబలు నీ యవస్థం గన్న యప్పుడే జీవి గావించు యే కర్మంబైనను నిత్యత్వంబు నొందని దగుచుండు గాన వికుంఠధామ కళాహీన కృత్యంబు సత్యంబు గాని దయ్యె స్వల్పకాలంబున బహుకాలమానస సంసారంబు జరుగుట యెట్లంటివేని సర్వానుభవం బైన దానిం జెప్పెద వినుము స్వప్నంబున జీవి బహువిధ కార్యంబు లొనర్చుట తత్ఫలంబుల బహుకాలంబు లనుభవించుచు ఖేద మోదంబు లొందుట యెట్లో అటులగా దెలియుము చిత్తచలన భ్రాంతులేగాని వేరొండు లేదు. కమల సత్వగుణత్యక్తమైన తక్షణంబె యెరుకచెడె నిదియె జాగ్రత్స్వప్నం బగు మాద్యం బను నిద్రా స్వప్నంబున చిత్తచలన వృత్తి భ్రమ లనేకంబులుగా దోచె ఆర్యులు దీనినే జాగ్రత్స్వప్నం బనియెదరు నింతియెగాని లక్ష్మి యచ్చోటు బాసి సాగర సమీపంబున కేగుట మొదలగు కార్యములు అన్నియు నిజంబులు గావయ్యె నని వక్కాణించె.

క. తుదలేని యజనముఖ్యపు ప్రథితసుషట్కర్మధర్మ పావన మూర్తీ
బుధ వినుత కీర్తి లక్ష్మీ ముదితా నరసింహరాజ పురుషలలామా.

గద్య

ఇది శ్రీమదనంత నిగమాంత సిద్ధాంత తత్వప్రకాశిక సీతారామ పరబ్రహ్మ కరుణా కటాక్షలబ్ధ సరససాహిత్య కౌండిన్యసగోత్ర పవిత్ర గోమఠ వేంకట రామార్యపుత్ర కర్ణాట దేశ ప్రశస్త రజత పురాగ్రహార నివాస శ్రీనివాసాచార్య ప్రణీతం బగు శ్రీకృష్ణ మాయావిజయం బను మహాప్రబంధంబందు శ్రీ మత్సరమ పురుష లీలా విశేషంబునన్ ప్రథమ పురుషార్థం బగు లక్ష్మీకాండంబు సంపూర్ణము.

విశేషాంశములు

కవి యీకావ్యమును నరసింహరాయని కంకిత మిచ్చెను. శ్రీకృష్ణమాయా విజయము నందలి ప్రథమభాగ మగు లక్ష్మీకాండ మిందు పూర్తిగా నున్నది.

ఈ ప్రతియందలి లిపి స్పష్టముగా నున్నది. కాని కొన్ని కాగితములలోని లిపి కాగితపు రంగులో కలిసి అస్పష్టమైనవి. ప్రతివిలేఖనమున స్వల్పదోషములు గలవు.

ఈ కావ్యాదిని దేవతాప్రార్థనము, కృతిపతి కృతికర్తల వంశవర్ణన, షష్ఠ్యంతములు, కావ్యలక్షణ వివరము, తదుపరి కావ్యారంభము జరిగినది. ఇందలి కాగితములు పాతబడినవి.

# శ్రీకృష్ణ లీలావిలాసము

## కుమార అచ్యుతరామరాజు

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | ; 4661 | కాల్ నెం | : టి 8-148 |
| ప్రతి | ; తాళపత్రము;అసమగ్రము. | పత్రములు | ; 18 |
| ప్రతి పరిమాణము | ; 39.5×4 సెం.మీ. | పత్ర పంక్తులు | ; 8 |

ప్రారంభము

సీ. మా కందములనీడ మా కందములజాడ మా కంద నీవేల మాయ....
.... చిగురాకులేమావి.... లేమావి .... సమేల సేమమునకు
చూతమందరమాను చూత మందరమును చూతమ వారల జూచి వొల్పు
కీరసాలదియోద కీరసాలము జూ.... .... సాలగు మీద కీరవాణి
గీ. యనుచు ... మామిళ్ళ నెనసి మొనసి .... మదముల గవిసి గోపముల గినిసి
మదను విడిదల విడిబడ మదగజముల యెదుట .... ను .... లలరి.

ఉ. కెందలిరాకు జొంపమున కేకిక యోర్తుక బొంచి పొంచి తా
.... తాంతసుచ్ఛమున కుందలయె .... నచెంత మా .... మో
కం దనరాదు కిరము .... కాపుట వాతెరబింబవాంఛ దా
యం దరళాక్షి బెగ్గడిల హా .... నినవ్వరితో .... ....

ము గిం పు:

క. ఆరమణుల సతి నపుడా యారామములందు భర్మహర్మ్యంబుల మం
దారనికుంజములందును మారక్షతలను గూడి మాధవు డుండెన్.

సుగంధివృత్తము :

తారకా శతారకా శతారకా శకాల్పియా ?
శారదాభ్ర శార .... సామజామర .... నీ
హారఫేనహార ఫేనహారభూ .... త్రి వి
త్రిర .... .... రదా .... ....

గ ద్య:

ఇది శ్రీ మదుభయ భాషాకవిమి త్రాల్లసాని పెద్దనామాత్య కూచిమంచి తిమ్మరాజాది సకల సుకవిసార్వభౌమ ప్రణీతానేక శృంగార ప్రబంధ కళాసార శ్రీ కుమారాచ్యుత రామరాజ ప్రయత్న సంధానిత శ్రీ కృష్ణలీలావిలాసం బను నత్యంత శృంగార ప్రబంధంబునందు సర్వంబును తృతీయాశ్వాసము సంపూర్ణము.

వి శే షాం శ ము లు :

ప్రతివిలేఖనము :

రౌద్రినామ వత్సర, ఫాల్గుణశుక్ల పక్ష ఏకాదశీ ఖరకరతనయ .... వాసరము వరకు శ్రీవాత్స్య వంశభవుం డగు లక్ష్మణార్యుండు వ్రాసెను.

ప్రతి క్రిమిదష్టము. గ్రంథశైథిల్య గ్రంథపాతములు కలవు. ఈ గ్రంథము మొత్తము ౭ ఆశ్వాసముల ప్రబంధము. ఇందు తృతీయాశ్వాసము మాత్రమే కలదు. అదియును కొంతభాగము మాత్రమే.

ఆశ్వాసాంత గద్యను బట్టి ఇది శృంగార ప్రబంధ మని పేర్కొనవచ్చును.

# శ్రీకృష్ణ లీలావిలాసము

## కుమార అచ్యుత రామరాజు

| | | | |
|---|---|---|---|
| ఆక్సేషన్ నెం | : ౬౮౪౫ | కాల్ నెం | : టి 3 - 227 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము. | పత్రములు | : 18 |
| ప్రతి పరిమాణము | : ౨౬×౩ సెం.మీ | పత్ర పంక్తులు | : 5 |

ప్రారంభము ;

ఉ. శ్రీలకు తానకం బగుచు జెన్నలరారెడు వెండికొండపై
మేలి కడానిడాల్ హొయలు మీరెడు జాబిలిరాలమేడలో
వేలుపురేడు నల్వయును వెన్నుడు గొల్వగ మంచుకొండరా
చూలినిగూడి వేడుకల జొక్కెడు లేనెలదాల్పు గొల్చెదన్.

వ. అభ్యుదయ పరంపరాభివృద్ధిగా రచియింపం బూనిన సకల శృంగార ప్రబంధ కథాసార శ్రీకృష్ణలీలావిలాసం బను నత్యంత శృంగార ప్రబంధంబునకు కథాక్రమం బెట్టిదనిన.

సీ. శ్రీకారణాభ్యున్నతాకార సన్మణి ప్రాకార సౌధవ్రజాకరంబు
సోపాన నవ వజ్రగోపానసీ చిత్ర రూపానవద్యోరు గోపురంబు
గంభీర హిత మీన కుంభీర యుక్తాంబు గంభీర పరిఘా విజృంభితంబు
లీలావర....దుశాలాపగీర్వాణేంద్ర నీలావళీకుడ్య జాలకంబు

ఒ ..మ సుమశర వ్యసన . . సుని వసన సంత్యక్త రక్త సాకసన వసన
రసిక .... సాను మోద . . శ్వసన శిశు విశాలంబు మధుర యస్వరవరంబు.

ము గిం పు :

చ. అని యమునాతటీ పులిన హారి నికుంజములోన నందనం
దనుడు నవచ్ఛదంబులను తల్పమొనర్చి వసించి రాధికన్
గనుగొన గోరుచుం జెలియ కన్నుల జూడగగల్గు నెప్పుడో
యనుచు పరాకుమాని హృదయంబున జూచుచునుండె నయ్యెడన్.

ఉ. హా యను చిత్త భూహరిగుహా యను, నన్నెడబాయ న్యాయమౌ
నా యను, కౌగిలీవె లలనా యను ముద్దు మొగంబు జూపవే
లా యను బల్కవేమి నవలా యను, మ . . నన్ను నేలుకొ
మ్మా యను, మాకు దైవబలమా యను, కావవె రాధికా యనున్.

క. కులనారీమణులున్ వె . . యెల నాగలు నీకు జోకయె తలప నహహా
కలనైన నీ మనోభవ కలనా వైఖరులు మరవ గలనా లలనా.

క. ........ల రాయనికో ల . . నాచిత్తము . . లలిత పికవధూ
కలనాదంబుల కోర్వగ .... .... ....

* * *

వి శే షాం శ ము లు :

ఈ కృష్ణలీలావిలాస మను కావ్యము అత్యంత శృంగారప్రబంధ మని కావ్యాదిని కవి పేర్కొనెను. అట్లే యిది శృంగారరస ప్రధానము. ఇందు శ్రీకృష్ణుని లీలా విలాసములే వర్ణితములు. కావ్యారంభము కథారంభముతోనే కావింపబడెను.

ఈ ప్రతియందు గ్రంథాది గలదు. గ్రంథాంతము లేదు. గ్రంథాదిని కవి తన్ను గురించి యేమియు తెలుపక కథారంభమునే గావించెను.

ఈ ప్రతి క్రిమిదష్టమై శిథిలావస్థలో నున్నది. అక్షర దోషములు స్వల్పముగ నున్నవి. ఇందు అందందు అరసున్నలు వాడబడినవి.

# శ్రీకృష్ణ శతానందీయము

## మరింగంటి వేంకట నరసింహాచార్యులు

| | | | |
|---|---|---|---|
| అక్సెషన్ నెం | : 4642 | కాల్ నెం | : టి 3 - 56 |
| ప్రతి | : తాళపత్రము; సమగ్రము | పత్రములు | : 46 |
| ప్రతి పరిమాణము | : 40.5 × 4 సెం.మీ | పత్రపంక్తులు | : 8. |

ప్రారంభము :

శ్రీకమలాపయోధరవిశిష్టమృగీమదలిప్తసౌష్ఠవా
లోకవిలోకనంబులను లోకములెల్లను బ్రోచునట్టి య
స్తోకత శేషశైలపతిచొప్పున శిర్సునగండ్ల నుండు మా
శ్రీకరుడైన లక్ష్మినరసింహులు మమ్ముల బ్రోచుగావుతన్.

మ. హరివక్షాంతరమేచకాభ్రఘనటితోద్యద్దివ్యవిద్యుత్ప్రభా
స్వరగాత్రాన్విత దీనపామరదయావర్షిష్టరాజీవమం
దిర మీనాంకుని గన్న లేమ త్రిజగద్విఖ్యాతసౌభాగ్యసం
దరి యాయిందిర యెల్లకాలమును మాధామంబులం దుండుతన్.

* * *

వ. అని అస్మదీయాన్వయాభీష్టదైవతం బగు వేంకటలక్ష్మి నృసింహులకు నంకితంబుగా నొనర్పం బూనిన శ్రీకృష్ణశతానందీయం బను మహాప్రబంధ ప్రసూనధామంబునకు కథా ప్రారంభం బెట్టిదనిన.

* * *

శా. శ్రీవైకుంఠము కూర్మిపట్టి యట పూజింపంగనున్ తత్పురీ
ప్రావీణ్యం బురగేంద్రుకైన దరమా రాజీవజాండంబునన్
బ్రోవం జాలిన యంచ తేజి దొరకున్ పోల్కే నిలింపాలిచే
సేవింప న్నుతికెక్కె దివ్యతరమై శృంగార మింపొందగన్.

చ. వినుతికి నెక్కె నప్పురము వింతగ ముప్పదిరెండువేల యో
జనముల యంత నిడుపును విశాలముగల్గి మనోహరంబునై
ఘనమగు నూత్నరత్నయుతకాంచనశోభితతప్తవజ్రముల్
దనరెను పుష్యరాగములు దాపినచొక్కపు నాల్గుద్వారముల్.

ముగింపు :

క. ఆరామ గగనమందుల కూరిమి నెరయంగ గోపగుములము నడుమన్
తారాగణ పరివృతు డగు తారాధిపు మాడ్కి నందతనయుడు యలరెన్.

ఉ. అయ్యెడ వేడివేల్పు యపరాద్రికినిన్ యరుదేర వేడ్కతో
నయ్యదువంశమందనుడు యర్భకవత్సక శ్రేణియుక్తుడై
నెయ్యు మెలర్పగా మురళి నేర్పున నూదుచు మందపద్ధతిన్
సయ్యన నేగె నప్పుడును సామజయానలు తన్నెదుర్కొనన్.

చ. వనరుహపత్రలోచనుడు వల్లవవ్రాతము గొల్వ రేసితో
జనియెను నాత్మధామముకు చక్కగ నప్పుడ తుందవై ఖరిన్
దనరుచు నందుడెందముకు తద్దయు మోద మెలర్ప జేయుచున్
ననిశము నిష్టభోగముల నందరినిన్ సుఖియింప జేయుచున్.

వ. మరియును.

చ. ధరణి నజేయులైన ఖరదైత్యభుజంగప్రలంబవహ్ని శకం
ఖరసఖి భృత్యవ్యోమ గజకత్తళచాణుర కంసముష్టికా

సురతలి మన్మి వేడుకను సొంపగు యిష్టసహస్రషోడశా

త్రరుణుల పెండ్లియాడి ప్రమదంబున నుండె.... రిన్.

**ఉత్సాహ** వాజివాహవాహపుత్రవైరివీరభంజనా సారసాదిదారిపంకజాలశిషనైపుణా

మారభాత్మసూన .... మందిరా సారసాదినేశయా శసర్వలోకసన్నుతా.

గద్య :

ఇది శ్రీమద్వేంకట లక్ష్మీనృసింహ వరప్రసాదలబ్ధ కవితావిచిత్ర మౌద్గల్యసగోత్ర పవిత్ర వేంకటదేశికపౌత్ర కుమారవేంకటాచార్యపుత్ర మరింగంటి వేంకటాచార్య ప్రణీతంబైన శ్రీకృష్ణశతానందీయంబునందు సర్వంబును తృతీయాశ్వాసము సంపూర్ణము.

విశేషాంశములు :

వ్యావహారికచాంద్రమానేన కాళయుక్తినామసంవత్సర మార్గశిర బహుళ 13 శనివారం శ్రీకృష్ణశతానందీయము శేషంరంగయ్య స్వహస్తంగా వ్రాసుకొనెను.

గ్రంథము సంపూర్ణముగా కలదు కాని మిక్కిలి క్రిమిదష్టమైనది. అలతిగా శైథిల్యావస్థలోనున్నది. వ్రాతదోషము లల్పము. అలతిగా ఛందో దోషములు కలవు. తృతీయాశ్వాసాంతమునగల ఆశ్వాసాంతపద్య మగు ఉత్సాహవృత్త మసమగ్రము. వ్రాత చక్కనిది. లిపి బాగున్నది. ఈ ప్రతి సుమారు 120 సంవత్సరములక్రితము వ్రాయబడి యుండు నని యూహించుటకు పెక్కు అవకాశములు గలవు.

ఇందు 3 ఆశ్వాసములు గలవు. ఈగ్రంథము కవికి నిష్టదైవమగు వేంకటలక్ష్మీనృసింహులకంకిత మీయబడినది.

ఇందు ప్రథమ, ద్వితీయాశ్వాసాంత గద్యలలో గ్రంథకర్త నామము వేంకటనృసింహాచార్య అని పేర్కొనబడియున్నది. కాని తృతీయాశ్వాసాంత గద్యయందు వేంకటాచార్య అని పేర్కొనబడియుండుట గమనార్హము.

# శ్రీజగన్నాథమాహాత్మ్యము

## వంగల సీతారామ కవి

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం : 458 | | కాల్ నెం : | బి 8-64 |
| ప్రతి : తాళపత్రము; సమగ్రము | | పత్రములు : | 72 |
| ప్రతి పరిమాణము : 43×4 సెం.మీ | | పత్రపంక్తులు : | 8 |

ప్రా ర ం భ ము :

శ్రీకరపుష్కరోద్భవ విజృంభిత పాదసరోజుడై నిజా
నాకులలీలచే నఘటనాఘటనత్వసమర్థతన్ సదా
ప్రాకృత నిత్యముక్తులకు బల్మరు తా బ్రకటింపుచుం గృపా
లోకనరక్షితార్య సకలుం డగు శ్రీహరి నాశ్రయించెదన్.

చ. వలయిత షుచ్ఛ మిచ్ఛ లౌదవం బదపీఠము వంద్య మాసన
స్థలము గళప్రదేశముల సచ్ఛరమాంగము నానుభిత్తి యా
ర్పులు వలిగాడ్పులుం బడగ ట్రో వెపుడుంగొడుగై దనర్ప ని
ట్లలయక శ్రీశదాస్యపరుడై దగుశేషు దలంతు నెమ్మదిన్.

* * *

వ. సమర్పితంబుగా నే నొనర్పంబూనిన శ్రీజగన్నాథమాహాత్మ్యంబున కల కథానుసంధానం బెట్టిదనిన.

* * *

మ. మును నీచే భువి తీర్థకీర్తనమునం బుణ్యంబు సర్వోత్తమం
బనఘం బాద్య మశేషతీర్థఫలదం బజ్ఞానిమోక్షప్రదం
బనిశధ్యేయ మనర్ఘ్యదారుతనుదీప్యన్మాధవోదంచితం
బనుచున్ శ్రీపురుషోత్తమ స్థలము నెయ్యం బొప్ప జెప్పంబడెన్.

గీ॥ అట్టి యుత్తమక్షేత్రమాహాత్మ్య మెల్ల విస్తరోక్తి వినన్ మది వేడ్కఁబుట్టె
చెప్పఁగలవారిలో గడు శ్రేష్ఠుడవు స మస్తలోకగురుఁడవు మౌనితిలక.

ఉ. ఏ మహితాత్ముచే నది మహాస్థలి నిర్మిత మయ్యె సద్గుణ
స్తోమునకుఁ బూర్ణకాముడు విశద్ధమహోన్నత ధాముడౌ రమా
కాముకు డట్లు దారుమయకాయవిలాస విభాసమానుడై
యేమి తలంచి యందు వసియించె గరం బెరిగింపు మక్కథన్.

ం ం ం

ముగింపు:

క. యాత్రాద్వాదశకంబు వి చిత్రోత్సవ మొప్ప నెవడు సేవించు నతం
డత్రాముత్ర శుభాదిమ పాత్రంబై దివ్యమహిమ బరగు నిజముగాన్.

వ. అని మఱియు కృతప్రసన్నుండై శ్రీమన్నారాయణదేవు నింద్రాది రూపంబుల నారాధించినను తత్తత్ఫలంబుల బొందుదురని జైమిని చెప్పిన నింద్రద్యుమ్నుం డివ్విధంబున యాత్రాదుల దారుమాధవుచే నుపదేశింపంబడి యెవ్విధంబున వర్తిల్లె నెఱింగింపు మని మునులు ప్రార్థించిన నతండి ట్లనియె.

చ. స్థిరదయ దారుమాధవునిచే నుపదేశితుడై నృపాలు డా
దరమున కొంతగాలము యథావిధి నుత్సవ మాచరించి భూ
వరు డగు శ్వేతు జేరి కృప వర్ధిల నప్పను లప్పగించి దా
నరిగె విరించి లోకమున కత్తరి నారదు గూడి ధన్యుడై.

వ. అని జైమిని యెఱింగించిన శౌనకాదులు తదుపదేశప్రకారంబున ప్రవర్తిల్లిరి మరియును.

మాలిని :

సకలభువనవాస స్థానచిత్రోదరా సం
ప్రకటిత నిజమాయాబద్ధ ధాత్రీతిబద్ధా

శుకముఖకృత భవ్యస్తోత్ర సంభావితా ద్రా
గ్వికసిత నిజభక్తక్షేమ శ్రీరంగధామా.

గద్య :

ఇది శ్రీ జగన్నాథకరుణారస పరివర్ధమాన కవితాలతాసంపద్విభ్రాపస్తంబ సూత్రాత్రేయసగోత్ర వంగల వీరరాఘవాచార్యపుత్ర ప్రసన్నజనవిధేయ సీతారామ నామధేయ ప్రణీతంబైన శ్రీ జగన్నాథ మాహాత్మ్యంబునందు సర్వంబును అష్టమాశ్వాసము.

విశేషాంశములు :

ప్రతి విలేఖనము :

విశ్వావసు నామ సంవత్సర ఆషాఢ బహుళ ౧ స్థిరవారం సరికి ఆళ్వారు సీతారామ రాజు శ్రీజగన్నాథమాహాత్మ్యం మందపాడి రామభద్రరాజుగారి ప్రతిని వున్నక్రమాన శ్రీరామార్పణముగా వ్రాసుకొనెను.

ఇందు 8 ఆశ్వాసములు గలవు. కృతినాథుడు శ్రీహరి. గ్రంథము బాగుగా నున్నది. శైథిల్యము లేదు.

# శ్రీభాష్యకారాభ్యుదయము

## మరింగంటి వేంకట నరసింహాచార్యులు

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 6113 | కాల్ నెం | : 611 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము | పత్రములు | : 183 |
| ప్రతి పరిమాణము | : 45 సెం.మీ×3.5 సెం.మీ. | పంక్తులు | : 6 నుండి 8 వరకు |

ప్రారంభము :

శ్రీకమలావధూటి నెద జేర్చి వయారముగా వృషాద్రిపై
ప్రాకట మొప్పగా నిలిచి భాసిలు వేంకటభర్త లీల న

స్తోకదయాంబురాశి యన దోచగ శిరస్సనగండ్ల గహ్వారిన్
జేకొనియందు లక్ష్మీనరశింహుడు మమ్ముఁ బ్రోచుగావుతన్.

చిలుకహొమావు తత్తడివజీరుని గన్నశుభాంగి వేంకటా
చలపతి కూర్మిరాణి శరజారి సహోదరి ముజ్జగంబులం
దలరగ బ్రోచు ప్రోడయగు పాటకగర్భునివాన యత్త మా
నిలయమునందు పేర్మి యెద నివ్వటిలన్ వసియించు నెప్పుడున్.

•• •• •• ••

వ. ఆని ఇష్టదేవతాస్తోత్రంబున మదీయాన్వయాభీష్టదైవంబగు శ్రీమద్వేంకటలక్ష్మీనృసింహస్వామి కనుపరత శోభన పరంపరాభ్యుదయం బగునట్లు అంకితంబుగా సమర్పింప బూనిన శ్రీ రామానుజార్యాభ్యుదయం బగు మహాదివ్య ప్రబంధప్రసూనధామనిర్మాణమునకు కథాసూత్ర ప్రారంభం బెట్టి దంటేని.

శా. శ్వేతద్వీపమె రంగధామముగనున్ క్షీరాబ్ధె కావేరిగా
దైతేయాంతకుడైన యిందిరపతే తత్పట్టణాధ్యక్షుగా
ధాతామోదత నివ్వటిల్ల యిటుగా ధాత్రీతలం బందులన్
యాతాయాతముగా సృజించె విబుధుల్ ఆశ్చర్యత నొందగాన్.

వ. మరియును

సీ. అఖిలాంతరాత్మయౌ ఆదిపరబ్రహ్మ యిందిర గావించు హితవుకరణి
అర్చావతారుడై అతిశయానందత ధారుణీస్థలి రంగధామమునను
స్థిరముగా నిల్చిన దివ్యస్థలంబును ప్రాప్యప్రాపకముగ భావమునను
అలరుచు మనమాళ ఆది నద్దేశకుల్ ద్రవిడప్రబంధముల్ సవినయముగ

గీ. మంత్రసారార్థమెల్ల సమర్మకముగ ఆరసి చదువుచు జెప్పగా ఆర్యజనులు
మానసములందు సంతోషమగ్ను లగుచు కరములును మోడ్చి యసి రిటు కౌతుకమున-

•• •• •• ••

ముగింపు:

ఉ. హా యనువారు సీతపసి యారయ సాహసు డెంతకైన నౌ
రా యనువారు సీత డెవరా యనువారును దీన దోష మా

హా యనువారు యీ .... .... .... త పుట్టి రే
డా యనువారు హోని నృపుకా యనువారును తొల్లునా యికన్.

క. అని సఖికులు పలుదెరగుల ఆనుకొనుచును లేచి చనిరి ఆత్మస్థలికిం
తనకక కూరకులేపడు జనవర యింకేమి ... ... నందున్.

వ. మణికులదీప నీకు అనుమానము మాయెడ యేమియుండినం
తనకక దీర్చుకొమ్మనుచు తత్సభయందుల నిల్వ కుద్ధతిం
పనిబడి శాము మున్నిటకు పొల్పుడివచ్చు .... పద్య ...
.... .... ....

•• •• •• ••

విశేషాంశములు :

ఈ ప్రతిలో గ్రంథాంతము లేదు. ఉన్న పత్రములు కూడ కొంత శిథిలమైనవి. లిపి గ్రాహ్యము. లేఖనదోషములు కలవు. ప్రతివిలేఖరులు వేరగుటవలన కాబోలు ఒకేకవి రచించిన ఈ గ్రంథపు రెండు ప్రతులలో పద్యభేదములు, పాఠాంతరములు కలవు.

# శ్రీభాష్యకారాభ్యుదయము

## మరింగంటి వేంకటనరసింహాచార్యులు

ఆక్సేషను నెం : 6114 కాల్ నెం : టి 3 - 612
ప్రతి : తాళపత్రము; అసమగ్రము పత్రములు : 177
పత్రపరిమాణము : 28 సెం.మీ. × 3 సెం.మీ పత్రపంక్తులు : 6 నుండి 8

ప్రారంభము

ఉ. శ్రీరమణీమణీవిమలచిహ్నితభాసురవక్షభోగ ది
... ... ... ... కౌస్తుభహారశోభితున్

వారిజనేత్రునీలరుచివారిదవర్తు ... ...

... సురవిదారుని శేషనగాధ్యు గొల్చెదన్.

చ. కనకన ... ... ... ప్రకోహరు ...

కనదతిరక్తదిక్కటనిశాంత ... ...

... జప్రతాపరుచిభారలసద్వ్రపు, దుగ్రతేజుడుం

మన ... ... ... ను యెప్పుడు సంతసంబునన్.

* * *

వ. అభ్యుదయ శోభన పరంపరాభ్యుదయంబుగా నా యొనర్పం బూనిన రామానుజాభ్యుదయం బను మహాదివ్యప్రబంధప్రసూనధామనిర్మాణంబునకు కథాసూత్రప్రారంభం బెట్టిదన్నం గ్నేని

ముగింపు -

గీ. మానసంబున యాసూక్తి మరువ కేను

ధ్యాన మొనరించుచున్నాడ నార్యతిలక

ఖరఖరుండును మధ్యాహ్నకాలమునకు

వచ్చి ద్రవ్యంబు వకపురు డిచ్చు మరియు.

గీ. తళిహ నిత్యంబు నర్పించు దాసురాలు

మొరము మ్రోలను యిడనిడి ముద మెలర్ప

ఆజ్ఞ గైకొని శ్రీమత నరుగుచుండు

వాని రంగేశు దని మది దెలియనైతి.

చ. అని యటు తాపమొందు హృది నారయనైతి నటంచు గుందు దా

వనటనుజెందు డెందమున వారక దండియు డిందునొందు ...

* * *

ప్ర తి వి లే ఖ న ము

కీలకనామ సంవత్సర వైశాఖ బహుళసప్తమీ సౌమ్యవాసరం వరకు నలదీగె శఠగోపాచార్యులు రామానుజాభ్యుదయం బను మహాప్రబంధంబు మాతృకలో వున్నమట్టుకు సర్వంబును కేశవపుర శ్రీకేశవస్వామి సన్నిధిలో వ్రాసినాడ.

*　　　*　　　*

వి శే షాం శ ము లు

ప్రతిలో గ్రంథాంతము లేదు. కొన్ని పత్రములు తునిగిపోయి యున్నవి. లేఖనదోషములు స్వల్పముగా గలవు. లిపి గ్రాహ్యము.




# శ్రీమదలమేలుమంగా పరిణయము

## తూము రామచంద్రావనీపాలుడు

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషను నెం | : 6117 | కాల్ నెం | : టి 3 - 615 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము | పత్రములు | : 42 |
| పత్రపరిమాణము | : 41 సెం.మీ.×3.5 సెం.మీ. | పత్రపంక్తులు | : 6 నుండి 7 |

ప్రా రం భ ము

మ.　... ... ... ... ...
... ... ... ... ... గ్రావిక్షేపణో
త్కరపాతోడుచయుండు రామపదసద్భక్తిప్రమోదుండునౌ
హరి వాహిన్యధిరాజు నంగదుని నే నాసక్తితో గొల్చెదన్.

శా.　ఘనసచ్ఛన్నకుహూనిశోపమ లసద్గాత్రుండు క్ష్వేడాట్టహా
సనిశాటాధిపకామినీనికరఖాస్వద్భ్రూణనిర్భేదనుం

సినవంశార్ణవసోమరామచరణాబ్జేందిందిరప్రాయు డ
య్యనమప్రాభవు దచ్చుభల్లపతి మాకైశ్వర్యముల్ సీవుతన్.

0 0 0

వ. అంకితంబుగా నొనర్పంబూనిన యలమేల్మంగాపరిణయం బను మహాప్రబంధంబునకు కథాక్రమం బెట్టిదనిన.

గీ. శౌనకాదిమమునిలోకసార్వభౌమ
రాజి యొకనాడు నైమిశారణ్యమునను
సత్రయాగంబు సల్పుచు సత్రిరఘుని
కథలు వినువేడ్క సూతు మొగమ్ము జూచి.

0 ( 0

ఉ. రాజితరాజమౌళి సురరాజముఖామరులు న్నుతింప వి
భ్రాజితకాద్రవేయచయరాద్వలయాంగదహారయుక్తుడై
రాజితశైలమందు నగరాజసుతార్ధశరీరుడై పరి
వ్రాజకలోకమెల్ల కొలువన్ గొలువై యటనుండు నత్తరిన్.

0 0 0

ము గిం పు

క. గోపురవరమందిరఘన గోపురకలశముల ముద్దు గొనుచున్నవి యా
గోపురశిఖరాగ్రములను గోపురమున వెలగును గనుగో మునితిలకా.

గీ. అనుచు శంభుడు నారదమునివ(రుండు)రేణ్యు తోడ నుడివిన నధికసంతోషమునను
శంభునకు మ్రొక్కి వీడ్కొని చనియె గగన మార్గమున దేహకాంతితమంబు లణప.

0 0 0

వ న మ యూ ర ము.

అక్షరనృపోక్షదనుజారిచయరక్షా
శిక్షితవిపక్షసరసీరుహవిభాక్షా

యక్షవరపక్షనుతహారయుతవక్షా
రాక్షసకులక్షయవిరాజబలదక్షా.

0 0 0

గద్య:

ఇది శ్రీ మద్రామచంద్రపదారవిందమరందరసాస్వాదనతుందిలేందిందిరాయమానా సమాన తూమువంశ క్షీరపారావారరాకాసుధాకర రామక్ష్మాపాలసుపుత్ర పవిత్ర చరిత్రాక్షీణాంధ్రగీర్వాణచణ రామచంద్రావనీపాల విరచిత శ్రీమదలమేల్మంగాపరిణయం బను మహాప్రబంధంబునందు సర్వంబును చతుర్థాశ్వాసము.

0 0 0

విశేషాంశములు

ఈ ప్రతియందు 1వ, 10వ పత్రములు లోపించినవి. ఒకపత్రము కొంత శిథిలమైనది. లిపి సులభగ్రాహ్యము. లేఖనదోషములు కొలదిగా కలవు.

# శ్రీమదాంధ్రమహాభాగవతము

## బమ్మెర పోతన

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషను నెం | : 1793 | కాల్ నెం | : టి 3-590 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము | పత్రములు | : 134 |
| పత్రపరిమాణము | : 50X5.2 సెం. మీ. | పంక్తులు | : 20 నుండి 23 |

ప్రారంభము:-

శ్రీకైవల్యపదంబు జేరుటకునై చింతించెదన్ లోకర
క్షైకారంభకు భక్తపాలనకళాసంరంభకున్ దానవో
ద్రేకస్తంభకు కేళిలోల విలసద్దృగ్జాల సంభూత నా
నాకంజాత భవాండకుంభకు మహానందాంగనా డింభకున్.

వ. సమర్పితంబుగా నే నాంధ్రభాష రచియింపం బూనిన శ్రీమన్మహాభాగవతంబునకు ప్రారంభం బెట్టెదనిన.

సీ. విశ్వజన్మస్థితి విలయంబు లెవ్వని వలన నేర్పడు ననువర్తనమున
వ్యావర్త(న)ముల కార్యములం దభిజ్ఞుడై తాను రాజగుచు చింతనముజేసి
వేదంబు లజునకు విదితంబు గావించె నెవ్వడు బుధులు మోహింతు రెవ్వ
నికి నెండమావులు నీటగా చారుల నన్యోన్యబుద్ధి దా నడరు నెట్లు
గీ. త్రిగుణ సృష్టి యందు దీపించు సత్యము భంగిదోచు సుప్రభా నిరస్త
కుహకు డెవ్వ డతని గోరి చింతించెద ననఘు విశ్వమయుని ననుదినంబు.

* * *

క. పుణ్యంబై మునివల్లభ గణ్యంబై కుసుమఫల నికాయోద్ధిత సౌ
ద్గుణ్యంబై నైమిశాఖ్యా రణ్యంబు నుతింపదగు నరణ్యంబులలోన్.

* * *

ముగింపు :

వ. .... .... ఇట్లు ద్వాదశ మాసంబుల చతుర్వేదకాలత్రయరూపియైన గభస్తి. గంధర్వగానంబు పీతేర షష్టి సహస్ర సంఖ్యలంగల వాలఖిల్యమునులం గొలువ ముందర నడువ జగదీశ్వరుండైన మార్తాండుండు సప్తాశ్వసమేతుండై యేకచక్ర రథం బారోహించి నిమిషమాత్రంబున సహస్రయోజనంబు లతిక్రమించుచు రాత్రి దివంబు మేరుశైలంబును దిరుగుచుతారా పథంబునట్లు రా జరియించు. ఇవి యన్నియు వాసుదేవ పరంబుగా దెలియుమని పరీక్షిన్నరపాలునకు శుకయోగీంద్రుడు భాగవతం బాద్యంతంబును సవిస్తరంబుగా జెప్పెనని సూతుండు జెప్పిన నఖిల మునులు హర్ష సమేతులైరి. ఈ విష్ణుకథా ప్రపంచంబు వినువారును, పఠించువారును నాయు రారోగ్య ఐశ్వర్యంబు గలిగి హరిపదంబును బొందుదురు.

* * *

మాలిని :

జగదవనవిహారీ శత్రులోకప్రహారీ
సుగుణవనవిహారీ సుందరీమానహారీ
విగతకలుషరోషీ వీరవిద్యాభిలాషీ
స్వగురుహృదయపోషీ సర్వదాసత్యభాషీ.

○ ○ ○

గద్య :

ఇది శ్రీపరమేశ్వర కరుణాకలిత కవితావిచిత్ర కేసన మంత్రిపుత్ర సహజపాండిత్య పోతనామాత్య ప్రణీతంబైన శ్రీమహాభాగవతమునందు రాజుల యుత్పత్తియు, వాసుదేవ లీలావతార ప్రకారంబును ....నను కథలు గల ద్వాదశస్కంధము సంపూర్ణము.

విశేషాంశములు

ఈ ప్రతి విక్రమనామ సంవత్సరమున లిఖించబడినది. పత్రములు క్రిమిదష్టములై కొన్ని తునకలైనవి. శిథిలావస్థకు చేరుచున్నది. లిపి బహు సూక్ష్మము. కష్టసాధ్యము. లేఖన దోషములు గలవు. ఇది ద్వాదశస్కంధముల ప్రతి.

# శ్రీమదాంధ్రమహాభాగవతము

## బమ్మెర పోతన

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 566 | కాల్ నెం | : టి3-537 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము | పత్రములు | : 280 |
| ప్రతిపరిమాణము | : 41 X 4. 2 సెం. మీ | పత్రపంక్తులు | : 13. |

విశేషాంశములు

ఈ ప్రతియందు ప్రథమ స్కంధమునుండి ద్వాదశ స్కంధము వరకుగల గ్రంథము గలదు, ఇందు ప్రారంభము ముగింపు లేవు. మధ్యకూడ కొన్ని పత్రములు నష్టమైనవి.

ఈ ప్రతి చాల జీర్ణావస్థయం దున్నది. క్రిమిదష్టమైనది. ప్రతి పూర్తిగా నలుపు దిరిగినది. అక్షరములు బహు సూక్ష్మములు. ఈ ప్రతి చదువుట చాల కష్టము. ప్రతి విలేఖనమున చాలదోషము లున్నవి.

# శ్రీమదాంధ్రమహాభాగవతము

ప్రథమ స్కంధము

**బమ్మెర పోతన**

ఆక్సెషన్ నెం : 845 కాల్ నెం : టి 8-509

ప్రతి : తాళపత్రము; సమగ్రము. పత్రములు : 64

ప్రతిపరిమాణము : 46×3.2 సెం. మీ. పత్రపంక్తులు :

**విశేషాంశములు :**

ఈ ప్రతి యందు ప్రథమ స్కంధము పూర్తిగా కలదు. ప్రథమ పత్రము మాత్రము మూడు ముక్కలుగ నున్నది. మిగిలిన ప్రతి బాగున్నది. లిపి స్పష్టము. కాని లేఖన దోషములు చాల కలవు.

# శ్రీమదాంధ్రమహాభాగవతము

ప్రథమస్కంధము

**బమ్మెర పోతన**

ఆక్సెషన్ నెం : 684 కాల్ నెం : టి 8-548

ప్రతి : తాళపత్రము; సమగ్రము, పత్రములు : 70

ప్రతిపరిమాణము : 37.8× సెం.మీ. పత్రపంక్తులు : 6 నుండి 7

ఈ ప్రతి యందలి లిపి స్పష్టముగనే యున్నది. కాని లేఖనదోషములు, స్వల్పముగ గలవు. ఈ ప్రతి యొక్క పార్శ్వములు ఊర్ధ్వఅధోభాగములు కొంత కొంత శిథిల మైనవి. ప్రతిస్వల్పముగ క్రిమి దష్టమైనది. పత్రములునలుపు దిరుగు చున్నవి'

# శ్రీమదాంధ్రమహాభాగవతము

ప్రథమ ద్వితీయ స్కంధములు

బమ్మెర పోతన

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం : | 4590 | కాల్ నెం : | టి 3-616 |
| ప్రతి : | తాళపత్రము; సమగ్రము. | పత్రములు : | 72 |
| ప్రతిపరిమాణము : | 41.3×3.2 సెం. మీ. | పత్రపంక్తులు : | 8 |

విశేషాంశములు

ప్రతివిలేఖనము

రాక్షస నామ స॥ జ్యేష్ఠ శు॥ ౧౦ మిలు పెదమందడి కోవూరు తిమ్మన్న కొమారుడు పుల్లయ్య స్వధాకుగాను వ్రాసుకొన్న ప్రథమ ద్వితీయస్కంధములు.

ఇందలి పత్రములు నలుపుదిరుగు చున్నవి. లిపి కూడ స్పష్టముగ లేదు. ప్రతి పాత బడినను బాగున్నది. ప్రతి విలేఖనమున చాల దోషములు గలవు.

# శ్రీమదాంధ్రమహాభాగవతము

ప్రథమ, ద్వితీయ, తృతీయ స్కంధములు

బమ్మెర పోతన

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం : | 4591 | కాల్ నెం : | టి 8-513 |
| ప్రతి : | తాళపత్రము; సమగ్రము. | పత్రములు : | 150 |
| ప్రతిపరిమాణము : | 46.7 × 4.8 సెం. మీ. | పత్రపంక్తులు : | 9 |

విశేషాంశములు

ప్రతివిలేఖనము

ఇది శ్రీతిరుమలనగరి దేవరాజుదేశపాండ్యా అంతన్న తనయుడు వేంకట్రాయుడు, తత్పౌత్రుడు తిరుమలరాయుడు, తజ్జనకుడు పాపయ తత్పుత్రుడు రామన్న....కు వ్రాసుకున్న పుస్తకం అభ్యుదయ పరంపరాభివృద్ధియగు నట్టుగాను శాలివాహన శక వర్షంబులు ౧[illegible] అగు నట్టుగాను ప్లవంగసంవత్సర చైత్ర శు॥౧౨ భౌమ్యవాసరం రెండుఝాములన్నరవరకు వ్రాసినది భాగవతం.

ప్రతి అంతటా క్రిమిదష్టము. వ్రాత బాగున్నది. వ్రాతదోషము లల్పములు. గ్రంథ మంతటిగా శైథిల్యాదశలో నున్నది. ఇందు ప్రథమ, ద్వితీయ, తృతీయ స్కంధములు గలవు.

# శ్రీమదాంధ్రమహాభాగవతము

## ప్రథమ, ద్వితీయ, తృతీయ స్కంధములు

### బమ్మెర పోతన

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 320 | కాల్ నెం | : టి 3-512 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము. | పత్రములు | : 366 |
| ప్రతిపరిమాణము | : 41.8×4 సెం. మీ. | పత్రపంక్తులు | : 5 |

విశేషాంశములు

ఈ ప్రతియందు ప్రథమస్కంధము నందలి నాలుగుపత్రములు లోపించినవి. ఇందు గ్రంథాద్యంతములు గలవు. ప్రతియు స్వల్పముగ క్రిమిదష్టమైనది. కొన్ని అక్షరములు నశించినవి. కాని మొత్తము మీద ప్రతి బాగున్నది.

ఈ ప్రతి యందలి లిపి స్పష్టము. పత్రములు నలుపుదిరుగుచున్నవి. ప్రతివిలేఖన మున దోషములు గలవు.

# శ్రీమదాంధ్రమహాభాగవతము

## ప్రథమస్కంధము నుండి చతుర్థ స్కంధము వరకు

బమ్మెర పోతన

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 407 | కాల్ నెం | : డి 8-500 |
| ప్రతి | : తాళపత్రము; సమగ్రము. | పత్రములు | : 256 |
| ప్రతిపరిమాణము | : 46 × 38 సెం. మీ. | పత్రపంక్తులు | : 6 |

**విశేషాంశములు :**

**ప్రతివిలేఖనము :**

శాలివాహన శకవర్షంబులు 1754 అగునట్టుగాను నందన నామ సంవత్సర మార్గశిర బ॥ 7 భానువారం వరకు మహారాజరాజశ్రీ మాతృశ్రీ జనంపల్లి (స్వామి)రాయాకేసమ్మ దేశాయిగారికి ముంగర నర్సన్న వ్రాసియిచ్చిన భాగవతం ప్రథమ ద్వితీయ తృతీయ, చతుర్థంబులు.

ఈ ప్రతియందు పూర్తిగా నాలుగు స్కంధములు గలవు.

ప్రతి బాగున్నది. ఒకటి, రెండు పత్రములు తునిగినవి. మిగిలినప్రతి మంచిదశలో నున్నది. లిపి స్పష్టము. ప్రతివిలేఖనమున స్వల్పదోషము లున్నవి.

# శ్రీమదాంధ్రమహాభాగవతము

## ప్రథమ స్కంధమునుండి చతుర్థ స్కంధమువరకు

బమ్మెర పోతన

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 796 | కాల్ నెం | : డి 8-497 |
| ప్రతి | : తాళపత్రము; సమగ్రము. | పత్రములు | : 354. |
| ప్రతి పరిమాణము | : 42.5 × 4 సెం.మీ. | పత్రపంక్తులు | : 6 |

విశేషాంశములు :

ప్రతి అలతిగా క్రిమిదష్టమైనది. కొన్నిపత్రములు రెండుగా విరిగినవి. వ్రాత స్పష్టము. వ్రాతదోషములు కలవు.

ఇందు ప్రథమస్కంధమునుండి చతుర్థస్కంధము వరకుగలదు. నేటి ముద్రిత ప్రతులకును ఈప్రతికిని అక్కడక్కడ భేదములు కలవు.

## శ్రీమదాంధ్రమహాభాగవతము

ప్రథమ స్కంధమునుండి చతుర్థ స్కంధమువరకు

బమ్మెర పోతన

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం. | : 1881 | కాల్ నెం. | : టి 3-491 |
| ప్రతి | : కాగితము; సమగ్రము. | పుటలు | : 196 |
| ప్రతి పరిమాణము | : 29.5×18.5 సెం.మీ | పుటపంక్తులు | : 32 |

విశేషాంశములు

ప్రతియందలి ప్రతిపుట క్రిమిదష్టమై యున్నది. వ్రాత చక్కనిది. వ్రాతదోషము లల్పములు. ఇందు 133 సంఖ్యగల పుటయందు ఏమియు వ్రాయబడకయే పుటసంఖ్య మాత్రము వేయబడి యున్నది. వ్రాయసకాని పేరుగాని, కాలముగాని పేర్కొనబడలేదు.

## శ్రీమదాంధ్రమహాభాగవతము

ప్రథమ స్కంధమునుండి చతుర్థ స్కంధమువరకు

బమ్మెర పోతన

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 4593. | కాల్ నెం. | : టి 3-549 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము | పత్రములు | : 146 |
| ప్రతి పరిమాణము | : 39.3×3.4 సెం.మీ. | పత్రపంక్తులు | : 7 |

శ్రీహరిపదప్రాప్తంబై తేజరిల్లెడు నట్టి భాగవత పురాణంబు పఠియించిన వారును వినెడివారును విష్ణుసాయుజ్యంబు బొందుదురని చెప్పి మరియు నిట్లనియె.

* * *

మ. అని యీ రీతి రచించి భాగవత మాద్యంతంబు సూతుండు చె
ప్పిన సంతుష్ట మనస్కులై విని మునుల్ ప్రేమంబుతో పద్మనా
భుని జిత్తంబున నిల్పి తద్గుణములం భూషింపుచున్ పొంకమై
జనితాత్మీయ నికేతనంబులగు నుత్సాహంబు వర్థిల్లగాన్.

* * *

గద్యః

ఇది శ్రీహనుమలబ్ధ వరప్రసాద సకలవిద్యానవద్య సహజసారస్వత చంద్రనామాజితరామ విద్వన్మణి కుమార హరిభట్టారకం బైన విస్తార ప్రకటితం బైన శ్రీమహాభాగవతం బను మహాపురాణంబునందు కలియుగ రాజవంశంబును కలియుగ ధర్మంబును। చతుర్విధ ప్రళయ లక్షణంబును, బ్రహ్మనిరూపణంబును పరీక్షిత్తు నిర్యాణంబును జనమేజయుని సర్పయాగంబును వేదశాఖా ప్రణయనంబును పురాణ లక్షణంబులును మార్కండేయోపాఖ్యానంబును విశ్వరూపంబును, సూర్య ప్రశంసయును, పురాణప్రస్థానంబును ననంబరగు ద్వాదశ స్కంధము సంపూర్ణము.

... ... ...

విశేషాంశములు:

ఈ ప్రతియందు ద్వాదశ స్కంధము మాత్రము హరిభట్టారక కృతమని కలదు. కాని ఈ ప్రతియందు ఈ మూడుస్కంధములు పూర్తిగా నున్నవి.

ప్రతి కొంత క్రిమిదష్టమై యున్నది. పత్రములు పాతబడినవి. లిపి స్పష్టము. కాని ప్రతివిలేఖనమున చాల దోషములు చ్యుతములు గలవు.

# శ్రీ మహాంధ్ర మహాభాగవతము
## దశమస్కంధ పూర్వభాగము
(ప్రతిపదార్థ తాత్పర్యములు

మానికొండ సత్యనారాయణశాస్త్రి)



ప్రారంభము

1. శ్రీకంఠ .... ఖండన, శ్రీకంఠ=శివునియొక్క, చాప=విల్లును, ఖండన = విరిచినవాడా, పాకారి .... భండన, పాకారి = ఇంద్రుడు, ప్రముఖ = మొదలైన వారిచేత, వినుత = బాగుగ ప్రశంసింపబడిన, భండన = యుద్ధముగలవాడా, విలసత్ .... మండన, విలసత్ = ప్రకాశించుచున్న, కాకుత్స్థవంశ = కాకుత్స్థ వంశమునకు, మండన = భూషణమువంటివాడా, రాకేందు .... విశాల, రాకేందు = పూర్ణిమనాటి చంద్రుని కాంతివంటి, యశోవిశాల = విస్తారమైన కీర్తికలవాడా, రామనృపాలా = శ్రీరామచంద్రమూర్తీ!

తా॥ శివుని విల్లును విరిచినవాడా, ఇంద్రుడు మొదలైన దేవతలుకూడ మిక్కిలి ప్రశంసించునట్లు యుద్ధము చేయువాడా, ప్రఖ్యాతమగు కాకుత్స్థవంశమునకు (వన్నెతెచ్చు) ఆభరణము వంటివాడా, పున్నమనాటి వెన్నెలవలె అంతటను వ్యాపించిన విశాలమగు కీర్తిగలవాడా, ఓ రామచంద్రమూర్తీ అని పోతన్నగారు తనఉపాస్యదైవమును, ఈ కృతికి భర్తయు నగు శ్రీరామచంద్రమూర్తిని ప్రప్రథమమున ధ్యానించుచున్నాడు. ఇది ధ్యాన శ్లోకము వంటిది.

2. మహనీయ .... శ్రేష్ఠులకు, మహనీయగుణ = గొప్పగుణములచేత, గరిష్ఠులగు = ఉత్తములగు, అమ్మునిశ్రేష్ఠులకు = నైమిశారణ్యములో సమావేశమైన ఆ మునిపుంగవులకు, నిఖిల .... సూతుండు, నిఖిలపురాణ = సమస్తపురాణములను, వ్యాఖ్యాన = అర్థతాత్పర్యభావాదులను చక్కగవిపులీకరించి చెప్పుటలో, వైఖరీ = వాక్చాతుర్య

ములతో, సమేతుండైన = కూడినవాడైన, సూతుండు, ఇట్లనియెన్, అట్లు = ఆ ప్రకారముగ (ఇదివరకు చెప్పినరీతిగ) పరీక్షన్నరేంద్రుండు = పరీక్షన్మహారాజు, శుకయోగీంద్రుం గనుంగొని = శ్రీశుకమహర్షిని చూచి.

తా॥ అప్పుడు నైమిశారణ్యములో సమావేశమైన మునిశ్రేష్ఠులకు, పురాణములను చక్కగ వ్యాఖ్యానించి చెప్పుటలో మంచి చాతుర్యముగల సూతుడు ఇట్లని చెప్పదొడంగెను. పరీక్షిన్మహారాజు శ్రీశుకుల వారిని చూచి ఈ క్రిందివిధముగ నడుగుచున్నాడు.

* * *

మంగింపు

144. ప్రకాశ .... కాశ, ప్రకాశ = కాంతితో, ఉద్ధత = ఎగురుచున్న, తుంగ = ఎత్తైన, భంగ = అలలచేత, కలిత = ఆవరింపబడిన, ధరా = భూమియు, ఆశా = దిక్కులును, ఆకాశ = ఆకాశమును గలదియు, అగు = అగునట్టి, యమున = యమునానది, మును = పూర్వకాలమందు, పయోధి = సముద్రము, సీతాధవునకు = సీతకుభర్తయైన శ్రీరామునకు, త్రోవఇచ్చినభంగిన్ = త్రోవఇచ్చినరీతిగ, ఆశౌరికిన్ = ఆ వసుదేవునకు, తెరువు = త్రోవ, ఒసగెన్ = ఇచ్చెను.

తా॥ (వ్రేపల్లెకు మధురానగరమునకు మధ్య యమునానది యున్నది. వసుదేవుడు బిడ్డను మధురలో చెరసాలనుండి నదికి అవల గొల్లలున్న నందుని వ్రేపల్లెకు తీసికొని పోవునప్పుడు, మధ్యత్రోవలో యమునానదిని దాటవలసి యున్నది. కాబట్టి)

ప్రకాశవంతమైన ఆకాశమంతఎత్తు ఎగురుచున్న అలలుగల యమునానది-పూర్వము సీతకొరకై లంకమీదికి పోవుచున్న శ్రీరామచంద్రునకు రామేశ్వరము వద్ద సముద్ర మెట్లు త్రోవ యిచ్చెనో అదే రీతిగ ఇప్పుడు యమునానది వసుదేవునకు తన బిడ్డను వ్రేపల్లెకు చేరవేయుటకుగాను త్రోవ యిచ్చెను.

o o o

విశేషాంశములు:

ప్రతి బాగున్నది. లిపి స్పష్టము. దశమస్కంధ పూర్వభాగములోని 144పద్యములకు మాత్రమే ఇందు ప్రతిపదార్థ తాత్పర్యము లున్నవి.

# శ్రీమదాంధ్రమహాభాగవతము

## దశమ స్కంధము పూర్వభాగము.

### కృష్ణదాసు



ప్రారంభము

........ మందు నమరాదు .... నట్టి పీచు
.... గు ద్రోణ భీష్మాదులగు నతిరథుల నె ........ మీనంబుల జపాళ మగుచు
దాట శక్యముగాని మేటికౌరవసైన్య మును జలనిధి .... యడుగుగాగ
జేసి చులుకన దాటిరో .... చిత్ర మయ్యె నట్టి కృష్ణుని చరితము .........
వినగవినగ మాకును మదిలోన వేడ్క బుట్టె .... సర్వజ్ఞ దెలుపుము మౌనితిలక.

వ. ఇదియునుంగాక నో స్వామీ నా గర్భ మందున్న బాలుని రక్షింపుము రక్షింపు మని మొరపెట్టుతూ నున్నదై తనను రక్షకునిగా నాశ్రయించిన మాతల్లి మొరయాలకించి మదీయ మాతృగర్భంబులో చక్రహస్తుండై ప్రవేశించి యశ్వద్ధామ బాణానల దందహ్యమానంబగు నా దేహంబును కౌరవ పాండవ సంతానకారణముగా తెలిసి రక్షించెనో బ్రహ్మాది సర్వజీవుల లోపల వెలపల నంతర్యామి .... ఏకాల రూపంబుల నర్తించుతూ నున్నవాడైన యీ దేహధారుల కెల్ల జన్మమరణాది రూపసంసారం .... ను మోక్షంబు నిచ్చునట్టి లీలామానవ వి .................. శ్రీమన్నారాయణుని ప్రభా ........ సూచకంబులగు కర్మంబులు తేటపడ వివరింపు మిదియునుంగాక సప్తమ మాసంబున దేవకీజఠరంబువలన యోగమాయచేత తియ్యబడినవాడై వాయుపూరిత రోహిణీ జఠరంబున నుంచబడిన వాడుగావున సంకర్షనుండని ప్రసిద్ధుండైన రాముడు రోహిణీపుత్రుం డని మున్ను నీవు తెలిపితివి, దేవకీజఠరంబున నున్న రాముండు దేహాంతరము జెందక నెట్లు రోహిణీ జఠరంబున ప్రవేశించె నదియునుంగాక

ఉ. ఎందుకు నమ్మకుందుడు మహేశుడు తండ్రిగృహంబు బాసి తా
నందుని పల్లె జేరె యదునాథుడు జ్ఞాతుల ?హి యెందు నిం
పొంద వసించె ఘోషమున నుండియు నమ్మధురాపురీవరం
బందుల నుండియున్ జలరుహాక్షుడు కార్యము లెవ్వి చేసెనో.

క. తనతల్లికి సోదరుడును తనకును మామయును చంపి .... ట్టి మహా
జనపతి కంసుని నేటికి వనజాక్షుడు సంహరించె వైభవ మొప్పన్.

క. లీలామానవ దేహము దాలిచి హరి యెన్ని యేండ్లు ద్వారక లోనన్
శ్రీలలితు లైన యదువుల తో లీలన్గూడి ........ తుష్టం దగుచున్.

ముగింపు

చ. అవనిపదంబు నీకు ముఖ మగ్నియు శ్రోత్రము లాశ లక్షులున్
రవి విధు లీశ నీకును శిరంబు దివంబు నభంబు నాభి వా
సవముఖులౌ సుధాంధులు భుజంబులు రేలుపవళ్ళు రెప్పలం
బువులును శుక్లమయ్యె నఖముల్ శిల లద్రులు శల్య సంఘముల్.

చం. పరుడగు నీకు మారుతము ప్రాణబలంబులు నయ్యె రోమముల్
తరువులు సస్యపంక్తులు లతాతతు లయ్యెను కేశముల్ పయో
ధరములు నయ్యె నీకు ప్రపదంబు రసాతల మయ్యె కుక్షియున్
శరనిధు లయ్యె మేఢ్రము ప్రజాపతి యయ్యెను నీకు కేశవా.

వ. దేవా నీకు చరాచర ప్రపంచంబంతయు .... రీరం బయ్యెను నిఖిలప్రపంచ గతం ....
........ సుఖదుఃఖాది వికారంబులు నిర్గుణ ...........వు భగవంతుండ వైన నీయందు
...........................

విశేషాంశములు

ప్రతి అసమగ్రము. కాగితపుప్రతి. ప్రతి అలతిగా క్రిమిదష్టము. కొన్నిపత్రములు లోపించినవి. వ్రాతస్పష్టముగా నున్నది. గ్రంథాద్యంతములు లేవు. వ్యాసుడు వ్రాసిన

సంస్కృత భాగవతము నందలి దశమస్కంధ పూర్వభాగమునకు 'యథాశ్లోక తాత్పర్య ముగా' చంపూరీతిలో వ్రాయబడిన గ్రంధము.

# శ్రీమదాంధ్ర మహాభాగవతము

దశమ స్కంధము

ఉత్తరభాగము

## కృష్ణదాసు

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం. | : 1729 | కాల్ నెం. | : టి 3-490 |
| ప్రతి | : కాగితము; సమగ్రము. | పత్రములు | : 177 |
| ప్రతి పరిమాణము | : 31×17.7 సెం.మీ. | పుట పంక్తులు | : 33 |

ప్రా రం భ ము :

క. శ్రీరాజిత శీతాముఖ సారస భృంగాయమాన జల .... ధిశయనా
ఘోరా సూరి (?) విరామా శ్రీరామా రఘుకులాబ్ధి శీతల ధామా॥

శ్రీరామానుజ చరణాం భోరుహములకు ప్రణమిల్లి మునికృతమై పెం
పారెడు నుత్తర దశమము పౌరాణికు లలర నాంధ్రభాష రచింతున్॥

వ. ఇట్లు జాంబవతీ సత్యభామాది వివాహంబుకన్న మున్నె ప్రద్యుమ్నుండు పుట్టిన వాడని యనంతరంబు వివాహంబని యనంతరంబు శంబరుని గృహంబువల్ల నుంచి ప్రద్యుమ్నుండు మరల వచ్చిన వాడాయను గావున పుత్ర కథనాప్రస్తావ మందైనా పూర్వంబున జాతమాత్రుం డగు ప్రద్యుమ్నుని దశవాసరంబులు వెళ్ళకమున్నె పురిటి యింటిలోనె శంబరాసురుండు స్వచ్ఛందం బగు వ్యాఘ్ర సింహాదిరూపంబు గలవాడై యపహరించె నని ప్రద్యుమ్ను ప్రత్యాగమనంబు నుత్తర కాలీనం బయ్యును కథా పర్యవసానంబుకొరకు మునుచెప్పబడెనని వాసుదేవాధిష్ఠిత చిత్తాఖ్యవ్యూహంబువలన పుట్టిన వాడై నందున వాసుదేవాంశుండైన మన్మథుండు పూర్వంబున రుద్రకోపాగ్ని

దగ్ధుండై మరల సృష్టినిమిత్తంబై దేహప్రాప్తికొరకు నా రుద్రుణ్ణి రక్షకునిగా జెందిన వాడాయె నా మన్మథుండె కృష్ణుని ప్రభావమువలన శుక్లంబువలన రుక్మిణీదేవియందు పుట్టినవాడై ప్రద్యుమ్నుండని ప్రసిద్ధుండై సమస్తంబులైన శౌర్య ధైర్య సౌందర్యాది గుణంబులచేత నిజజనకుండగు కృష్ణునితో సమానుడా యన నీ శుకయోగీంద్రుండు రాజేంద్రునితో నిట్లనియె॥

గీ. తలప వాసుదేవాధిష్ఠిత మగు చిత్త మందు పుట్టిన వా డట్టి యంగజుండు
వాసుదేవాంశ డని చెప్పబడియె మున్ను నతడె హర కోపవహ్ని దగ్ధాంగు డయ్యె॥

గీ, అథవ నయనాగ్ని దగ్ధాంగు డైన మరుడు మరలదేహంబు నొందుటకొరకు నా య
భవునె శరణంబు నొందె నా పంచశరుడె కృష్ణవీర్యంబువలన రుక్మిణికి బుట్టె॥

క. ఘన నిఖిల గుణంబులచే జనకుం డగు కృష్ణుతోడ సదృశుండై యా
మనసిజుడే ప్రద్యుమ్నుడ ని నెరిప్రసిద్ధు డయి రుక్మిణీ సుతుడయ్యెన్॥

క. పురిటింటె నున్న దశవా సర శిశువు నరినిగ దలచి శంబరు డతనిన్
హరియించి కామరూపి య యి రహిజలధిలోన వైచి యింటికి జనియెన్॥

క. బలయుత మగు నొక మత్స్యము జలగతు బాలకుని మ్రింగె జలచర జీవుల్
బలువలలోన బడిన యా జలచరమును బట్టి రన్యఝుషములతోడన్॥

క. ఘనచిత్ర మీనము నుపా యనముగ శంబరుని కిచ్చి రా దాసులు దా
నిని వంటవాండ్లు గొని చ య్యన ద్రుంచిరి ఖడ్గమున సహోనస మందున్॥

వ. మహాద్భుత ఝుషమును.

క. జలచర గర్భమునందును నలరెడు నా బాలు జూచి యా సూదజనుల్
బలుమాయలుగల రతి యను నలినాక్షికి నిచ్చి రంత నారద మునియున్॥

ముగింపు :

క. మనుజుడు దేహాంతమునం దు నవసరోజ దళలోచనుడు పరు డగు కృ
ష్ణుని దైవభక్తిచేతను ఘన మగు వైకుంఠపదము గాంచును నీకున్॥

మ. ఇన నాచే వివరింపగా బడిన యీ కృష్ణానుభావాఢ్యమున్
ఘనమౌ కృష్ణుని సత్కథామృతము పానంబున్ వెసన్ జేయుచున్
జను లీలోకములన్ సుఖంబుల ననూనశ్రీలతోడన్ భుజిం
చిన వారై తుదిగాంతు రచ్యుతునిదౌ శ్రీవాసవైకుంఠమున్॥

క. అని యిట్లు వ్యాసతనయుడు మన మలర సురేంద్రతనయు మనుమనితోడన్
వినుపించి నట్లు సూతుం డనఘుడు వివరించె శౌనకాది మునులకున్.

క. విని శౌనకాది మౌనులు వినయంబున బహువిధముల వినుతించుచు సూ
తుని ప్రీతుజేసి కృష్ణ క థన తత్పరు లైరి బుద్ధి దరగని భక్తిన్॥

తరళము. కనకకుండల కాంతిమండిత గండమండల మండనా
వననిధీశ శయానవారిజ వాసినీకృత సేవనా
వనరుహాసన వంద్యమాన నవస్మితేందు సమాననా
దనుజభంజన పద్మలోచన దాసపాప విమోచనా॥

క. నవనాగేశ శయన రై పవనారముగా వశిఘనపవనా భవ తా
పవనానలరక్షిత ముని సవనా సవనాశన గిరిజాకృతనవనా॥

మాలిని. మునిజనవనచైత్రా మూర్ఖదైత్యాళిజైత్రా
వనరుహదళనేత్రా వాస్తవస్తోత్రపాత్రా
కనకకలశనేత్రా కంధికవ్యాకశత్రా
ఘనకరధృతగోత్రా కంధరానీలగాత్రా।

గద్య

ఇది శ్రీమద్రామానుజాచార్య చరణారవింద మిళిందాయమాన మానసవిలాస భార ద్వాదసగోత్ర వెకిమెల కొండమాచార్య పౌత్ర తిరుమలాచార్య పుత్ర కృష్ణదాసప్రణీతం బైన భాగవత పురాణంబునందు యథాశ్లోక తాత్పర్య దశమస్కంధమందు ప్రద్యుమ్న జన్మంబును; ప్రద్యుమ్ను నపహరించి శంబరుండు సముద్రంబున వైచుటయు, ప్రద్యుమ్న మీనగర్భ ప్రవేశ పునర్బహిః గమనంబులును, శంబరుని వధయును, భార్యా సమేత ప్రద్యుమ్న పునరాగమనంబును సత్రాజితుండు సూర్యదత్త శమంతకమణి కంఠుండై మార్గంబున జనుదెంచుచుండ నతనిం జూచి ప్రజలు సూర్యుండని శంకించి హరికి విన్నవించుటయు, నతండు దేవగృహంబున మణి నిడుటయు, ప్రసేనుం డొకనాడు మణికంఠుండై వేట కడవికేన్ జనిన నతని వధియించి సింహంబు మణిగొని జనుచుండ జాంబవంతుండు సింహంబును వధియించి మణిని గైకొని గుహలోనికిన్ జని కుమారుమణికి క్రీడార్థం బామణిని తొట్లకు కట్టుటయు సత్రాజితుండు మణికై కృష్ణుండు నా తమ్ముని వధియించె ననిగుజగుజలాడుచుండ కృష్ణుండు విని మృషాప వాదంబు పరిహరించుటకై తనవారు ప్రసేనుజాడ దెలుప నరిగి గుహలోనికిన్ బోయి తొట్లకు కందుకంబుగా గట్టిన మణినపహరించి మెల్లమెల్లన జనుచుండ వానిదాది మొరపెట్టిన జాంబవంతుం డరుదెంచిన నతనితో యుద్ధంబు జేయుటయు, నతండు కృష్ణుండు పరమాత్ముండని యెరింగి యతనికి జాంబవతిని మణినిచ్చిన వాని గైకొని కృష్ణుండు మరల జనుదెంచి సభలో గూర్చుండి మణిని సత్రాజిత్తును బిలుపించి మణి నిచ్చిన నతండు మణిని బుచ్చుకొని సిగ్గుపడుచు తనయింటికిన్ జని బలవద్విరోధంబు నకు శంకించి తనకూతురైన సత్యభామను మణిని కృష్ణునకు సమర్పించుటయు కృష్ణుండు మణిని సత్రాజిత్తుకు మరల నిచ్చుటయు, సత్యభామా జాంబవతీ వివాహం బును పాండవులు లాక్షాగృహంబున దగ్ధులైరనిన విని రామకృష్ణులు కరినగరంబు నకున్ జనుటయు శతధన్వుండు కృతవర్మాక్రూరప్రేరితుండై సత్రాజిత్తును వధించుటయు సత్యభామ పితృమరణ శోకాయత్తచిత్తయై కరిపురికిన్ జని రామ కృష్ణులకు పితృ మరణం బెరింగించిన వారుమరల నరుదెంచి శతధన్వుని వధించ దొరకొనిన విని శతధన్వుండు ప్రాణభీతుండై మణి నక్రూరుని కడనిడి శత యోజన దూరంబు పలాయమానుం డగుటయు, రామకృష్ణులు రథారూఢులై వాని వెను తవిలి జనుటయు నందు కృష్ణుండు శతధన్వుని వధించి వానికడ మణి లేదని యన్నకుం జెప్పుటయు, రాముండు మిథిలకుం జనుటయు నచటికి దుర్యోధను డరుదెంచి రాముని కడ గదావిద్య నభ్యసించుటయు, కృష్ణుండు మరల నరుదెంచి యూరకే శతధన్వుండు

హతుఁ డయ్యె నతనికడ మణి లేదని సత్యభామతోఁ జెప్పుటయు, కృష్ణుండు సత్రాజిత్తుకు పారలౌకిక కర్మంబులు జేయించుటయు, అక్రూర కృతవర్మలు కాందిశీకులై యెందేని దూరదేశంబునకుం జనుటయు నందక్రూరుండు లేమిం జేసి దేశంబున ననావృష్టి క్షామ మారీడాంబికాదులవలన ప్రజలు నసించిన నందు వృద్ధజనులు శ్వఫల్కుని వృత్తాంతం బెఱింగించి తత్పుత్రుండగు నక్రూరుండు నంతటి వాఁడగుటం జేసి యతండు మరలివచ్చిన ప్రజల పీడలు మానునని కృష్ణుండు నక్రూరుని పిలువ నంపుటయు, నతని కడనున్న మణిని గైకొని మరల నక్రూరుని కిచ్చుటయు, కృష్ణుడింద్రప్రస్థపురంబున కరుగుటయు నందు ధనంజయుతోడం గూడి యడవికిం యాటకై యరుగుటయు, నందు సూర్యకన్యాపరిణయంబును, నగ్నిదేవుండు సవ్యసాచికి నక్షయ బాణంబులగు తూణీరంబులను, గాండీవ చాపంబును, కవచ రథ హయంబు లిచ్చుటయు, ఖాండవవనం బగ్నికి సమర్పించి దేవతల జయించుటయు, నందగ్ని భయంబువలన ముక్తుండై మయుండు ధర్మరాజునకు సభనిచ్చుటయు, మిత్రవిందానాగ్నజితీ భద్రాలక్షణల పరిణయంబును, నరకాసుర సంగరంబును, నందు కారాగృహ నిరుద్ధలైన రాజకన్యల బదారువేలను గైకొనుటయు, సత్యభామతో గరుడారూఢుండై స్వర్గంబునకుంజని యదితి కుండలంబు లిచ్చుటయు, పారిజాతాపహరణంబును, నింద్రాదిదేవతల పరాజయంబును, షోడశ సహస్రనరేంద్ర కన్యాపరిణయంబును, రుక్మిణీహాస్యంబును, రుక్మిణీ స్తవంబును, కృష్ణతనయ జన్మకథనంబును, ప్రద్యుమ్న రుక్మవతీపరిణయంబును, రోచనానిరుద్ధుల పరిణయంబును, బలరామ రుక్ముల ద్యూతంబును, నందు రుక్మివధంబును, బాణాసుర సంగరంబును బాణభుజనికృంతనంబును, నుషానిరుద్ధుల వివాహంబును, నృగ వృత్తాంతంబును హలాయుధుండు నందవ్రజంబున కరుగుటయు, హలాగ్రంబున యమునానదిని పెకలించుటయు, పౌండ్రక వాసుదేవకాసీరాజ సంహారంబును, సుదక్షుణుం డభిచారహోమం బొనర్చుటయు, కృష్ణుండు చక్రంబుచే కృత్తిసుదక్షిణా యుక్తంబుగా కాశీపురంబును దహింపచేయుటయు, ద్వివిధ వానర వధంబును, సాంబుండు సుయోధన పుత్రస్వయంవరంబున కౌరవులకు పట్టుబడుటయు, హలాయుధుండు హస్తినగరంబును బెకలించి గంగానదియందు బడవేయ గమకించుటయు, నారదుం డష్టశతాధిక షోడససహస్ర మూర్తియగు కృష్ణునియోగ మాయాప్రభావంబు నెరుంగం దలంచి ద్వారవతీనగరంబునకు నరుగు దెంచుటయు, రాజసూయ ప్రభావంబును, జరాసంధ సంహారంబును, రాజసూయ యజ్ఞంబును, శిశుపాల దంత

వక్త్రవిదూరకాదిసంహారంబును, హలాయుధ తీర్థయాత్రాకరణంబును నందు సూతుని సంహరించి మరల బ్రతికించుటయు, భీమ సుయోధనుల గదాసంగరంబును, రాముండు నా పవనతనయ సుయోధనులను నివారించిన వాడు వెనక పోవుటయు మరలి ద్వారకా పురికిన్ జనుటయు నందుండి మగుడినై మిశారణ్యంబునకు జని యజ్ఞంబు గావించుటయు మరలి నిజపురంబున కరుగు దెంచుటయు, కుచేల వృత్తాంతంబును, కృష్ణ బలభద్రులు వసుదేవాది యాదవు లందరు శమంతపంచకంబును, పుణ్యక్షేత్రంబునకు జనుటయు నందు రామకృష్ణుల జూచుకొరకు కృష్ణద్వైపాయనాది మహామునులు జనుదెంచుటయు. కుంతి కృష్ణునిజూచి ప్రార్థించుటయు, రామకృష్ణులు మునుల పూజించుటయు, కృష్ణుని జూడ నిశ్చయించి దిగ్దేశాధీశ్వరులు. ధృతరాష్ట్ర దుర్యోధనామలు జనుదెంచి సంత సించుటయు, రామకృష్ణులు వారల పూజించుటయు, వారు రామకృష్ణుల నుతించుటయు నంద యశోదాది గోపగోపీ జనంబులు కృష్ణుని జూచి సంతోషించుటయు. కృష్ణుండు వల్లవపల్లవాధరులకు జ్ఞానోపదేశంబు జేయుటయు మద్రరాజుకూతు రగు లక్షణదేవి తన వివాహ వృత్తాంతంబును ద్రౌపదితో వివరించుటయు, వ్యాసాదిమహామునులు కృష్ణుని సందర్శనంబుకొరకు నరుగు దెంచిన రామకృష్ణులు వారల నెదుర్కొని ప్రత్యుత్థానంబుచేసి పూజించుటయు, వారిసహాయంబున వసుదేవుండు యజ్ఞం బొనర్చుటయు, రామకృష్ణులు శ్రుతదేవజనకులం జూచుటయు, సుభద్రాపరిణయంబును మిథిలానగరంబునకు రామకృష్ణులు జనుటయు, రామకృష్ణులు దేవకీపుత్రులం దెచ్చుటయు, శ్రుతిగీతలు శాకు....యవృత్తాంతంబును, మృతబ్రాహ్మణ పుత్ర పునరా నయనంబును, త్రిమూర్తులయందు పరతత్వం బెరుంగుటకై భృగుండు వారలకడకున్ జనుటయు, శ్రీకృష్ణ ప్రభావవర్ణనంబును నను కథలుం గల యుత్తరభాగంబు సంపూర్ణము.

**విశేషాంశములు:**

**ప్రతి విలేఖనము**

రక్తాక్షి నామసంవత్సర ఆశ్వీజ శుద్ధ త్రయోదశీ గురువారం.

ప్రతి చక్కనిది. సమగ్రము. కాగితపుప్రతి. వ్రాత స్పష్టము. వ్రాత దోషములుకలవు. బమ్మెర పోతన భాగవతమునందలి దశమస్కంధ ముత్తర భాగమునకు దీనికి భేదము గలదు. కథావిషయములలో సామ్యము గోచర మగుచున్నను, కథన విషయమునందు వర్ణనా విషయములందు భేదము స్పష్టముగా కనబడుచున్నది.

# శ్రీమదాంధ్ర రామాశ్వమేధము

వేంకటాచార్యులు



ప్రారంభము :

క. పరమున్ ధరణీధరు ఫణి వరు నుద్దేశించి పలికె వాత్స్యాయనుఁ డా
దరమునఁ బూర్వచరిత్రల గర మాకర్ణించబోవు కౌతుక మెసగన్.

సీ. వినిపించితివి వేయివేల గూఢంబులై తగుమహదాదిక తత్వములను
వివరించితి దురూహ విషయంబులైన భూ గోళ ఖగోళ విశాలతలను
నెఱిగించితివి సుధీబృంద దుర్గ్రాహ్యమై వెలయు జ్యోతిశ్చక్ర విధము నెల్ల
వచియించితివి సర్వవసుమతీపాలుర పరమపావనకథా పటలములను

గీ. నానతిచ్చితి నీరేరుహాప్త వంశ సకలమూర్ధాభిషిక్తుల చరిత లెల్ల
రాజకులసోము నయనాభిరాము రాము (వాజి) మేధంపు చరిత నీవలన మున్ను
వింటి సంగ్రహముగ మఱి విస్తరముగ వినఁగ దివిరెడు చిత్తంబు వినుచు మనఘ.

గీ. పరగ వినబడ్డ స్మరియింప బడినగాని కొలది వోవును గోర్కులు కలుగుచుండు
దద్దవేర్కి యెసగుగాన దశరథాత్మ జాతు చరితంబు సామాన్యమే తలంప.

వ. అనిన శేషం బిట్లనియె.

ఉ. ఈ విధి జానకీవరసమీడిత పాదమరప్ద బిన్దుకాం
తావతి యయ్యె నీ మతి యికన్ గడుధన్యుడ వైతి మౌనిప
ర్యా వివరింప సాధుల సమాగమ ముత్తమమై చెలంగుగా
జే వసుధాత్మజారమణు పుణ్యకథాళి ప్రశంస గల్గుటన్.

గీ. దేవదానవ కోటీర దివ్యరత్న కిరణజాల పిరాజిత చరణయుగళు
నఖిలసుగుణాఢ్యు వరధనుషాగ్రగణ్యు స్మరణ చెప్పించి కృప గనపరిచి తనపు

చ. తులుపను రావణాసురుని ద్రుంచిన రాము కథార్థ పారమున్
నలువయ మున్నుగాంగ సుమనస్తతులే కన లేరటన్న న
ల్పుల మము బోటులన్ నుడువ బోలునె దోమల మాద్రిగాక నా
తెలిసినయంత దత్కృప మతిన్ స్ఫురియించిన యంత దెల్పెదన్.

ముగింపు

ఉ. కేతకి గర్భపత్రముల గేరుతనుద్యుతు లొప్ప. గాంచు నా
భీతమృగాయతేక్షణల విశ్వవిమోహన కృత్యలాకులా
యాతత యంచు నెమ్మదికి హర్షము గూర్ప నృపాలనందను
డాతటి వారిగూడి కుసుమాపచయం బొనరించె వేడుకన్.

చ. వకుళ కురంటకక్రముక పాటల కేసరి కర్ణికారముల్
వికచ పయోజ నీప కరవీర రసాల గుళుచ్ఛ మల్లికా
ముకుళము లాదియౌ సురభిపుష్పసరంబు లలంకరించి యు
త్సుకలను జేసి కాంత లెడ జొక్క గరంచె నతండు లీలలన్.

వ. మరియు నా రాజకుమారుడు.

చ. చెలఁగి శ్రమోద్గతాంబుధులచే నభిషేక మొనర్చి లోఁ మం
జులకబరీ వినిర్గళిత సూన సమర్పణ మాచరించి కో
మల మధుర శ్రుతిన్ మణిత మంత్రములుం జెలఁగన్ విభుండు పూ
విలుతుఁ గృతార్థుఁ జేసి తనివింగన బత్ని శతాన్వితంబుగన్.

చ. మృదుచతురోక్తులన్ నుతుల మేలములన్ బహుమాన నైపుణీ
ముద మొదవించి తానును సమందముదంబున దేలి నేర్పునన్
మదవతులం గరంబు స్మరమంత్ర విముగ్ధలుగాగజేసె య
మ్మదన మనోహరాంగుడగు మానవనాథ కుమారు డెంతయున్.

మ. తనుకాంతుల్ వని వెన్నెలల్ కురియఁగా ధాత్రిం బురాగ్రాభిసు
ట్టనఁ జూర్ణించుచు ఫాలహేమమయ పట్ట ద్యోతమాన ప్రభల్
కనుదోయిన్ మినుమిట్లుగొల్ప నతివేగః బొప్ప దోతెంచు పా
వనయాగాశ్వ వతంస మచ్చెరువు దోపం గాంచి రయ్యంగనల్.

చ. కలపపుహూత లోవెలి జగాజిగి మేల్వలిపంబు క్రొంజరీ
వొలుపొసఁగన్ నితంబినులు పుష్పధనుర్విహృతి ప్రశాంతికై
కలితసుమాభిరామ సహకార కుజంబుల చల్లనీడలన్
మెలఁగుచు గంధబంధుర సమీరకుమార నిషేవ్యమాణలై.

గద్య

ఇది శ్రీరామచంద్ర కరుణాపాత్ర కౌండిన్య సగోత్ర కృష్ణార్యపుత్ర సుజనసేవాధుర్య వేంకటార్య ప్రణీతంబైన శ్రీమదాంధ్ర రామాశ్వమేధంబున ప్రథమాశ్వాసము.

విశేషాంశములు

వ్రాయసకాని పేరుకాని, కాలముగాని పేర్కొన బడలేదు. గ్రంథాద్యంత్యములు లేవు. కాగితమునకు ఇరువైపుల వ్రాయబడినది. వ్రాత స్పష్టత పోనుపోను కొరవడినది. వ్రాత దోషములు, తుడుపులు, కొట్టివేతలు అధికముగా గలవు. గ్రంథము మధ్యలో

కొంతభాగము వ్రాయుటకు వదలివేయబడినది (౯౨-౯౩-౯౪ సంఖ్యలుగల పుటలు) ౧౧౮ వ సంఖ్య గల పుట ప్రారంభంబున "శ్రీసోమగ్రామమాహాత్మ్యము" అని వ్రాయబడి యున్నది. 147 వ సంఖ్యగల పుట ఆరంభంబున "ఇది శ్రీ అరణ్యకథాశేష పూరణము సమాప్తము." అని వ్రాయబడి యున్నది. మరల ౧౫౨ వ సంఖ్య గల పుటయందు "శ్రీరామాశ్వమేధము" అని వ్రాయబడి యున్నది. ౯౦ వ సంఖ్య గల పుటనుండి ఇక గ్రంథము వ్రాయబడలేదు. మొదటి అట్ట పైభాగమున నీ క్రింది విధముగా వ్రాయబడియున్నది.

గ్రంథకర్త : కీ. శే. వి. వెంకటాచార్యులు.

నివాసస్థలము. ఇం.నెం. ౧౬౮/ ఎస్.ఆర్.టి/కాలని
యాకుత్‌పురా, హైదరాబాదు - ౨౩ ఏ పి.

## శ్రీమద్రామాయణము

అరణ్య, కిష్కింధ సుందరకాండలు

కామసముద్రము అప్పలాచార్యులు

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 473 | కాల్ నెం | : టి 8-357 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము. | పత్రములు | : 817 |
| ప్రతి పరిమాణము | : 49 × 3.5 సెం.మీ. | పత్రపంక్తులు | : 7 నుండి 8 |

ప్రారంభము

శ్రీరమణీ రమణీయ మ ణిరంజిత హృదయదేశ నిఖిలాధీశ
స్ఫారకృప హేమనృప ల క్ష్మీరత గద్వాల నగర కేశవ శౌరీ ॥

వ. అవధరింపు మవ్వలికథ విన్నవించెద.

క. అనివార్యుడు రఘువర్యుడు ఘనతరధైర్యుండు దండకావనము మహా
వనము ప్రవేశ .... .... .... జనతాశ్రమ సమూహమున్ గనుగొనియెన్ ॥

సీ. వల్కల కుశల పరివ్యాప్తమై యలరారి బ్రాహ్మీ లక్ష్మీ సమాక్రాంత మగుచు
నశ్ర.... నజ్ఞా .... .... .... .... చూడ్క గమ్యమై తనర్చి
యనయంబు నిఖిల భూతావాస యోగ్య....మా.... కృతాంగణమై....
మృగ....ణ ...మై ఖగసమావృత్తము నై నికటీకృతాప్సరో....త్సా ....గను
జెలగి పూజ్య మగుచు సృగ్భాండములచేత నాయతాగ్ని మండిరాళి ....
మా....ల ఫల....శాంబుపాత్ర మిచ్చు .... ములచేతనిత్య....మంద !

ముగింపు

.... నాచేతన్ బంపింపం బడియె యనఘాత్మసకలంబులయెడ నీమణిన్ దర్శించి నిన్నుం జూచినయట్ల సంతోషించెదను. దశరథాత్మజా యొక్క మాసంబు జీవితంబు ధరియించియుండెద.... లుం బేని జీవితంబునం జెందక యుండెద యని గృశాంగియు, ధర్మచారిణియు, రావణాంతఃపుర నిరుద్ధయును, మృగాంగనయునుంబోలె నుత్ఫుల్ల లోచన యగు సీత ఈ రీతి నన్నున్‌గూర్చి పలికె రఘునా........థా క్రమంబుగా సర్వంబును నిర్వచింపనయ్యెన్ గావున భయదంబును నదీనదపతియగు సాగరంబును వేగంబున నీవు సైన్య సహితంబుగా నిరీతి నుత్తరింపంగల వట్టి యొక్క విచారంబు విచారింపుము.... ....గా నాచేత బలుకం బడియె సర్వవిధంబుల సాగరజలంబున బెంతయు చింతింపందగునని నా రాజపుత్రుల నూరడింపం బడిన వారిన్‌గా సంతరణం బెరింగి నయ్యభిజ్ఞానంబును రఘుపుంగవున కొసంగి యానుపూర్వికం.... .... ర్వంబు సమగ్రంబుగా వాక్యంబుచేత వాయుసూనుండు ప్రశంసించె నన్నది షష్టితమ సర్గంబు.

గద్య

ఇది శ్రీమత్‌లక్ష్మీపుర ప్రసన్న వేంకటేశ్వర కరుణాకలిత చతుర్విధ కవితా నిర్వాహక శ్రీమదహోబిల శ్రీనివాస మునివరకృపా కటాక్షలబ్ధ విద్వత్కవికుంజర బిరుదాంకిత శ్రీమద్గద్వాల హేమభూమి పాలకాస్థాన భూషణాయమాన శ్రీమత్కామసముద్ర వంశపయః పారావారరాకా శశాంక శ్రీమత్కౌండిన్య సగోత్రోద్భవ శ్రీ శ్రీనివాసాంబా గర్భశుక్తి మౌక్తికాయమాన శ్రీ మత్కృష్ణమాచార్య పుత్రాప్పలాచార్య ప్రణీతంబైన శ్రీమదాంధ్ర రామాయణ మహాకావ్యంబునందు యథాశ్లోక తాత్పర్యంబుగా తెనుగించిన కిష్కింధాకాండంబునందు రాఘవుండు పంపాసరోవరప్రాంత కాంతారంబున సీతా వియోగ విహ్వలుడై దిరుగుటయు, సుగ్రీవుండు శర శ ........ ప్రాణులగు నా రామ లక్ష్మణుల గనుకొని, వీర లవ్వాలి పంపున వచ్చిన....వలని కాందిశీకుం డగుటయునను సుగ్రీవాలోచనంబును హనుమదాగమనంబున రాఘవు ........ లక్ష్మణుం డారఘువరు వృత్తాంతం బాహనుమంతునితో దెలుపుటయు, నత డాదాశరథులన్ దపనతనయునిన్ డాయదోడ్కొని పోవుటయు, నతడగ్ని సాక్షికంబుగా నా రామవునితో సఖ్యంబొనర్చి. యాత్మవృత్తాంతం బంతయు నెరుంగ పల్కుటయు,రాఘవుండు వాలివధంబు నొనర్చు టకు కృతప్రతిజ్ఞుం డగుటయు, సప్తతాల భంజనంబును, దుందుభి కళేబరోత్క్షేప ణంబును, సుగ్రీవుండు మిత్రమంత్రి సమేతుండై కిష్కింధాప్రాంతము ప్రవేశించుటయు, వాలిసుగ్రీవ యుద్ధంబును, సుగ్రీవపలాయనంబును, రాఘవుండును సుగ్రీవునిన్‌గని యూరార్చి గజపుష్పమాలారోపణంబు సేయించుటయు, మరియును వాలిసుగ్రీవ యుద్ధంబు, వాలివధంబు తారావిలాపంబును, సుగ్రీవుం డన్న కౌర్ధ్వదేహంబు లాచరిం చుటయు రాఘవుండు ఋశ్యమూకంబున వర్షాసమయంబు నిర్వర్తించుదనుక నుండుటయును, సుగ్రీవుండు రాఘవానుమతంబున కిష్కింధానగరంబున పట్టాభి షిక్తుడై తారాసమేతుండై సుఖంబుగా నుండెనను కథలు కల్గిన ప్రథమాశ్వాసము.

విశేషాంశములు

ఇందు మూడుకాండలు మాత్రము కలవు. (అరణ్య, కిష్కింధ, సుందర కాండలు సుందరకాండ సంపూర్ణముగా లేదు. గ్రంథాది లేకపోవుటచే కవి వంశాదులుగాని, కృతికర్త వంశాదులుగాని దెలియుట లేదు.

గ్రంథము క్రిమిదష్టమై యున్నది. పెక్కు పత్రములు శిథిలావస్థలో గలవు. ఆశ్వా సాంతగద్యవలన ఈ కవి లక్ష్మీపురముననున్న వేంకటేశ్వరుని భక్తుడనియు అహోబిల

శ్రీనివాసమౌని కృపకు పాత్రుడనియు, గద్వాల సంస్థానమున నున్నట్లుగాను, చతుర్విధ కవిత్వములయందు నేర్పరిగాను (విద్వత్కవికుంజర అను బిరుదము కలవాడుగాను) తెలియుచున్నది.

ఇందు అరణ్యకాండ 3 ఆశ్వాసములు.

కిష్కింధాకాండ 3 ఆశ్వాసములు.

సుందరకాండ 2 ఆశ్వాసములు కలవు.

# శ్రీముఖలింగ క్షేత్రమాహాత్మ్యము

## తారావళి సహితము

## కాకరపర్తి కృష్ణకవి

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 2824 | కాల్ నెం. | : డి 3-222 |
| ప్రతి | : కాగితము; సమగ్రము. | పుటలు | : 94 |
| ప్రతి పరిమాణము | : 17×21 సెం.మీ. | పుట పంక్తులు | : 21 |

ప్రారంభము

శా. శ్రీమద్భూధరకన్యతో సమతకై శేషాత్మకాయార్థముల్
ప్రేమన్ గంగ కొసెంగెనో యని మనోపీథిన్ స్మితానంద సు
త్రామాదుల్ తనదేహకాంతి దలపన్నారిల్లు సర్వజ్ఞు న
త్యామోదం బెసగం భజించెద మదీయాభీష్ట సంసిద్ధికిన్.

మ. పతిదేహమలకాంతి నొప్పు తన దీప్యన్నీలతాంచత్తను
ద్యుతి గంగా యమునా సమాగమముగా నూహించి సేవాగత

క్రతు భుక్కామినులందు గ్రీడసలుపన్ గాక్షింప తా దర్శిత
ప్రతిబింబాప్తి దదిష్టముల్సలుపు శర్వాణీన్ మదన్ వేడెదన్.

* * *

వ. సమర్పణంబుగా నాయొనర్పం బూనిన ముఖలింగ క్షేత్ర మహత్వంబునకు కథా ప్రారంభం బెట్టిదనిన.

శా. శ్రీమత్పావన నైమిశం బను మహాక్షేత్రంబునన్ భూరితే
జోమార్తాండులు శౌనకాది మునిరాజుల్ సూతునిన్ జూచి కా
శీమాహాత్మ్యము దెల్పి వింటి మమితక్షేత్రజ్ఞ యొందైన త
త్సామర్థ్యం బిల గల్గెనేని మ్ముదమొంద న్మాకెరింగింపవే.

గీ. అలసులకు పంగులకు నశక్తులకు నధిక దూరదేశస్థులకు నతిదుర్లభంబు
దలప నావారాసిక్షేత్ర మలఘు చరిత తత్సమక్షేత్ర మొక్కటి ధరణి గలదె.

ము గిం పు :

వ. అని భవిష్యత్కథయును, షణ్ముఖుం డెరిగించిన, నమందానంద కందళితాంతరం గుండై, కుంభసంభవుం డమ్మహాక్షేత్రంబున కేగి; సద్భక్తిపూర్వకంబుగా సకల తీర్థంబుల కృతావగాహుండై, ముఖలింగాది సమస్తలింగంబులు దరిసింపుచు, తత్పూ జాతత్పరుం డగుచు కొంతకాలంబు వసించి యనంతరంబున విష్ణుసాయుజ్యంబుగ జ్యోతిర్మయుండై, యుండెనని మరియును

క. ధర నీ క్షేత్ర మహత్వము, నరు డెవ్వడు వినిన చదివినన్ వ్రాసిన సు
స్థిరముగ శ్రీముఖలింగే శ్వరు డతని కొసంగు నిష్టసంపదలు గృపన్.

సీ. అని సూతుం డిమ్మునీంద్ర నికాయమునకు భక్తి దలిర్ప నంతయు దెల్పినట్లు
తొలుతటి యుగముల విలసిల్లు మరియు నీ యుగమున గాంగవంశోద్భవులగు
వజ్రజిస్సన్నిభ విష్ణువర్ధన మధుకర్ణ గజపతిదేవ ముఖక్షితీశ
వరులు సేవాదులు జరిగింపుచుండంగ దంతిముఖాది నందనులు ప్రమథ

గ ద్యః

0 0 0

శ్రీముఖలింగేశ్వర తారావళి

ప్రా రం భ ము :

1. క. శ్రీసురుచిర సురశైల శరాసన నిగమాశ్వసిద్ధరాధిపచిత్తో
పాసిత పదసదమృత లక్ష్మీసదన దయాంతరంగ శ్రీముఖలింగా.

0 0 0

ము గిం పు :

27. క శ్రీకంఠ భక్తియుక్తుం డై కాశీరపక్తి కృష్ణయాఖ్యుడు ప్రీతిన్;
నీకొసగిన తారావళి; చేకొను మిల ప్రబలలింగ శ్రీముఖలింగా.

వి శే షాం శ ము లు :

ప్ర తి వి లే ఖ న ము :

యీా క్షేత్రమహాత్యము వ్రాసినవారు సూరారామన్న కుమార్డు వెంకటశివుడు.

* * *

ఇది మూడు ఆశ్వాసముల కావ్యము. కవి దీనిని శ్రీముఖలింగేశ్వరునికే అంకిత మిచ్చెను. కాశిని వదలి వింధ్య నణచి దక్షిణమునకు వచ్చిన అగస్త్యుడు తత్క్షేత్ర సమమగు నీ క్షేత్రోద్భవము, నచటి మహిమ, తీర్థవిశేషంబుల దెలిసికొనుట యిందలి యితివృత్తము. ఈ కావ్యము చివర శ్రీముఖలింగేశ్వర తారావళి యనుపేర ఇరువది యేడు కందపద్యములును గలవు.

ఈ ప్రతి బాగుగా నున్నది. కాని కొన్ని పేజీలలోని లిపి రెండవవైపునకు దిగి అలికినట్లు అస్పష్టమై యున్నది. మిగిలిన చోట్ల లిపి స్పష్టముగ నున్నది. ప్రతివిలేఖనమున కొన్ని దోషములు గలవు. పద్యపాద విభజనము క్రమముగా జరుగలేదు.

# శ్రీరామస్తవరాజము

మల్లనార్యుడు

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | 3908 | కాల్ నెం | టి 3-289 |
| ప్రతి | కాగితము, సమగ్రము | పుటలు | 87 |
| ప్రతి పరిమాణము | 20.5×14 సెం.మీ. | పుట పంక్తులు | 27 |

ప్రారంభము

క॥ ఆరోగ్య భాగ్యమొసగన్ నారాయణునిన్ ప్రబంధనాయకమణిగా
శ్రీరామస్తవరాజము ధారుణి వెలయంగ జెప్పెదను నే ప్రీతిన్॥

వ॥ అది సూతప్రణీతంబును వ్యాసధర్మజ సంవాదంబును నారదప్రోక్తం బగుటంజేసి యిది యొక ఈశ్వరారాధన విశేషం బగుట నే జేసెదను.

* * *

క॥ శ్రీరామ స్తవరాజకథా ప్రారంభం బెల్ల శౌనకాదులు సూతున్
జేరి నుతించి మహాత్మా తారక నామంబు నాకు దయచేయ వనన్॥

వ॥ అనిన నమ్మునులకు వ్యాసశిష్యుం డగు సూతుం డిట్లనియె.

సీ॥ సర్వవేదార్థ విజ్ఞాని సత్యవతీ సు తుండు నా వ్యాసుని పాండవాగ్ర
జుండు పూజలు చేసి సుముఖుడై భగవంతు డవు మహాయోగీశు డవును శాస్త్ర

గురుదవు తత్వంబు పరజపంబున. ముక్తి సాధన ధ్యానముల్ జాడ లెప్పి
యట్టి వ న్నెరిగింపుడను రాజుతో పలికి విను మహాపవయోగ మనసు తెల్పి
యెట్టి పరమగుణాతీత మెట్టి దేవి జ్యోతి యమలంబు శివ మద్వైతమోక్ష
పదము నిత్యంబు కైవల్యపదము శ్రీవ ఇడుగో శ్రీరామయోగ మహిమ॥

* * *

ముగింపు

....సద్గురు వాక్యార్థ రాజ్యపరిపాలనంబునం దనరి, సర్వజనంబుల తత్ప్రార్థనంబుగా పోషింపుచు, నిట్లు ముక్తివధూవరులు నిరంతర సుఖక్రీడా వినోదంబుల ప్రొద్దు బుచ్చుచు సుఖం బుండిరని శ్రీవ్యాస భట్టారికాచార్యుండు ధర్మజునకు సంపూర్ణమాహాత్మ్యంబులు వినుపింప సకలజనానందకరంబుగా నా సమయంబున దేవదుందుభులు మ్రోయ నమరులు కుసుమ వృష్టిగురియించ నత్యంతోత్సాహంబుతో కృష్ణద్వైపాయనుండు పరమమతజ్ఞానోల్లాసి యగుయుధిష్ఠిరుం జూచి నీ వాత్మారామత్వంబున జీవన్ముక్తుండవై సర్వభోగంబులం బొందుచు సుఖంబుండుమని మరియు నిట్లనిమె.

* * *

**మాలిని.** నయన హృదయ బిందూ నా మనో ప్రాణముద్రా
నయన ఘన సుషుమ్నా నాడి నిద్రా విభేదా
నయన జిత సురంధ్రా నాద సద్బ్రహ్మరంధ్రా
నయన కళ దినేశా నాసికాగ్ర ప్రకాశా॥

* * *

గద్య

ఇది శ్రీరామచంద్ర ప్రసాదలబ్ధ కవితా విలాస శాండిల్య సగోత్ర పవిత్ర, కృష్ణయామాత్య పుత్ర వినుతగుణధైర్య మల్లనార్య ప్రణీతం బైన శ్రీరామ స్తవరాజంబను మహా ప్రబంధంబునందు శ్రీవ్యాస భట్టారకాచార్యుండు హరిధ్యాన పురఃసరంబైన శ్రీరామ కృష్ణస్తోత్రంబును

* * *

వసంతోత్సవాది మహోత్సవంబులు నడుచుటయు శ్రీరామ స్తవరాజ కథాశ్రవణంబునకు మహాఫలంబు చెప్పుటయు నన్నది తృతీయాశ్వాసము సంపూర్ణము॥

**వి శే షాం శ ము లు**

ప్రతి విలేఖనము

వత్సే శార్వరినామ సంవత్సరే హేమంత ఋతౌ దక్షిణాయనే మార్గేశ్వర మాసే అసిత పక్షే ద్వితీయాయాం గురు వాసరే రాత్రౌ కోసంగి నామగ్రామే శ్రీరామస్తవరాజ ప్రబంధం విలిఖ్యతే.

ఈపుహి జట్టూరి పంచాక్షిసోమ రాజా వెంకట్రెడ్డి పట్టందు రామారెడ్డి దేశముఖ పర్గణె కొడంగల్లు వాల్తా పట్టికోళ్లిగారిది. సత్యం.

ఈ కావ్యము మూడు ఆశ్వాసముల గ్రంథము. ఇందు ఆచార్యస్వరూపము, ముముక్షు లక్షణము, శుశ్రూషలక్షణాదులు, ముక్తికాంత కళ్యాణాదులు ఇందలి విషయములు. ఇందు పూర్తిగ్రంథము గలదు.

ఇందలి మొదటి పేజీలోని కొన్ని అక్షరములు నశించినవి. కాని మిగిలిన ప్రతి బాగున్నది. ఇందలి లిపి స్పష్టముగ లేదు. ప్రతి విలేఖనమున దోషములు గలవు.

## శ్రీ రా మ స్త వ రా జ ము

**మల్లనార్యుడు**

| | | | |
|---|---|---|---|
| ఆక్సేషన్ నెం | 724 | కాల్ నెం | టి 8-180 |
| ప్రతి | తాళపత్రము, సమగ్రము. | పత్రములు | 42 |
| ప్రతి పరిమాణము | 45.5X4 సెం మీ. | పత్రపంక్తులు | 6 నుండి 7 |

**వి శే షాం శ ము లు**

దీనిని మల్లనార్యుడు రచించెను. ఇతడు కృష్ణయామాత్యుని పుత్రుడు. రామభక్తుడు. ఇందు మూడు ఆశ్వాసములు పూర్తిగా నున్నవి. ఈ గ్రంథమున ముముక్షు ధర్మములు, ఆచార్యస్వరూపము, శుశ్రూష లక్షణము, శ్రీ కృష్ణరామస్తోత్రములు

గలవు. గ్రంథాదిని కవి తన్నుగురించి తెల్పుకొని, తదుపరి షష్ఠ్యంతములు రచించినాడు. శ్రీ రామస్తవరాజముయొక్క మహిమయు వర్ణింపబడినది.

ఈ ప్రతియందు మూడాశ్వాసములు ఆద్యంతములతో నున్నను పత్రములు నలుపుదిరిగి చాల క్రిమిదష్టమైనవి. కొన్ని పత్రములు శిథిలములైనవి. లిపి స్పష్టముగ నున్నది. కొద్దిగా వ్రాతదోషములు గలవు.

## శ్రీ రా మ స్త వ రా జ ము

### మల్లనార్యుడు

| | | | |
|---|---|---|---|
| అక్సెషన్ నెం | 5681 | కాల్ నెం | జి 8-186 |
| ప్రతి | తాళపత్రము, సమగ్రము. | పత్రములు | 47 |
| ప్రతి పరిమాణము | 44X4 సెం. మీ. | పత్రపంక్తులు | 7 |

వి శే షాం శ ము లు

ఈ ప్రతియందు ఆద్యంతముల గ్రంథము గలదు. ప్రతిలోని తొలిపత్రములు రెండు చివరలు స్వల్పముగ శిథిలమై యున్నవి. ప్రతి నలుపుదిరిగి యున్నది. కాని మొత్తము మీద ప్రతి బాగున్నది. లిపి స్పష్టముగ నున్నది. ప్రతివిలేఖనమున స్వల్పదోషము లున్నవి.

## శ్రీ రా మ స్త వ రా జ ము

### మల్లనార్యుడు

| | | | |
|---|---|---|---|
| అక్సెషన్ నెం | 5937 | కాల్ నెం | టి 8-599 |
| ప్రతి | తాళపత్రము ; అసమగ్రము. | పత్రము | 59 |
| ప్రతి పరిమాణము | 42×3.5 సెం.మీ. | పత్ర పంక్తులు | 6 నుండి 8 |

విశేషాంశములు

ఈ ప్రతియందు మూడాశ్వాసము లున్నను అటనట కొన్ని పత్రములు లోపించినవి. వ్రాత యొకమాదిరిగా నున్నది. తప్పు లెక్కువ. ప్రతి మంచిస్థితి యందున్నది. ఈ ప్రతిని విశ్వావసు నామసంవత్సర ఆషాఢ బహుళ దశమి మంగళవారం వరకు క్షీరసాగరం అనంతయ్య కుమారుడు వెంకయ్య వ్రాసినట్లుగా ప్రతిచివరలో వ్రాయబడి యున్నది.

## శ్రీ రా మ స్త వ రా జ ము

మల్లనార్యుడు

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | 545 | కాల్ నెం | టి 3-247 |
| ప్రతి | తాళపత్రము, అసమగ్రము. | పత్రములు | 46 |
| ప్రతి పరిమాణము | 44.5×3.5 సెం.మీ. | పత్ర పంక్తులు | 6 |

విశేషాంశములు

ఈ ప్రతియందు మూడాశ్వాసము లున్నను పత్రములు మిక్కిలి శిథిలావస్థలో క్రిమి దష్టమై యున్నవి. విషయ నష్టము జరిగినది.

## శ్రీ రా మ స్త వ రా జ ము

మల్లనార్యుడు

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | 823 | కాల్ నెం | టి 3-182 |
| ప్రతి | తాళపత్రము, సమగ్రము. | పత్రములు | 23 |
| ప్రతిపరిమాణము | 42×3 సెం.మీ. | పత్రపంక్తులు | 5 |

విశేషాంశములు

ఈ ప్రతియందు గ్రంథాద్యంతములు లేవు. మధ్య మధ్య కూడ కొన్ని పత్రములు లోపించినవి. ప్రథమాశ్వాసము మధ్యనుండి తృతీయాశ్వాసము కొంతవరకు గలదు. లిపియు స్పష్టము కాదు. భాషాదోషములు, ఛందోభంగములు చాలకలవు. ఈ ప్రతి పార్శ్వభాగములందు కొంత భాగము శిథిలమై యున్నది.

## శ్రీ రామ స్తవ రాజము (ప్రథమాశ్వాసము)

### మల్లనార్యుడు

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | 711 | కాల్ నెం | టి 8-181 |
| ప్రతి | తాళపత్రము; అసమగ్రము. | పత్రములు | 15 |
| ప్రతిపరిమాణము | 41.5×3.5 సెం.మీ. | పత్రపంక్తులు | 5 |

విశేషాంశములు

ఈ ప్రతియందు ప్రథమాశ్వాసము పూర్తిగను ద్వితీయాశ్వాసమునందు మొదటి రెండు పత్రములు మాత్రము ఉన్నవి. ఇది క్రిమిదష్టమై స్వల్పముగ శిథిలమై యున్నది. లిపిస్పష్టమే. కాని భాషాదోషములు చాల కలవు.

## శ్రీ రామ స్తవ రాజము

### మల్లనార్యుడు

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | 748 | కాల్ నెం | టి 8 - 184 |
| ప్రతి | తాళపత్రము; అసమగ్రము | పత్రములు | 48 |
| ప్రతి పరిమాణము | 44×4 సెం.మీ | పత్ర పంక్తులు | 7 |

విశేషాంశములు

ఈ ప్రతియందు గ్రంథాద్యంతములు లేవు. అటనట కొన్ని పద్యములు లోపించినవి. ప్రతి చాలవరకు క్రిమిదష్టమై శిథిలమైనది. లిపి యస్పష్టము. లేఖన దోషము లధికము.

# శ్రీవాణీవిలాసవమాలిక

## తేకుమళ్ళ రంగశాయి

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 1౬4 | కాల్ నెం | : టి 8-175 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము. | పత్రములు | : 37 |
| ప్రతి పరిమాణము | : 42.౮×౩.౮ సెం.మీ. | పత్రపంక్తులు | : 5 |

ప్రారంభము

శ్రీమద్దేమాంభోరుహ ధామ ప్రేమానుగత పదా వినుతశ్రీ
రామా మోహనకరదే హా మహితోదార వేంకటాద్రి విహారా.

వ. దేవా అవధరింపుము........... భువన క్రమంబు లెరుంగించిన భరతఖండ స్థితపుణ్య స్థలనదీతీర్థ ప్రభావంబు లెట్టి లని యడిగిన శౌనకాది మహామునుల కా సూతుం డిట్లని చెప్పదొడంగె.

సీ. గంగా .... .... తికాళిందులున్ సింధు . . యూశి .... ణ చంద్రభాగ
గండకి నర్మద కౌశికి గోమతి సుముఖి విశాలయు శోణ భద్ర
యరుణయు వరుణయు .... గౌతమి తుంగభద్ర మాలా .... భ . . వ హారిణియు
నిర్వింధ్య కృష్ణవేణియు ... ర పయోష్ణియు దా . . సువహా ప్రుషద్వతియును
తమస గరుడ పినాకినీ తామ్రపర్ణి వైఖ మణియుక్త స్మృతి వేగవతి సువర్ణ
ముఖరి బాహుద సుర .... తియును భారతాఖ్య పృథివి జనభాగ్య
క్షీరతటినియు కావేరి సారనదులు.

చ. వెలుపగు పుణ్యశైలముల బుట్టి హరిస్థల సంగతంబులై
యలఘు ........ ములు నంచిత ధర్మ నిరూపణంబులై
తలప కనుంగొన న్మనుగ ధన్యసుఖాస్పద దీప్తవర్తనన్
వెలయును భారతాఖ్య పృథివీజనభాగ్య నిదానముల్ నదుల్.

వ. మరియు వరుసగా హరిహర నిలయపుణ్యతీర్థ నదీనద మహిమంబులు జెప్పెద సావధానులై వినుండు.

క. శ్రీవైకుంఠంబు . . ల క్ష్మీ వనరుహనయన గొల్వ శేషగ . . ద భక్తా ....
........ యింపగ మో దావహు డగు వాసుదేవు డా............

ము గిం పు:

వ. కావున సకలదేవాత్మకుండు శ్రీమన్నారాయణుం డని యా పరమేశ్వరు నెన్ని త....తుల స్నానాదియోగ్య వస్తు ధూప దీపా ద్యుపచా రార్చనములం గృతార్థులు గావలయునని సూతుం గనుంగొని తులసీ, గో, భూదాన వ్రత మాహాత్మ్యంబులు క్రమంబునం దెలుపుమని వినయవచనులై యడుగుటయును.

ఉ త్సా హ :

రాజహంసనేత్ర మౌనిరాజ పూజనప్రియా
రాజరాజ మిత్ర మిత్రరాజితాశ్రయాశ్రియా
భూజనేష్ట . . యశో . . ర్ణ. స . . యోదయా
భూజరాజ . . జశేష భూమిభృద్వసత్రిక్రియా.

క. ........ వైశ్యాశ్వా........ .... కర నయనాంబర చరత్ర్పకర నుత
చామీకర చామర దం డమణి స్థిరశోభయ భాగశేష .... సురాగా

తో ట కం :

జనకామిత కామిత కారణ కా
న నివారణ నాగ ర ............ నో

అనఘా .... కృపాసు నయాతిరయా
వినతా జనతాధిప వేంకటపా.

గద్య :

ఇది శ్రీమదలమేలుమంగాసమేత వేంకటేశ్వర వరప్రసాదాసకవితామిత్ర మహంకాళి ఆ....ర్యపుత్ర .... కవిస్తోత్ర సుమతివెంకటపతి సహాయ తేకుమళ్ళాన్వయ పాథోధి పూర్ణసుధాకర ....... త్వకుమార సకలవిద్వజ్జనాధార శ్రీవత్సగోత్ర ఆపస్తంబసూత్ర సత్కవిప్రమోదా ... యిరంగ.... ప్రణీతంబైన శ్రీవాణీ విలాసమాలిక యను ప్రబంధంబునందు అష్టోత్తర విష్ణుస్థల మాహాత్మ్యంబును, పుణ్యనదీ సంభవంబును, శివస్థల మాహాత్మ్య లింగాకార పూజాఫలంబును, బ్రాహ్మణ వంశకీర్తన గోత్రగణ నిరూపణంబును, వర్ణాశ్రమాంతరభేదన సదాచార విధులను స్నా....దాహన ప్లాపన ప్రాణాయామ లక్షణంబులను గాయత్రీ మహాత్మ్యోక్ష్య ప్రభావ యజ్ఞోపవీత .... వైశ్వదేవప్రకరణ దేవపూజా విధులును, భోజన ప్రకరణంబును, క్షేత్ర వైశ్య శూద్రజాతి ధర్మ పతివ్రతా లక్షణంబును ........... పుణ్యకాలదాన నిరూపణంబు .... బ్రాహ్మణ లక్షణంబులను .... చ్ఛయ ధర్మంబులను షణ్ణవతి శ్రాద్ధనైమిత్తిక కాలకర్తృ భోక్తృ వక్తృ యోగ్యాయోగ్య నిరూపణంబులును హరిపూజా వైభవంబును సాలగ్రామ.... మూర్తి .... వాది బహువిధమూర్తి శివనాభాది లక్షణలాంఛనంబులను తీర్థ వైభవంబులను నను కథలుంగల తృతీయాశ్వాసము.

విశేషాంశములు

గ్రంథ మసమగ్రము. రెండు మూడాశ్వాసములు గలవు. గ్రంథాది గ్రంథాంతములు లేవు. క్రిమి దష్టము.

## శ్రీసోమేశ్వర భక్తచర్య

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | ; 5645. | కాల్ నెం | ; టి 3 - 180.. |
| ప్రతి | ; తాళపత్రము; అసమగ్రము | పత్రములు | ; 8 |
| ప్రతిపరిమాణము | ; 37 × 3 సెం.మీ. | పత్రపంక్తులు | ; 6 |

ప్రారంభము :

శ్రీకాసార పురీవర పాకారి ప్రముఖ దివిజపాలక మిమ్ము
న్నాకాధీశ ల్పొగడగ కాకోదర భూష సోమనామక రూపా.

ఉ. శంకరపుత్రు గన్గొనగ శాంకరి స్తన్యము చేపు లూరగా
వంకరతుండుడుం జనని స్తన్యములందున బాలు ద్రాగగా
నంకమునందు జేరగని శాంకరి యిట్లనె ముద్దులాడుచున్
శంకర పూజనల్ సలుపు సోమయ దేశికి వాక్కు ఓడగున్. (?)

సీ. ముగురు మూర్తులలోకి మూలమై యున్నట్టి యాదేవు గొల్తునే ననుదినంబు
ముగురు శక్తులకన్న మూలమై యున్నట్టి యాదేవి నర్చింతు ననుదినంబు
మద్గురుమూర్తి యా మల్లికార్జునదేవు డామహాత్ముని దల్తు ననుదినంబు
మాకు జనయిత్రి జనకుండైన శ్రీమల్ల .... .... మనుదినంబు
మాకు నొజ్జలునై విద్య నభ్యసించు విఘ్ననాయకు వీక్షించి వినుతిజేతు
.... రలో ....దాయురారోగ్య సౌభాగ్య విజయవిభవంబు వివిధశత్రుజయదంబు.

•• •• •• ••

ముగింపు

వ. .... .... .... యారాధ్యత్రయంబులం బ్రస్తుతించు వారును, శ్రీపాలకుర్కి సోమనారాధ్య కృత కావ్యాలంకార ప్రమథగణనామ సహస్రసంఖ్య మాలికలుం బఠించు వారును, సహస్ర సంఖ్యానేక గణసమూహాద్యపూర్వ మాహేశ్వర స్తవంబులు చేయు వారును, నిత్యం బేక ద్వి త్రి షట్కాల లింగార్చనావసర ప్రసాదంబు లందువారును, కొందరు నిత్యలింగైక్యాను సంధాన యోగాద్యైక్యానందంబు లొందువారును, కొంద రిష్టప్రాణ భావార్పణంబులం గురులింగ జంగమ తృప్త్యర్థణ లొసంగ దేహప్రాణార్థంబుల సంతృప్తిం జేయువారును, కొంద రొకరొకరిచే నొకరు పూజలు గైకొను వారును, కొందరు కాలకాలతీర్థ ప్రసాద సేవానైష్ఠిక శివయోగులును, కొందరు శివయోగ నిద్రలచే ముద్రలు సాధించు సాధకోత్తములును, కొందరు షట్స్థలజ్ఞాన పరిపూర్ణానుభవసిద్ధి నొంది శివేంద్రియవిలీన చిత్తశుద్ధ పంచేంద్రియులై యుండువారును, ఈ లీల బాలవృద్ధ

యౌవన ప్రౌఢస్త్రీపురుషమాహేశ్వర భక్తగణసమూహం బీ సరళి శివపూజలు సేయు సమయంబును .... ... ....

... ... ... ...

**విశేషాంశములు**

ఈ ప్రతిలోని గ్రంథాదిలో సీ గ్రంథము "సర్వజిత్ నామసంవత్సరము ధూర్జటి వారము మాఘమాసమం దర్ధమునందు గృత్తిక .... ఆదియు ద్వాదశ వర్షశతంబు వేదార్థము దెబ్బదొక్కటిం దర్థము చిత్రవిచిత్రంబుగా శంకరు ఇట్టిమన్నయటుల ఇట్టిటచే శివునాజ్ఞచే దీనిని కవి రచించినట్లు తెలియుచున్నది. ఇందు గ్రంథప్రారంభము సరిగాలేదు, ముగింపు పత్రములు మృగ్యము. ప్రతిలోని యేడుపత్రములైనను వరుస క్రమములో లేవు.

ఇది ఒకశివభక్తుని చరిత్ర. కవినామవివరాదు లీప్రతివలన తెలియుట లేదు.

మొదటిపత్రము విరిగియున్నది. లిపి స్పష్టముగ లేదు. ప్రతివిలేఖనమున చాలదోషము లున్నవి.

## సోమేశ్వర భక్త చర్య

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం. | : 5646. | కాల్ నెం. | : టి 3-153 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము. | పత్రములు | : 5 |
| ప్రతి పరిమాణము | : 37 × 3.5 సెం.మీ. | పత్రపంక్తులు | : 6 |

**విశేషాంశములు**

ఈ ప్రతియందు గ్రంథప్రారంభముకలదు కాని ముగింపు పత్రములు లేవు. ప్రతిలోని ఐదుపత్రములైనను వరుసగాలేవు.

ఇది ఒకశివభక్తుని చర్యాసంబంధియగు కథ. కవినామ వివరాదు లీప్రతివలన తెలియుట లేదు. ఇందలి లిపి స్పష్టముగా లేదు. ప్రతివిలేఖనమునను దోషములు గలవు.

"దుర్మతి నామసం॥ర ధూర్జటి వారము మాఘమాసమం దర్ధమునందు గృత్తికం బదియు ద్వాదశవర్ష శతంబు నెదార్థము డెబ్బదొక్కటం దర్థము చిత్రవిచిత్రంబుగా" శంకరుడు తన్నుపల్కెనని గ్రంథారంభంబున కవి వ్రాసినాడు.

# షట్చక్రవర్తి చరిత్రము

## మల్లారెడ్డి

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 3644 | కాల్ నెం | : టి 3 - 226 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము. | పత్రములు | : 131 |
| ప్రతి పరిమాణము | : 35.5×3.5 సెం.మీ | పత్ర పంక్తులు | : 6 |

ప్రారంభము :

క. శ్రీమద్భూమీధర పు  త్రీమణి కుచకుంభికుంభ మృగమద విదిత
శ్యామల కోమల వక్షో  ధామున కభిరామ భూమిధర ధామునకున్.

క. శరణాగత శరణాంతః  కరణా వరుణునకు నిత్యకరుణాభరణా
స్మరణ స్ఫురణా ధరణీ  చరణునకును నిగమ శటకచణ చరుణునకున్.

క. జూటీ తటకోటీ రట  ధాటీక ధునిం ఘుమంఘుమార్భట పేటీ
కోటీరునకును ధాతృక  రోటీయుత మదన తనుగురు పటీరునకున్.

0 0 0

వ. సమర్పితంబుగా నా యొనర్పం బూనిన షట్చక్రవర్తి చరిత్రం బను మహాప్రబంధంబు నకుం గథాసూత్రం బెట్టిదనిన.

శ్లో. సహసా పాహిమాం దేవి
త్రిలోక జనసన్నుతే
ఆరోగ్య మభయం దత్వా
యుష్మదంఘ్రి యుగార్చనమ్.

చ. తరువులు వోలె పల్కులత తత్ఫలశోభితులై లసత్పయో
ధరములు వోలె భవ్యపరిధౌత సమస్త రజః ప్రకారులై
యరుణులు వోలె ధూతతములై హృదయాంబుజ సంస్థితాద్రిజా
వరులగు శౌనకాది మునివర్యులు ధుర్యులు నైమిశంబునన్.

0 0 0

వ. ఓ మహాత్మా నీవు మున్నగణ్యకథా సమజ్ఞ విజ్ఞానాంకురంబు లస్మదీయ హృదయాలవాలంబుల ప్రౌఢప్రియంభావుక, వచనామృతంబులు శ్రుతి ప్రణాళుల వెంటనించి నాటు కొల్పినం బల్లవించె కొనసాగుచున్నవింక నిర్వాణ ఫలంబులకుం గారణంబులగు షట్చక్రవర్తి చరిత్రంబు లఘులతాలవిర్భితంబులు విచిత్రంబులు సంద్రదు గావున సవిస్తరంబుగా వచింపు మనవుడు నతం డంగీకృతాంత రంగుండై వారల కిట్లనియె.

సీ. గోపుర గోపుర గోపుర ప్రతిమంబు కల్పద్రు కల్పద్రు గౌరవంబు
మానవ మానవ మానవాధీశంబు మణిజాల మణిజాల మంజిమంబు
సారంగ సారంగ సారంగ నయనంబు సుమనోజ్ఞ సుమనోజ్ఞ శోభితంబు
బహుధామ బహుధామ బహుధామ ఘటితంబు ఘనసార ఘనసార గంధిలంబు

గీ. భవ్యకాసార కాసార బంధురంబు జవనసైంధవ సైంధవ సంకులంబు
బహుళ కేతన కేతన భస్థలంబు నై విజృంభించె సిరి నయోధ్యాపురంబు.

సీ. కొమరొప్ప కళల దక్కువగాని ద్విజరాజు లాశాపరుల్గాని యట్టి బుధులు
మాటిమారులుగాని మహనీయ బాడ బుల ప్రదాతలుగాని యట్టిఘనులు
కులగోత్ర విద్వేషకులుగాని శతమఖుల్ కన వక్రమార్గులుగాని భోగు
లల పుణ్యజన విరోధులుగాని కాంతు లప్రభల్ గాని సమ్యక్ప్రచేతు

గీ. లనగ బొగడొందుచుందు రత్యంతనిష్ఠ వరలు చతురాననులును సర్వజ్ఞు లగుచు
హరి భాషావిశేష తార్యానుకూల తా ప్రవీణులు పురిలోని విప్రవరులు.

0 0 0

ముగింపు :

ఉ. అంత భగీరథుండు నియమాతిశయంబు చెలంగ పార్వతీ
కాంతుని గూర్చి వెందియు ప్రగల్భము గాగ నహీన వైఖరిన్

సంతత వాయు భక్షణము సారమహాభరణ ప్రశస్తి య
క్రాంత రసాతలస్థితియు రంజిలగా తప మాచరింపంగన్.

సీ. అమృతంబు చిలుక చంద్రార్ధ ఖండముతోడ పల్లవ స్ఫుట జటా పటలితోడ
సీటుగా మాటిన నిటలనేత్రముతోడ రమణీయ మణికుండలములతోడ

.... .... ....
.... .... ....

తే గీ. వెడదకటిమించు పొడలపచ్చడముతోడ కలికి శిరసునదొలకెడు గంగతోడ
చల్లజూపుల కరుణారసంబుతోడ హరుడు ధరణీశు నెదుట ప్రత్యక్ష మయ్యె.

గీ. అటుల ప్రత్యక్ష మగుచు నయ్యవనివిభుని
తపమునకు మెచ్చి యవని గోత్రభవు లయిన
జనపతుల కెల్ల కరముభూషణముగాగ
నీవ్య గాంగేయ ఘనకంకణంబు నపుడు.

గీ. సప్తపథ మన మరి సహస్రాపగ నగ పావనియు నాగ ప్రాచీనపథము సింధు
సేతులన కొన్ని పశ్చిమ క్షితికి జనియె .... .... .... ....

గద్య :

ఇది శ్రీ మన్పెక్కనవోలి పట్టణప్రసిద్ధ సరస్థటావలంబ సాంబశిద్ధరామేశ్వర వర ప్రసాద సమాసాదిత సంస్కృతాంధ్రభాషా కవితా తసపోషణ విశేషతా చమత్కార గురు భక్తివిహార రాచమల్లగోత్ర పవిత్ర కాచభూపాల పుత్ర బుధవిధేయ మల్లారెడ్డి నామ ధేయ ప్రణీతం బయిన షట్చక్రవర్తి చరిత్రం బను మహాప్రబంధంబునందు షష్ఠమాశ్వాసము.

విశేషాంశములు :

పంచమాశ్వాసాంతము తరువాత ఇట్లున్నది.
వికృతి నామసంవత్సర కార్తీక బహుళ దశమి బుధవారం రోజుకు అయినది.

ఇందు సప్తమాశ్వాసము కొంతిభాగము కలదు. 6 ఆశ్వాసములు సంపూర్ణముగా నున్నవి. ఈ గ్రంథప్రారంభము షష్ఠ్యంతములతో గలదు. అట్లే 208వ పత్ర మందిట్లున్నది. "ఇక్కడ నుంచి వుండిపోయిన గ్రంథం యిందులో వ్రాయడాయనకు పుతాలు చాలక శకుంతలాపరిణయంలో తరువాయి గ్రంథం వ్రాయడమయినది."

## షట్చక్రవర్తి చరిత్రము

## మల్లారెడ్డి

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 5606 | కాల్ నెం | : టి 3 - 174 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము. | పత్రములు | : 122 |
| ప్రతి పరిమాణము | : 41X3 సెం. మీ. | పత్ర పంక్తులు | : 5 |

**విశేషాంశములు :**

**ప్రతి విలేఖనము :**

భావనామసంవత్సర పౌష్య శు 10 శుక్రవారం రోజున మూడుయామాలవరకు షట్చక్రవర్తి చరిత్ర అనేప్రబంధం అనుముంచి జగన్నాథం వ్రాసిన ప్రతిచూసి తనఖాసాకు శ్రీరామార్పణంగా వ్రాసుకొనెను.

0 0 0

ఈ ప్రతిలో ఆద్యంతముల గ్రంథమున్నను పత్రములు చాలవరకు క్రిమిదష్టమై శిథిలమైనవి. ఇది ఎనిమిది ఆశ్వాసముల గ్రంథము. లిపి స్పష్టముగ నున్నను ప్రతి విలేఖనమున దోషములు గలవు. ఈ కావ్యము రామలింగేశునకు అంకిత మీయబడెను.

# సంక్షేప రామాయణము

(ఆంధ్రానువాద సహితము)

ఆక్సెషన్ నెం : 5623 కాల్ నెం : డి 3-347
ప్రతి : తాళపత్రము; అసమగ్రము. పత్రములు : 11
ప్రతి పరిమాణము : 43×3.5 సెం. మీ. పత్ర పంక్తులు: 7

ప్రారంభము :

.... .... యుద్ధముచేసుటకు నెదుర్కొన్న ఖరునిన్ని దూషణునిన్ని వారివెంట వచ్చినవారినిన్ని యా స్థలమందు వసించెడు తక్కిన రాక్షసులనున్ను గూడ పదునాలుగు వేలమందిని వధించిన వాడాయెను. ఈ తీరున జంపబడిన జ్ఞాతుల వధను రావణాసురుడు విని ఆగ్రహమును పొందినవాడై మారీచుడనే రాక్షసుణ్ని సహాయము చేసుటకు రమ్మనగా నా మారీచుడు మహాబలశాలియగు శ్రీరాములతో విరోధమునకు తగదని అనేకవిధములుగా దెలియజెప్పిన నది యనాదరణచేసి కాలచోదితుం డగు రావణుండు రామాశ్రమమునకు వచ్చి మారీచుని మాయామృగవేషము ధరించు మని చెప్పె.

* * *

ముగింపు :

శ్లోకం ॥

తా మువాచ తతోరామః పరుషం జనసం సదీ
అమృష్యమాణ సా సీతా వివేశజ్వలనం సదీ

టీక ॥

తతః = అటు తర్వాతను ; రామః = రామమూర్తి ; జనసం సది = సభయందు ; తాం = ఆ సీతను గూర్చి ; పరు ....

విశేషాంశములు:

ఇది సంక్షేపరామాయణము యొక్క వ్రాతప్రతి. ఇందు ఆద్యంతములు లేవు. మధ్యపత్రములును కొన్నిలోపించినవి. ఆంగ్లేయులచే ముద్రింపబడిన వాల్మీకి

రామాయణమునందుగల బాలకాండ యంపేకథ యున్నట్లు ఇందు తెలుపబడినవి. ఇందు మొదట సంక్షేపరామాయణ కథ తెలుగువచనములోను, తదుపరి సంస్కృత శ్లోకములు తెలుగు టీకా సహితముగా నున్నవి. లిపి స్పష్టము. లేఖన దోషములు కలవు. ప్రతిలోని కొన్ని పత్రములు కొంత శిథిలమై యున్నవి. ప్రతి యసమగ్ర మగుటచే కవి పేరుగాని, టీకాకారుని పేరుగాని మృగ్యము.

## సంక్షేప రామాయణము

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 5650 | కాల్ నెం | : టి 3-348 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము. | పత్రములు | : 15 |
| ప్రతి పరిమాణము | : 33 × 3 సెం. మీ. | పత్ర పంక్తులు | : 5 |

ప్రారంభము :

.... .... .... నారాయణాం
శమునన్ బుట్టి మదాంధరావణ శిరస్సంభూత సచ్ఛేదన
క్రమణోద్దామ ... ... గరిమకున్ కౌసల్యకున్ సన్నుతా
సమనైర్మల్యకు తుల్యకాంచిత జగత్సంసార సాకల్యకున్

మ. సవరక్షార్థ .... తండ్రి.... .... ....విశ్వామిత్రుండు....తోడురా
నవలీలన్ దునుమాడె రాము దుడితుండై బాలుడై కుంతల
చ్ఛవి సంపజతహాటకన్ గపట .... .... కన్
జవభిన్నాశ్రమఘోటకన్ గరవిరాజత్స్ఫేటకన్ తాటకన్.

క. గాహామున కౌశికు మఖ మా రాముడు గాచె దైత్య ....
.... .... .... .... తోచెను మారీచున్నిచు కపటమంజుల రోచున్.

మ.   ఒక మున్నూరుగ గెల్చి తెచ్చిన లలాటోగ్రాక్షుచాపంబు బా
లకరీంద్రంబు ....   ....   ....   .... చందంబునన్
సకలోర్వీశులు చూడగా విరచె దోశ్శక్తిన్ విదేహ క్షమా
పకదేశంబున సీతకై గుణమణిప్రస్ఫీతకై లీలతోన్.

ము గిం పు :

వ.   అని రామచంద్రుండు వగచి బ్రహ్మచర్యంబు ధరియించి పదమూడేళ్లు యెడతెగకుండ నగ్నిహూత్రంబు చెల్లించి తాను నీశ్వరుండుగావున మొదలి నెలవులకుం జనియె నివ్విధంబున.

ఆ.వె. ఆదిదేవుడైన యా రామచంద్రుండు   అబ్ధిగట్టి యెంత యసురకోటి
జంపుటెంత కపుల సాహాయ్యమది యెంత   సురలకొరకు క్రీడ జూపెగాక.

చ.   వశ దగు మొక్కెక్కదన్ లవణవార్థి విజృం....తా నివృత్తికిన్
దశ....   ....   .... మండిత దివ్యకీర్తికిన్
దశశతభానుమూర్తికి ....   ....   ....   ....
...   ... పట్టికిని దైత్యపతిన్ బొరిగొన్న

ఉ.   .... నయంబులవాడు మహాసుగంబులున్
విల్లు దాల్చు ....   .... వాడు మేలుపై
చల్లెడు వాడు నిక్కినభు ....   ....   ....   దిక్కులన్
జల్లెడు వాడునైన   రఘుసత్తము డీవుత మా కభీష్టమున్.

ఆ.వె. రామచంద్రుగూడి రాకపోకల....గదసి తిరుగ వారుగన్న ....
....   .... నాకన్న వారును   అరిగి రారు యోగలరుగుగతికి

క.   మంతనములు సద్గతులకు పొంతనములు   ఘనములైన పుణ్యములకు ....
....   ....   కృంతనములు ధామనామ గుణచింతనముల్.

విశేషాంశములు :

గ్రంథమునందలి పెక్కుపత్రములు సగభాగమునకుపైగా లోపించినవి. కొన్ని పత్రములు రెండుగా విరిగి యున్నవి. రామాయణ కథ సంక్షేపముగా గద్య పద్యములలో వ్రాయబడినది. అసమగ్రప్రతి యగుటవలన కవిపేరు మృగ్యము.

# నిత్యానందము

## దోనయామాత్యుడు

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 2801 | కాల్ నెం | : టి 3-146 |
| ప్రతి | : తాళపత్రము, అసమగ్రము. | పత్రములు | : 47 |
| ప్రతి పరిమాణము | : 25×2.5 సెం.మీ. | పత్ర పంక్తులు | : 5 |

క. శ్రీనగమందిర గౌరీ మానస వనజాతలోల మధుపేంద్రుడు ని
త్యానందమూర్తి శంకరు గా నుమ నామదిని మల్లికార్జును గొలుతున్.

చ. దురితమహేశ పెంపు దగ దుఃఖదవానల మార్చి నా మది
స్ఫురణ తటిల్లగా మహిమ సొంపువహింప ననాదరంబు నా
దరమున శిష్యశైశవమున తద్దయు వేడ్కఁజరించుచున్న సుం
దర జలదంబు ధాత్రికి మదాంత కృపామృత వృష్టి జేయుతన్.

ఉ. శ్రీవనితేశు నాభిసరసీరుహ గర్భమునన్ జనించి వే
దావలి మోము దావల తరదంచితసౌరభలీల గ్రాల ధా
త్రీవిభవంబు భారతికి చిత్త మెలర్పగ నుల్లసిల్లు సం
భావిత సర్వలోక ఆమభంజను ధాత నుతింతు వేడుకన్.

క. బాలార్కతేజు నుజ్వల బాలోరగ హారమౌళి భాగవిరాజా
బాలశశాంక విభూషణ బాలాంబతపుత్రు దంతవక్త్రు నుతింతున్.

వ. ఇట్లు యిష్టదేవతా ప్రార్థనంబుజేసి ఆత్మగతంబున

ఆ.వె వానచేత సస్యవర్గంబు వర్థిల్లు సస్యవృద్ధి సర్వజన సమృద్ధి
కారణంబు వాన గావున ధరలోన వానవలయు నెల్ల వారలకును.

క. దానవ సుర ఖచరాదులు కానచు మానవుల చిత్రగతియును ధరలో
వానల రాకలు పోకలు మానవులకు దెలియ నకట మానముగాదే.

వ. అని లోకోక్తు లాకర్ణించి గార్గేయ వరాహమిహిరాది సంహితాసారంబులంగూర్చి ప్రవర్ష
ణ, నివర్షణంబులు జనులకు శుభోదయంబు సేయుటకై సస్యానందంబు జెప్ప
నుద్యుక్తుండ నైన మదీయ ప్రభావం బెట్టిదనిన.

* * *

సీ. వసుసంఖ్య బెంచిన వరశకాబ్దంబులు తెరగొప్ప నవితొమ్మిదింట పాలు
బుచ్చిన శేషంబు బొలుచు భూరి సంవత్సరంబు బుష్కరంబు
కమనీయ ద్రోణంబు కాలమేఘంబులు నీలారు వారుణ నీతి తమము
అను నామములుగల్గు నక్షత్రంబులగు వాని గర్భధారణమును గర్భపాత

తే.గీ. కాలమును పరిపక్వకాల మరసి హర్షములు చప్పనేరని వార లెల్ల
నోరు గొందులు వల్కంగ నృపుల సభల నింద హాస్యంబు లొందుట సందియంబె.

వ. ఇది మేఘలక్షణం బింక ధాతుప్రకారం బెట్టిదనిన.

క. ఘనతర శీతోష్ణంబును వినుత తుషారానిలాభ్ర విద్యుద్వృష్టి
స్తనిత పరివేష నిర్ఝర ధనివులు ధరలోన బరగు ధాతువు లయ్యేన్.

* * *

ముగింపు

క. శుభకృతు శోభనకృతులను విభవం బగు ప్రజకు నాది వృష్టియు గురియున్
యభినవము క్రోధియందును రభసంబు ననల్పవృష్టియు రాష్ట్రము నొందున్.

తే.గీ. పరగ విశ్వావసు పరాభవల నొందు
నాంధ్రభూమికి నలజడి యతిసువృష్టి
పాండ్య కేకయ కర్ణాట బర్బరాది
భూములకు నెల్ల క్షామంబు నొందు సభవ.

తే.గీ. వసుధ నతివృష్టి గురియు ప్లవంగయందు
కీట మృగ బాధనొందును కేరళందు
నాంధ్ర భూమికి నలజడి ననగ ప్రత్తి
క్షామ మగు రోగభయములు చాలగలుగు.

గీ. కీలక సంవత్సరమున చాలారోగములు గల్గు సస్యములెల్లన్
మేలుగ పండును పశువుల దూలించు విదర్భకరువుదోచు విధిజ్ఞా.

క. సౌమ్య సాధారణల పెక్కు క్షామ మగును
యాంధ్ర నేపాళ పాంచాల యంగభూమి
నలజడియు విప్రబాధలు నల్పవృష్టి
కరమ భూ .... .... ....

* * *

విశేషాంశములు

ఈ సస్యానందకావ్యము సకలజనస్తుత్య దోనయామాత్య ప్రణీతము. సర్వజనాభివృద్ధికి సస్యము, ఆ సస్యవృద్ధికి వానలు ఆధారము. అందుచే వానల రాకపోకల వివరములు జనులకు కవి ఈ కావ్యము ద్వారా అందజేయ దలచినాడు. గార్గేయాది సంహితల పరిశోధించి దీనిని వ్రాసినట్లు గ్రంథాదిని తెలుపుకొని నాడు. మేఘ ధాత్వాదులగూర్చి తెలిపి, ఏనెలలో, ఏ రాశియందు, ఏ సంవత్సరమున వర్షములు ఎట్లుండునో, ఏప్రాంతమున ఎట్లుండునో, సస్యసంపద ఎట్లువర్ధిల్లునో మొదలగు విషయము లీ గ్రంథాంశములు. గ్రంథాదిని కవి తనవంశ వర్ణనను కొంత గావించినాడు. ఇష్టదేవతా ప్రార్థన గావించినాడు. కృతిపతిని గూర్చిన వివరములు కానరాలేదు.

ఈ ప్రతియందు ఆదినుండి నాలుగు ఆశ్వాసములవరకును, మరియు అయిదవ ఆశ్వాసములో కొంతభాగము కలదు. మధ్యమధ్య పదిపత్రములు పోయినవి. గ్రంథాంతము ఈ ప్రతియందు లేకుండుటచే ఎక్కువ వివరములు తెలియుటలేదు. ప్రతిలోని లిపి స్పష్టము. స్వల్పముగ అక్షరదోషములు గలవు.

# సస్యానందము

## దోనయామాత్యుడు

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | ; 2802 | కాల్ నెం | ; టి 8-147 |
| ప్రతి | ; తాళపత్రము; అసమగ్రము. | పత్రములు | ; 17 |
| ప్రతి పరిమాణము | ; 39×4 సెం.మీ. | పత్ర పంక్తులు | ; 7 |

విశేషాంశములు

గ్రంథాద్యంతము లీ ప్రతియందు లేవు. ప్రతి యలతిగా క్రిమిదష్టము. లిపి స్పష్టమే కాని లేఖన దోషము లత్యధికము.

# సానందగణేశ్వర చరిత్ర

## భద్రకవి లింగకవి

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 747 | కాల్ నెం | : టి 8-216 |
| ప్రతి | : తాళపత్రము ; అసమగ్రము. | పత్రములు | : 50 |
| ప్రతి పరిమాణము | : 41×4 సెం.మీ. | పత్ర పంక్తులు | : 7 |

ప్రారంభము

శ్రీకరాకారు నాశ్రిత జనాధారు నాకాధి భువనేశు నరలోక వాసు
వాసుకిగ్రైవేయు వామాంక శయను భాసుర శివకీర్తి పరతత్వ మూర్తి
కిన్నరేశ్వరు మిత్రు గిరిజా కళత్రు సన్నుత గీర్వాణు సద్భక్తి పూర్ణు
ప్రవిమల మునిమిత్రు భవ్యచారిత్రు బాపల్యగుణమారుచంద్రకోటీరు

కలధౌతగిరివాసు కరిచర్మవాసు ఫలదానచాతుర్య బహుతరైశ్వర్య
అవికల్పగుణధన్య నాద్యంతశూన్య అనుపమభవనాశు అఖిలలోకేశు
శరణాగతారాధ్య సద్భక్తిపూజ్య శాంతగుణారాధ్య వేదాంతవేద్య

* * * *

రచియింతు తత్కథారంభ మెటులనిన.
రమణీయ నైమిశారణ్యంబునందు అమితపుణ్యులు శౌనకాదిసన్మునులు
.... .... .... హరకథారథుసూతు హరిమేథుజూచి
మునినాథు సానంద మునిగణేశ్వరుని వినుత చరిత్రంబు వినిపింపవలయు
యింతైన యీకథ విన నాత్మ లోన సంతోష ముదయించ చాల నందరికి
నతిపుణ్య వర్తనుం డతడు నా దేవ హితనందనుని పురి యేటికి నరిగె
కరుణావిధేయుడై ఘనతర.... వార్ధి నరకవాసుల జూచి నయగుణోజ్వలుడు
కాలకింకర భయంకర బాధ లుడిపి కాలారిపురికి నేగతి నంపెవారి
విపులవాక్ప్రౌఢిని విధ మెరిగించి కృపమమ్ము నందరి కృతుల గావింపు
మనవుడువిని సూతు డా మునీశ్వరుల కనుగొని యీ పుణ్య కథ జప్పదొణగె
సుజ్ఞాన లోక సంస్తూయ మానసుడు ప్రజ్ఞాతిరస్కృతి పద్మాసనుండు
సకలవేద పురాణ శాస్త్రకోవిదుడు మకరాంకు హరిభక్తి మహితమండలుడు
కమనీయ చరితుండు కలడొక్కమౌని విమలచిత్తుడు పూర్ణచిత్తు డనంగ
బదరికాశ్రమమున భర్గుగొల్చుచును వదలని నిష్ఠతో వర్తింపుచున్న
యెడ నొక్కనాడు యేతెంచి వెందమున పొడమిన చింతతో బుద్ధిగావించి
చనుదెంచి యాతనిసతి భద్రవతియు వినయ వాక్యంబుల విభున కిట్లనియె.

0 0 0 0 0

## ముగింపు

అని విన్నపముసేయ నాదిత్యసుతుని   కనుగొని ప్రీతి శ్రీకంఠు డిట్లనియె
మహిత షడాక్షరీ మంత్రసిద్ధుండు   మహిమతో సానంద మౌనీశ్వరుండు
ఘనపుణ్యు డదిగాక ఘనత మద్భక్త   జనలోక హితుడు సజ్జనలోకహితుడు
కరుణ మిక్కిలి వాత్మ గలుగుటజేసి   యొరుల దుఃఖముజూచి నోపక వీరి
నరకంబు లెడబాపి నయగతి జూపి   పరమ ధన్యులజేసి పటుమంత్రశక్తి
శుక్తిగర్భంబులో జొచ్చిన మొదలు   ముక్తకణంబులు ముక్తా ఫలంబు
లగుగాక తొంటి తోయంబుల లోన మగుదంగ   జూడునె మత్పురిజేరి
యున్నవారికి గలవె .... ములు   విన్ననె మరినీవు ఎన యత్తెరంగు
నీకేల వీనికై నేడింత చింత   కటికంబునకు బోయి కార్య మంతయును
వదలక చేయుము వరుసతోనిపుడు   నీవు నీ .... బు నితరుల కేల
పరిపూర్ణమై యుండు పరితాపమేల
జను మన ప్రణమిల్లి సంమోద మలర   జనియె కాలుడు యథాస్థానంబునకును
యీపుణ్యచారిత్ర మెవ్వరు శ్రద్ధ   భక్తితో చదివిన విన్న వ్రాసినను
దొరిదొరి వారికి దురితముల్ దొరగు   కలుగు శంకర పాదకమల సద్భక్తి
ప్రాకటంబుగ పుత్రపౌత్రాభి వృద్ధియు
ఆయురారోగ్యంబు లగణితైశ్వర్య   పాయక ఆనంద పదమున బొంది
వరపుత్ర మిత్రజైవాతృకనేత్రు   డగు శంభు కృపచేత నని చెప్పెసూతు
డని శౌనకాదులు యెరిగించి నట్లు   అని శివజ్ఞాన రత్నాకరు పేర
.... ధ కులాగ్రామణి పేర
పురిహూతాంకర్గపతి వీరు పేర   గురురూప చంద్రార్క కోటిదుపేర
త్రివిధ తావ.... శు పేర   తనభక్తులకు నెపుడు ధనధాన్యవృద్ధి....
....   ....   ....   తగనొప్ప
....   సమయాంభోజ శీతాంశు పేర   క్రతువైరి భక్తరక్షామణి పేర
శ్రీరుద్ర సంకాశ శివయోగిపేరచెన్న   వీరేశ్వరునిపేర
శారదక.... సమర్తిపేర వరుస సద్గురురాయ . . సత్పదంబు
జాత గంధ విలోల షట్పదు పేర   నాత్మగుణ ధన్యుడగు శివయోగి
యిది వీరభద్రేశ హేళప్రసాద   సదమల సత్కావ్య సందర్భకుశల
చిరపుణ్య శోభిత శ్రీకాళహస్తి   గురు సంగమేశ్వర కోమల చరణ

జలజాత గంధ పుష్పసమాన కలికమానసచంద్ర కవిలింగధీర
విలసిత సానంద విమల చారిత్ర
సకల పవిత్రమీ సత్కృతి యందు అకలంకముగ తృతీయాశ్వాస మయ్యె.

ప్రతి విలేఖనము :

రక్తాక్షి నామ సం॥ ........ గురువారం సరికి యలుకూరు పీటి మోళె తిమ్మారెడ్డిగారికి స్వగ్రామం కరణం శింగన్న కొమారుడు భీమన వ్రాసి యిచ్చిన ప్రతి సంపూర్ణం.

ఇది ద్విపద కావ్యము. దీని నీ కవి శివయోగి వీరభద్రేశ్వరున కంకిత మిచ్చెను. ఇది సానందముని చరిత్ర, అతడు నరుల నరక బాధలను తొలగించిన విధము దీనివస్తువు. ఇందు 3 ఆశ్వాసములు ఉన్నవి.

ఈ ప్రతియందు పూర్తి కావ్య మున్నది. ఈ ప్రతికొంత శిథిల మగు చున్నది. అచ్చటచ్చట కొన్నిపంక్తులు నష్ట మైనవి. ప్రతి విలేఖనమున దోషములు చాలగలవు. ప్రతి కొంత క్రిమిదష్టమై యున్నది.

# సానందగణేశ్వర చరిత్ర

## భద్రకవిలింగకవి

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 725 | కాల్ నెం | : టి 3-191 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము. | పత్రములు | : 81 |
| ప్రతి పరిమాణము | : 46×4 సెం.మీ. | పత్ర పంక్తులు | : 7 |

ప్రారంభము

రమణీయ నైమిశారణ్యంబునందు నమితపుణ్యులు శౌనకాది సన్మునులు
సరసత శివకథా సద్గోష్ఠినుండి హరకథా పరగణ్యు డగు సూతుజూచి

## సా నం ద గ ణే శ్వ ర చ రి త్ర

### భద్రకవిలింగకవి

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 542 | కాల్ నెం | : టి 8 - 217 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము. | పత్రములు | : 88 |
| ప్రతి పరిమాణము | : 33×3.5 సెం.మీ | పత్ర పంక్తులు | : 4 నుండి 5 |

వి శే షాం శ ము లు

ఈ ప్రతియందు మూడాశ్వాసములు పూర్తిగనున్నను ప్రతి చాలవరకు క్రిమిదష్టమై శిథిలమైనది. కొన్నిపత్రములు విరిగిపోయి సగభాగములే మిగిలి యున్నవి. లిపి యొకమాదిరిగా నున్నది. లేఖన దోషము అధికము.

## సానందోపాఖ్యానము

### కోట శివరామయ్య

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 489 | కాల్ నెం | : టి 8-192 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము. | పత్రములు | : 96 |
| ప్రతి పరిమాణము | : 43 × 4 సెం.మీ | పత్ర పంక్తులు | : 7 |

ప్రా రం భ ము

శా. శ్రీకాశీ రమణీమణీ పరిణయ శ్రీవేళ కౌతూహలా
స్తోకుండై తుహినాచలేంద్రుడు భవద్గోత్రాన్వయాధిక్యమున్
మాకుం దెల్పు మటన్న నొండనక లీలామందహాసాంకుర
వ్యాకోచాననుడైన ధూర్జటి మదీయాభీష్టమున్ సల్పెడున్.

## సానందగణేశ్వర చరిత్ర

### భద్రకవిలింగకవి

| | | | |
|---|---|---|---|
| ఆక్సేషన్ నెం | : 542 | కాల్ నెం | : టి 8 - 217 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము. | పత్రములు | : 88 |
| ప్రతి పరిమాణము | : 33×3.5 సెం.మీ | పత్ర పంక్తులు | : 4 నుండి 5 |

విశేషాంశములు

ఈ ప్రతియందు మూడాశ్వాసములు పూర్తిగనున్నను ప్రతి చాలవరకు క్రిమిదష్టమై శిథిలమైనది. కొన్నిపత్రములు విరిగిపోయి సగభాగములే మిగిలి యున్నవి. లిపి యొకమాదిరిగా నున్నది. లేఖన దోషము లధికము.

## సానందోపాఖ్యానము

### కోట శివరామయ్య

| | | | |
|---|---|---|---|
| ఆక్సేషన్ నెం | : 489 | కాల్ నెం | : టి 8-192 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము. | పత్రములు | : 96 |
| ప్రతి పరిమాణము | : 43 × 4 సెం.మీ | పత్ర పంక్తులు | : 7 |

ప్రారంభము

శా. శ్రీకాశీ రమణీమణీ పరిణయ శ్రీవేళ కౌతూహలా
స్తోకుండై తుహినాచలేంద్రుడు భవద్గోత్రాన్వయాధిక్యమున్
మాకుం దెల్పు మటన్న నొండనక లీలామందహాసాంకుర
వ్యాకోచాననుడైన ధూర్జటి మదీయాభీష్టమున్ సల్పెడున్.

శా. భావజ్ఞుం డగు కాళహస్తిపతి శుంభత్కుంభి కుంభోపమన్
శ్రీవిద్యోత కుచాగ్రసీమ మకరీచిత్రాఘముల్ వ్రాయ ప్ర
జ్ఞావిజ్ఞప్తికి మెచ్చి ముద్దొసగు శ్రీజ్ఞానప్రసూనాంబికా
దేవీరత్నము భోగసౌఖ్యములకీర్తి శ్రీలు మా కీవుతన్.

సీ. తపనీయ తాటంక ధగధగ ద్యుతిపారి .... ....
.... .... .... ముత్యాల రవికెపై మురుపుచూప
కల్యాణ రత్నకంకణ నిక్వణచ్ఛటల్ అంగుళీయ .... ....
... .... .... ...

తే.గీ. ఘర్మమంజీర మంజులార్భటులు సెలగ చారుశృంగార మోహనాకారలీల
లెసగ సాక్షాత్కరించి మదీప్సితంబు లిచ్చు శ్రీకాళికాదేవి నిచ్చ గొలుతు.

* * *

వ. సమర్పితంబుగా నా యొనర్పం బూనిన సానందోపాఖ్యానంబునకు కథా సంవిధానం బెట్టిదనిన.

మ. జటిరాణ్మాన్యము పుష్పపల్లవ సమిత్సంపాద నాథోచర
త్పటు వాజన్యము ముక్తి సౌఖ్యమహిమా వాల్లభ్య మేధావిధా
నటనాపుణ్యము సాలనింబ గణికా నారంగ రంభా జపా
కుటలావణ్య మనంగ నైమిశ మెసంగున్ భూరిలావణ్యమై.

* * *

సీ. అనఘ చారిత్ర పావనమైన శంభు పు రాణరాజికి మహారాజ మైన
స్కందపురాణ సత్కథ లన్ని వీనుల విందుగా వింటిమి డెంద మలర
నందు సానంద సంయమ రాట్ప్రభావంబు వినగోర మోద మావిర్భవించె
నమ్ముని పుంగవుం డర్కజు పురి కేల విచ్చేసె పాపుల వెతలు వాపి

తే.గీ. కరుణ మానస వీథిలో గదలు కొనగ శంభు లోకానుగతుం నే కరణి చేర్చె
నింత మాహాత్మ్య మతనికి నెట్లు వచ్చె తెలియ వినిపింప వయ్య సుధీవరేణ్య.

చ. అన విని సూతు డిట్లనియె నమ్మునినాథుల దిక్కుఁజూచి య
య్యనఘ మహత్వ మెన్న పులకాంకుర మయ్యెడి మేన గంపమున్
బెనగొనుచు న్మదంధక విభేది సమున్నత భక్త కోటిలో
ఘనత వహించె నమ్ముని జగన్నుత గౌరవ మెన్న శక్యమే.

సీ. సంసార నీరద ఝంఝూ ప్రభంజనం బాఘాచలేంద్ర వజ్రాయుధంబు
పంచేంద్రియ ద్విపపంచాస్య శాబకం బరివర్గ దవకీలి కాంబుదంబు
కలుష మండూక భీకరదండ శూకంబు పటు దుఃఖవారాశి బాడబంబు
రాగానురక్త సారంగ శార్దూలంబు భేదాంధకార సూర్యోదయంబు

తే.గీ. సచ్చిదానంద మహిమాతిశయ విభూతి మానితానూన హంసోక్త మార్గపూర్ణ
భావయోగిప్రకాశ సంపత్ప్రదంబు బదరికావన మత్యంత పావనంబు.

ఉ. ఆ వనమధ్యసీమ సుగుణాకరుడై వరపూర్ణవేత్త ధా
త్రీ విబుధాగ్రగణ్యుడు ప్రదీపిత వేదకళారహస్య సం
భావితమూర్తి యై యపరపద్మజుడో యన శంభుపాదసే
వా వినుతాంతరంగు డయి వర్ధిలు తత్వవివేక సంపదన్.

* * *

ముగింపు :

సీ. విను మమ్మహాత్ముండు ఘన కృపాంభోరాశి పరబాధ జూడ జొప్ప డని వాడు
పంచాక్షరీమంత్ర పఠనానుభావుండు గావున నిబ్బంగి కలుష మతుల
ముక్తుల గావించె ముక్తాఫలము లైన జలములు గ్రమ్మర జలము లగునె
మముజేరి నట్టి ధీమంతులు రారింక పురి కేగు మెప్పటి పూన్కిఁదనర

తే.గీ. నరల కికమీద పాపాత్ము లనుదినంబు రాగలరు నీదు ప్రోలికి రాజ్యమునకు
నీవుగా కన్యు లెవ్వరు నిపుణబుద్ధి జను మటం చాన తిచ్చిన శమను డరిగె.

వ. అని చెప్పి కౌతూహలప్రీతుండై సూతుం డమ్మౌని వ్రాతంబుల కిట్లనియె.

శా. ఆచంద్రాంబుజమిత్ర సప్తనగతారాంభోధియై నిల్చుగా
కీచారిత్రము నెవ్వరేని వినినఁ హేలాగతిఁ వ్రాసినం
బ్రాచుర్యంబుగ వారి కబ్బు ధనలాభ క్షేత్రసౌభాగ్య లీలా
చంచద్విభవంబు లీశ్వర కృపాలాలిత్య వీక్షోన్నతిన్.

ఆ.వె. ఎవ్వ రేమిగోరి యిక్కథ వినిన త త్కామితంబు బడయగలరు దీని
పేరుకొనిన మాత్ర భీకర నరకార్తి జెందబోదు ముక్తి జెందువారు.

క. సానంద చరిత్రం బిది యానందము మీర వినిన యంతనె కలుగున్
శ్రీనందన మదహారి చి దానంద పురంబు సంతతానందముగన్.

శా. ఆనందామృత పూర పూర్వసురదైర్యాహార్య నిర్భేదనా
నూనప్రౌఢి శిఖాగ్ర వజ్ర మణి సిందూర స్ఫురన్మూర్తి తే
జోనిస్తుల్య విహారహార కళికాఘంభత్కపాలా వళీ
నానాపన్నగ రాజ రాజ దరిరాణ్మత్తేభ కంఠీరవా.

క. భృంగి రంగత్కర మృదు లాంగుళ రణరణ దయోభ్ర యప్రతి తాళా
భంగుర రక్తిమృదం గో త్తుంగరవ స్నేహఘటన దూర్వహనటనా.

పంచచామరం.

హరిత్పటీపటీర హీరహార జిద్విబోధనా
ధరాధర ప్రదీప్తరత్న ధామ చత్వరోచ్చరా
చరాచరాది సర్వభూత సంతతావనాకరా
కరాళ విస్ఫులింగ కీలకా దవానలాశికా.

* * *

గద్యః

ఇది శ్రీమత్కాశికాంబా వరప్రసాదలబ్ధ సాహిత్యవైభవ సదాశివస్వరూప సద్గురు చర
ణారుణ రాజీవ సేవా సమాసాదితాద్వైతానుభవ కౌశికగోత్ర సుధార్ణవ కైరవబాంధవ

కోటబాపనయ్యా తనూభవ సవినయగుణ విశేష శివరామ నామధేయ ప్రణీతం బైన సానందోపాఖ్యానం బను మహాప్రబంధంబునందు సర్వంబును బంచమాశ్వాసము.

* * *

విశేషాంశములు:

ప్రతిలేఖనము : ప్లవనామ సం॥ చైత్ర శు॥ ౨ సౌమ్యవారం ఝాముప్రొద్దువరకు సానందోపాఖ్యానం ముదగొండ మంత్రమూర్తిగారి ప్రతిలోనున్న క్రమాన మూలంపల్లి రామయ్యా కొమారుడు రాజశేఖరం కొమారుడు రాజమల్లు వ్రాసుకొనెను.

ఈ సానందోపాఖ్యానము కోటశివరామకవి ప్రణీతము. అతడు పరమ శివభక్తుడు. ఆతని గురువు సదాశివ గురుడు. అతని సలహాతో కవి ఈ కావ్యమును శ్రీకాళహస్తీశు పేర నంకితము గావించెను. ఇది ౫ ఆశ్వాసముల కావ్యము.

కవి కావ్యాదియందు శర్వమహిమను దెలుపుచు పోతన "కమలాక్షు నర్చించు కరములు కరములు"- అను పద్యము వంటిదే యగు 'శివు నపేక్షించిన చిత్తంబు చిత్తంబు' అను సీసపద్యమును రచించెను. ఇది శివనామ మహిమ ప్రాధాన్యముగల గ్రంథము.

సానందముని ప్రభావము, అత దర్కజుపురి కరుగుట, అచటి పాపుల వెతలు బాపి వారిని శంభులోకానుగతులను చేయుట, మున్నగు చరిత్ర ఈ కావ్యవస్తువు. ఇందు యమలోకములోని వివిధవిధములగు నరకయాతనలు వివరముగా వర్ణించబడియున్నవి. ఈ ప్రతియందైదాశ్వాసములు గలవు. కాని పంచమాశ్వాసములో నాలుగుపత్రములును, ప్రథమాశ్వాసములో మూడవపత్రమును లోపించినవి. ఈ ప్రతి నలుపు దిరిగినది. ఒకటి, రెండు పత్రములు తునిగిపోయినవి. లిపి స్పష్టము. కాని కొద్దిగా అక్షర దోషములు గలవు.

# సౌనందోపాఖ్యానము

## కోట శివరామయ్య

ఆక్సెషన్ నెం : 4029 | కాల్ నెం. : జి 8-295

ప్రతి : కాగితము; అసమగ్రము. | పుటలు : 216

ప్రతి పరిమాణము : 11×12.5 సెం.మీ. | పుట పంక్తులు : 26

విశేషాంశములు :

ప్రతివిలేఖనము :- విళంబి నామసంవత్సర నిజ ఆశ్వీజ శు॥ 9 యందు సమాప్తం దస్తూరి ఆగనూరి అగసాల నాగన్న వ్రాసినాడు.

*　　*　　*

ఇది శివరామకవి ప్రణీత మగు సౌనందోపాఖ్యాన మను కావ్యముయొక్క కాగితపు ప్రతి. ఈ ప్రతియం దాద్యంతముల గ్రంథము కలదు. ప్రతియం దటనట వర్ణ చిత్రములును కలవు. ఇందు మధ్య నాలుగు కాగితములు మాత్రము చిరిగి నష్టమైనవి. ఇది అయిదు ఆశ్వాసముల గ్రంథము. కవి దీనిని కాళహస్తీశ్వరున కంకితమిచ్చెను.

ఈ ప్రతియందలి లిపి స్పష్టముగ నున్నది. ప్రతిలోని కొన్ని కాగితములు క్రిమి దష్టములై ఓనుగుటకు సిద్ధముగ నున్నవి. ప్రతి విలేఖనమున నల్ప దోషము లున్నవి

# సారంగధర చరిత్ర

## చేమకూర వేంకటకవి

ఆక్సెషన్ నెం : 788 | కాల్ నెం : టి 8-168

ప్రతి : తాళపత్రము; అసమగ్రము. | పత్రములు : 60

ప్రతి పరిమాణము : 42.5×4 సెం.మీ. | పత్ర పంక్తులు : 6 నుండి 7

ప్రా రం భ ము :

శ్రీసతి వక్షుడైన సరసీరుహ నేత్రుడు విశ్వగాత్రు ద
బ్జాసన పాకశాసన మునీశ్వర ముఖ్యసురేంద్ర రక్షితా
భ్యాస దయాసముద్రుడు సదాశివరుద్రుడు భద్రు దర్మిలిజా
భాసురలీల లోకములు ప్రస్తుతి కెక్కగ బ్రోచుగావుతన్.

*　　*　　*

వ. అని ఇష్టదేవతా ప్రార్థనంబును సుకవిజన వందనంబునుం గావించి నా యొనర్పం బూనిన
సారంగధరోపాఖ్యానంబునకు కథా క్రమంబెట్టి దనిన.

సీ. ద్విజరాజ విలసనోత్తేజమై ....తియు నక్షత్ర మాణవనున చయంబు
చక్రేశ్వరానంద సంయోగ మయ్యును పంకజ విధ్వస్త భాసురంబు
అ....సంశ్రయధారమై యొప్పుచుండియు విగత విరూపాక్ష విమలతలము
శూద్రసత్తమ చరశోభిత మయ్యును శూద్రకరహిత విశోకయుతము

తే.గీ. ఖండనోద్దండ మండలాధీశతండ చండ దోర్దండ పాలిత మండలంబు
మలయమారుత దేవ సన్మధ్యమంబు సాంద్రశుభకరము రాజమహేంద్రవరము.

అందు .

క. రాజనరేంద్రుడు రిపుఫణి రాజనరేంద్రుడు కళాపరాక్రమ రేఖా
రాజిత భోగపరాజిత రాజనరేంద్రుడు సుధాకరకులుం డమరున్.

*　　*　　*

ము గిం పు :

గీ. వంశకరుడైన సుతు డుద్భవంబు నొంద .... .... ....
.... .... .... వలయు గురుని యొద్దికని తల్లిదండ్రుల నుపచరించి.

ఉ. మెచ్చగు పాదుకల్ దొడిగి యప్పటి యట్ల .... ....
.... .... .... .... గురు

న్వచ్చితె యన్న వాజ్యవిభవంబులు హ స్తగతంబు లైనచో
హెచ్చగ దన్న నీకు బ్రతి యెవ్వరు జ్ఞాన మహా....

చం. .... .... .... .... .... దీ
వనలు వహించి పుణ్యు లగు వారలకుం దనదివ్యమూర్తి కుం
భిని గనుపించువంచుదనదుపేరు దలంచిన వారికిన్ ....
.... .... .... .... రోన్నతిన్.

క. సారంగధరు చరిత మె వ్వారుం జదివినను విన్న వ్రాసిన సౌభా
గ్యారోగ్య పుత్ర పౌత్ర శ్రీరత్న ధనాభివృద్ధి .... ....

విశేషాంశములు:

గ్రంథము శిథిలావస్థలో నున్నది. పెక్కు పత్రములు శిథిలమై యున్నవి. చాల పత్రములు సగముభాగమే యున్నవి. ఆశ్వాస విభాగ మస్పష్టము.

## సారంగధర చరిత్ర

### చేమకూర వేంకటకవి

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 718 | కాల్ నెం | : టి 3-51 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము. | పత్రములు | : 65 |
| ప్రతి పరిమాణము | : 39.5×4 సెం. మీ. | పత్ర పంక్తులు | : 6 |

ప్రారంభము:

వ. అభ్యుదయ పరంపరాభివృధి యగు నా యొనర్పం బూనిన సారంగధర చరిత్రంబునకు కథాక్రమం బెట్టిదనిన.

క. రాజనరేంద్రుడు రిపువణి రాజనరేంద్రుడు కళాపరాక్రమ రేఖా
రాజిత భోగపరాజిత రాజనరేంద్రుడు సుధాకర కులేంద్రుం డలరున్.

విశేషాంశములు :

ప్రతిపిలేఖనము :

వర్తమాన వ్యావహారిక చాంద్రమాన స్వభాను నామసంవత్సర మార్గశిర శు. ౫ మీ వరకు సారంగధర చరిత్ర సంపూర్ణము. ఈ ప్రతిని అత్తలూరి వీరేశలింగం కుమారుడు మల్లయ వ్రాసెను.

ఈ గ్రంథకర్త నామము గ్రంథాదిని గాని, గ్రంథాంతమునగాని లభ్యము కాలేదు ఆశ్వాసాంత గద్యలును లేకుండుటచే కవిని గురించిన వివరము లేమియు లభ్యము కాలేదు. ఆశ్వాసాంత గద్యలును లేకుండుటచే కవిని గురించిన వివరము లేమియు లభ్యము కాలేదు. కావ్యరచన కథాప్రారంభముతోనే యున్నది. కావ్యాంతమున ఫలశ్రుతి మాత్ర మొక పద్యమున నీయబడినది. ఇతర ప్రతులవలన ఇది చేమకూర వేంకటకవి కృత మని తెలియు చున్నది.

ఈ ప్రతి నలుపు దిరిగినది. క్రిమిదష్టమై మధ్య గల కొన్నిపత్రములలో తునిగిన భాగములు కానవచ్చుట లేదు. ఆశ్వాస విభాగ మీ ప్రతియందు లేదు.

## సారంగధర చరిత్ర

### చేమకూర వేంకటకవి

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 4653 | కాల్ నెం | : టి 3-152 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము. | పత్రములు | : 22 |
| ప్రతి పరిమాణము | : 43×3.5 సెం.మీ. | పత్ర పంక్తులు | : 7 |

**వి శే షాం శ ము లు:**

ఈ ప్రతియందు గ్రంథాది గలదు గాని గ్రంథాంతము లేదు. ప్రతి మధ్యలో నచటనట కొన్నిపత్రములు లోపించినవి. ఈ సారంగధర చరిత్ర మూడు ఆశ్వాసముల గ్రంథము. కాని ఇందు తృతీయాశ్వాసమున కొంతవరకే గలదు.

ఈ ప్రతిలోని పత్రములు కొన్ని శిథిలము లగుచున్నవి. ప్రతి విలేఖనమున చాలదోషములు గలవు. ప్రతి నలువు క్రిమిదష్టమై యున్నది.

## సారంగధర చరిత్ర

## చేమకూర వేంకటకవి

| | | | |
|---|---|---|---|
| ఆక్సేషన్ నెం | 1754 | కాల్ నెం | టి 3-93 |
| ప్రతి | తాళపత్రము; అసమగ్రము. | పత్రములు | 41 |
| ప్రతి పరిమాణము | 45.5×3.5 సెం.మీ. | పత్ర పంక్తులు | 5 |

**వి శే షాం శ ము లు:**

ఈ ప్రతి క్రిమిదష్ట మైనది. గ్రంథ శైథిల్య గ్రంథపాతము లధికము. అచటచట కొన్ని పత్రములు లోపించినవి. లిపి స్పష్టము. లేఖన దోషము లధికము. గ్రంథాద్యంతములు లేవు.

## సారంగధర చరిత్ర

## బాకాల శంభుదాసకవి

| | | | |
|---|---|---|---|
| ఆక్సేషన్ నెం | 3381 | కాల్ నెం | టి 3-285 |
| ప్రతి | కాగితము, సమగ్రము. | పుటలు | 85 |
| ప్రతి పరిమాణము | 23×25 సెం.మీ. | పుట పంక్తులు | 24 |

ప్రారంభము :

శ్రీశైల వాసుని చెలువొప్పదలచి వాసిగా వైకుంఠ వాసుని దలచి
అజుని నెన్నిక కెక్కి యంబకుమ్రొక్కి గజముఖు సేవించి కరములు మోగిచి
వాలాయముగ స జూడ వాసు నివాసు నీలకంఠుని సేవ నిరంతరంబు చేసి

* * *

వసుతు కెక్కిన సోమ వంశంబునందు శాంతనుం డను కీర్తిశాలి జనియించె
అసమాన జయశాలి యగు శాంతనునకు వెస రాజమణి చిత్ర వీర్యుండు బుట్టె.

* * *

.... ... .... .... రణజయుం డారాజు రాజనరేంద్రు
భీకర వైరుల బింకంబు లణచు నేకచక్రంబుగా నేలును భూమి
తేజరిల్లుచు భోగ దేవేంద్రుడయ్యె రాజు పట్టపుదేవి రత్నాంగి యపుడు
ముక్కంటి వరమున మురిపెమున గన్న చక్కని పుత్రుండు సారంగధరుడు.

* *

ముగింపు:

వసుధేశతనయ మీ వారు చుట్టములు కుశలమై చిత్రాంగి కుశల మేమైన
యని వారు మేలు చిత్రాంగి లాభంబు వినుతించి మ్రొక్కిన విని ముని నాథు
సదయుడై వాని దాసామర్థ్యమునకు మది మెచ్చి రాచకొమారక మీకు
పుణ్యంబు కీర్తి సంపూర్తి యై జగతి గణ్యమై కథ నిలిచె కలకాల మెల్ల
యీశ్వరు దయచేత యిచ్చోట నీవు మా సేవ చేసి నెమ్మది నుండు మనిన
చింతలన్నియు మాని శిధులగలసి సంతోషమున నుండె సారంగధరుడు
శేలుగా నావట శిధుల కెల్ల ఆ మీననాథుండు అధికుండు అనుచు
వినుతించె జౌరంగి విరుపాక్ష మూర్తి శివునితో తొమ్మండ్రు సిద్ధులై రిల్లు
భువిలోన సారంగ భూపాలు చరిత కవిత మాహాత్మ్యంబుగల చేమకూర
అప్పన్న జెప్పిన ఆ ప్రకారమున చెప్పితి బాణాల శంభుదాసుడను
యిది విన్న వ్రాసిన యిష్టభోగములు సదయుడై కరుణించు సర్వేశ్వరుండు.

**విశేషాంశములు:**

ఈ ప్రతి బాగుగ నున్నది. కాని యించలి లిపి స్పష్టముగ లేదు. ప్రతి విలేఖనమున చాల దోషము లున్నవి.

## సారంగధర చరిత్ర

## బాణాల శంభుదాసకవి

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 742 | కాల్ నెం | : బి 3-207 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము. | పత్రములు | : 44 |
| ప్రతి పరిమాణము | : 34×3.5 సెం.మీ | పత్ర పంక్తులు | : 5 |

**విశేషాంశములు:**

గ్రంథపాత, శైథిల్యాదులు కలవు. ప్రతి క్రిమిదష్టము. వ్రాత దోషములు కలవు. గ్రంథాంతములేదు. సారంగధరుని చరిత్రము ద్విపదలో వ్రాయబడినది. చేమకూర వేంకటకవి పద్యకావ్య కథకు ఇందలి కథకు నలతి మార్పు గోచరించు చున్నది.

## సారంగధర చరిత్ర

## బాణాల శంభుదాసకవి

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 2327 | కాల్ నెం | : బి 3-137 |
| ప్రతి | : తాళపత్రము, అసమగ్రము. | పత్రములు | : 52 |
| ప్రతి పరిమాణము | : 28×3 సెం.మీ. | పత్ర పంక్తులు | : 6 |

**విశేషాంశములు :**

**ప్రతివిలేఖనము :**

వ్యవహారిక చాంద్రమాన వికారి నామ సంవత్సర చైత్ర బ౧౨ అంగారక వారం

.... .... .... ....వరకు భోనగిరి ఐర్రయ్య ప్రతిలో వున్నక్రమాన వ్రాసుకున్న సారంగధరచరిత్ర సంపూర్ణము.

ఈ ప్రతియందు ఆదిలో 28 తాళపత్రములు లోపించినవి. ఆదిమొదలు గ్రంథాంతము వరకు ఈ ప్రతియందు గలదు. ఇది పాంక్రిమి దష్టమైనది. మిక్కిలి శిథిలమై కొన్ని పత్రములు విరిగిపోయినవి. ఇందలి లిపి స్పష్టముగ లేదు. అక్షర దోషములును చాల గలవు.

## సారంగధర చరిత్ర

### బాకాల శంభుదాసకవి

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 1756 | కాల్ నెం | : టి 3-155 |
| ప్రతి | : తాళపత్రము, అసమగ్రము. | పత్రములు | : 34 |
| ప్రతి పరిమాణము | : 32×3.5 సెం.మీ. | పత్ర పంక్తులు | : 6 |

విశేషాంశములు :

గ్రంథము పూర్తిగా శిథిలావస్థలో నున్నది. పత్ర క్రమసంఖ్యా భాగము స్పష్టముగా గోచరించుటలేదు మరియు పెక్కు పత్రములు రెండుభాగముల విరిగిపోయినవి. గ్రంథాద్యంతములు లేవు. వ్రాత దోషములు కలవు.

## సిద్ధ - శంకర శివయోగుల జీవితచరిత్ర

| | | | |
|---|---|---|---|
| ఆక్సేషన్ నెం | : 4044 | కాల్ నెం | : టి 3-310 |
| ప్రతి | : కాగితము; సమగ్రము. | పుటలు | : 33 |
| ప్రతి పరిమాణము | : 20X15 సెం.మీ. | పుట పంక్తులు | : 20 |

ప్రారంభము

**నందికొటుకూరు సిద్ధయోగి మహిమ.**

సీ. ఎమరైన పులితోడ నేకాంతముచు దెల్పి మరలించి పోయినమాన్యు డెవడు
ఆది గర్భాధానమైనప్డు భార్యతో జనియించు శంకరుడనియె నెవడు

మాతంగ భక్తుని మందిరంబున విందు భవకమైగై కొన్న భవ్యుడెవడు
ఖండిత శీర్షమై యుండిన మహిషంబు కాల్దన్ని బ్రతికించె ఘను డెవండు
చుట్టను నగ్గిచే సుంకియనుచుబల్కి ప్రతిమచే గొఱవిని బడెసె నెవడు
భక్తులౌ మ్లేచ్ఛప్రజాపతికి నిమ్మ్రుకుంటి పొపడై పొడగట్టె పరు దెవండు
రామకకోట .... పవుద్వంబున సుడివేళ .... నెవడు
అన్నింటి ... సృష్టి దృశ్యంబు గద్వాల సభసునేత్రానజూపె
ఎలమినెపటిల్లి .... నెవడు .... నూరుపులసగ్ని విడిగ గందెనొల్లినవాబు
.... లేదప్పు .... తండె సంకొటుకూరి సిద్ధయోగిం ....

గొంతకాలము కర్నూలు పురమునకు సరస వాయువ్యముననున్న కల్లూరి గ్రామములో సమాధిస్థులైనట్లు ప్రసిద్ధి గలదు. వీరి శిష్య ప్రశిష్య పరంపర యిప్పటి కున్నది. ప్రస్తుతము .... ఊడుల కాలమైనది. అవసానమునకు వీరివయః పరిమాణ వర్షంబు లేబదియైదు మాత్రముండినది.

విశేషాంశములు:

సమగ్రము. కాగితపుప్రతి. వ్రాత చక్కనిది. అలతిగా వ్రాతదోషములు కలవు. అలతిగా క్రిమిదష్ట మైనది. ఇందు రెండు భాగములు కలవు. (1) సిద్ధయోగి

మహిమ (2) శంకరయ్యగారి చరిత్ర. 1 నుండి 28 వరకు సిద్ధయోగి మహిమ, 29 నుండి 38 వరకు శంకరయ్యగారి చరిత్ర గలదు.

ఈ పుస్తకముపై నూనెయో లేక మరేదో ద్రవము పడి అక్షరములు సరిగా కనిపించుట లేదు. పెక్కు పత్రములు ఇట్టి స్థితిలోనే గలవు. చదువుట కష్టము.

# సీతా కల్యాణము

## ముడుంబా లక్ష్మణకవి

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 482 | కాల్ నెం | : టి 8 - 118 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము. | పత్రములు | : 10 |
| పత్ర పరిమాణము | : 48 X 4 సెం.మీ. | పత్ర పంక్తులు | : 6 నుండి 7 |

ప్రారంభము

శ్రీకర వేదాద్రి హరికి సేవలొనరించి పద్మ కంజలించి సేనాపతికి మ్రొక్కిడి
శ్రీ సీతారాముల భజించి ముదమున వాల్మీకి హనుమంతులకు వందనములిడి
నాదు పూర్వ గురువులకు నతులొనర్చుచు సీతా కల్యాణంబు నేను జేయబూనితి
సజ్జనులారా మీరందరు సంతసంబున సీత పెండ్లి విను డిప్పుడు చెవులు నిండుగ
భూమియందు మిథిల యనెడు పురముగల్గెను ఆకసము నంటియుండు నచటి కోటలు
చుక్కల నంటుచు నుండె నొగసు మేడలు సౌధములు జిద్దుసేయు చందమామతో
బ్రహ్మ బోలియుండు రుచటి బాపనయ్యలు .... .... ....

అట్టి మిథిలా పట్టణంబునే .... జనకుడు మేదినీశు లందరిలో మేటి యాతదు
ఒక్క యజ్ఞముంజేయ తానూ .... జేసెను యజ్ఞభూమి దున్నుచుండ నట్టి చాలున
ఘనమైన యొక్కపెట్టె గానుపించెను తెగువతోడ నా పెట్టియ .... చూడగా
బాగు మీరగా నందొక్క బాల గన్పడె యింతినిం జేసుకొనిపోయి యింట బెంపుచు
సీత యని పేరుపెట్టె చిరుత పాపకు నిదియ చందమామ బోలివెలది బెరుగుచు
చిలుకవలె పలుకనేర్చె చిన్ని బాలిక .... .... ....

ము గిం పు :

రాముడటు గూల్ప పరశురాము డిట్లనె విల్లు నెక్కుబెట్టితీవు వీరశేఖర
అచ్యుతుండ వీవు శ్రీనారాయణుండవు మానవమాత్రుడవుగావు మాధవుండవు
నీరజనాభుడ వీవని నిన్ను నెరిగితి అని నుతింపుచు భార్గవు డరిగె నద్రికి
సరసతసురలు విరుల జల్లు గురిసిరి దిక్కులు చీకటులు బాసి తేజరిల్లెను
దిగులు మానిరెల్లవారు తెలివినొందిరి దశరథుండు జంకుబాసి ధైర్యమొందెను
వెంటనే సేనలతోడ వెడలి రచ్చట సకల వాద్యములు మ్రోయ సంభ్రమంబుతో
దశరథుండు జేరె నయోధ్యాపురంబును యట్లు ప్రవేశించి రందరింపు జూపుచు
దశరథుండు బ్రాహ్మణులకు ధనము గోవులు మణులు వస్త్రములు బహుమానమిచ్చెను
తనయులను కోడండ్రను తగిన మేడల వసింపజేసె రాజు నేర్పుతోడుత
దశరథు నాజ్ఞను మీరి తనయులందరు నత్తలకు ప్రేమగలుగ నతివలందరు
కొడుకుల కోడండ్ర నెంతో కోర్కె జూచుచు భూపతి సంతోషంబున బొదలుచుండెను
శ్రీదేవితోడ విష్ణు జెలగి నట్టుల సీతతో రాముడు ప్రకాశించె మిక్కిలి
నయముగన్ సీత కల్యాణంబు జదివిన వారికి నొసంగు సీత వలయు శుభములు
విన్నవారల కిచ్చును వేడ్క ధనములు వ్రాసిన వారలకు సంపదలు మిక్కిలి
రాముడు సీతమను గూడి రహి నొసంగును ఈ సీతాకల్యాణంబు నింపుగుల్కగ
సరసత శ్రీ ముకుందలక్ష్మణ కవీంద్రుడు రచించె నాచంద్ర సూర్యముగనుండు
మంగళము మంగళము మంగళంబగు మరియు సీతారాములకు మంగళంబులు.

... ... ...

వి శే షాం శ ము లు:

ఈ సీతారామకల్యాణమను గేయకావ్యము శ్రీముకుంద లక్ష్మణ కవి ప్రణీతము. కవి ఈ కావ్యమును పాడుకొనుటకు వీలుగా తేలిక భాషలో రచించెను. ఇష్ట దేవతాప్రార్థనము. గురు, కవి స్తుతిని గావించి తన రచనను కవి సాగించెను.

ఈ ప్రతియందు సీతాకల్యాణము పూర్తిగా నున్నది. లిపి స్పష్టముకాదు. ప్రతివిలేఖన దోషములు స్వల్పముగ గలవు. ఈ ప్రతి కొంత క్రిమిదష్టమైనది. కొన్ని పత్రములు నలుపు దిరుగు చున్నవి. కవి నామాదులు చివర గలవు. కాని కృతిపతి వివరములు లేవు.

# సీతావిజయము

## శతకంఠరామాయణము

## లింగనకవి

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 440 | కాల్ నెం | : బి 3 - 355 |
| ప్రతి | : తాళపత్రము; సమగ్రము. | పత్రములు | : 89 |
| ప్రతి పరిమాణము | : 45 × 4 సెం మీ. | పత్ర పంక్తులు | : 6 |

ప్రారంభము :

ఉ. భాసురలీల శంభుడు కృపారస మొప్పతిలంగ చారు కై
లాసమునందు పార్వతికి రామకథల్ వివరింప నందు చే
వాసి .... .... నిజ వల్లభుపై దనచూడ్కి నిల్పి యిం
దాస జనావనాత్మక సదాశివ యింకొక్కటాన తియ్యవే.

మ. శతకంఠుండను ఘోరదైత్యుడు రఘుస్వామిన్ రణంబందు నే
గతియై దల్లడిలంగ జేసె నది తత్కాంతా లలామంబు న
ల్కతో వీక్షించి పెనంగె నెట్లు మరి తత్కాండ ప్రచండక్రియన్
మృతియై యేవిధిగూలె నాత దది పేర్మిం దెల్పుమా వేడెదన్.

గీ. ఎవ్వ డా రాఘవేంద్రుని నిచ్చదలచు నెవ్వ డా సీత మహిమంబు లెసగ గూరు
నాయురారోగ్యములు వాని కతిశయిల్లు తాండవం బాడు లక్ష్మి యాతని గృహమున.

వ. అనిన విని సర్వజ్ఞుండగు మహాదేవుండు సమ్మతించి పులస్త్య ప్రకారంబును, తత్పుత్రులు విశ్రవసాశ్రముల విధంబును, రావణ కుంభకర్ణ విభీషణాది జన్మంబులును, అన్నకొడుకుల జూచి యశ్రముండు వగచుటయు. తపంబు సేయుటయు, తత్ప్రభావంబున నూరు శిరంబు లిన్నూరు గరంబులుగల మహాదానవుం గనుటయు, నతండు రాముని చే దెగిన రావణాద్యఖిల దనుజ ప్రళయంబు వినుటయు, నప్పుగ నీగ గోరుటయు, తపంబు

సేయుటయు, నజుండు బోధసూపుటయు, నతనివలన దుర్లభంబులైన వరంబులు గొనుటయు, మునుల బాధించుటయు, నమ్మునులు రామచంద్రు పాలికిం జనుటయు, శరణంబు జొచ్చుటయు, వారికి నభయహస్తంబు లిచ్చుటయు. శతకంఠుని జంప ప్రతిజ్ఞ సేయుటయు, మునుల బొమ్మనుటయు, వెనక నమ్మహాదనుజుని విక్రమంబువిని బల సామగ్రి చాలదని వగచుటయు, లక్ష్మణాదులు తమతమ పరాక్రమంబులు చెప్పుటయు. విభీషణు రాబనుచుటయు, నతనివలన కొన్ని వివరంబు లెరుంగుటయు. హనుమంతుని దలంచుటయు, నతనికి తద్వృత్తాంతము సెప్పుటయు, నక్కపికులోత్తముడుం తన మహారూపంబు సూపుటయు, సకల మనుజ దనుజ వనచర బలంబుల రప్పించుటయు, తన్నుగొని చనుమని సీత వేడుటయు, రాఘవుండనుమతించుటయు, దండువెడలుటయు, లగ్గబట్టుటయు, హనుమద్రాయబారంబును. చిత్రగంధి నీతియు, ద్వంద్వయుద్ధ ప్రకారంబును, సకల బలప్రళయంబును, రాముండును శతముఖుండునుం దలపడి ఘోరయుద్ధంబు సలుపుటయు, నందుకు రాఘవుండు కళవళించుటయు, సీత విల్లందుటయు, దనుజబల సంహారంబును, శతకంధరు పరాభవంబును, మరునా డరుదెంచుటయు, నారదాగమనంబును, హితోపదేశంబును, బ్రహ్మాస్త్ర ప్రయోగంబును, శతముఖు మరణంబును, చిత్రగంధి విలాపంబును, నీలకేతు పట్టాభిషేకంబును, హనుమంతుడు మరల జలధులు దాటించుటయు, పురంబు సేరుటయును. రాజ్యంబు బాలించుటయు, మొదలుగా నంతయు దలపోసి మందస్మిత ముఖారవిందుండై యిందుశేఖరుండు పార్వతి కిట్లనియె.

ఉ. రావణు దురు సంగర విద్రావణు దాభీల బాహుదండ జితోగ్రై
రావణుడు సేయు నురు దుర్వ్యాప పరాభవము లాత్మ భావించి సురల్.

ముగింపు :

చ. పిదప మరుత్సుతున్ సమరభీషణ నీతిగుణౌఘ భూషణున్
సదమల భూషణున్ బిలిచి సారెకు కౌగిట చేర్చి యోయి దు
ష్కదన ధురీణ శత్రు మదఖండన నీమహిమంబు చే జుమీ
యదవద బాసి దైత్యుని శరావళిచే నడగించి మించుటల్.

ఉ. నీమదిలోని కోరికలు నిక్క మెరుంగుదు ఆర్తి భంగులన్
నేమముగా నొనర్తు నది నేనిక నమ్మమటంచు సీతయున్
రాముడు చెప్పి రంబర పరంపరలున్ మణి భూషణంబులున్,
వేమరు వాయుజుండును వివేకము మీరగ మీరగ మ్రొక్కి గ్రక్కునన్.

చ. మునుప వరేణ్యుచేత పలుమారును దీవనలంది గంధ మా
దనమున కేగి రాముడును, తమ్ములనుం దగబంధు మిత్రులన్
ఘనముగ నుత్సహించె నతి గౌరవమొప్పగ రాజ్యభార మొ
య్యన వెస దీర్చుచుండె కరుణాయత నార్ద్రమనస్కుడై తగన్.

ఉ. ఎవ్వరు నీ కథం జదివి రెవ్వరు వ్రాసిరి ధర్మబుద్ధిమై
నెవ్వరు వింటరట్టి సువివేకులకున్ రఘునాథుడిచ్చు నా
మవ్వపు భోగభాగ్యములు మానితసౌఖ్యము లిష్టసంపదల్
నివ్వటిలుం బ్రియంబులును నీరజ సంభవు సన్నిభాయువున్.

వ. అని యివ్విధంబున శంకరుం డెరుంగించిన శాంకరీదేవి మహాద్భుతంబునం బొంది మహాత్మా! యిట్టి చమత్కార కథాకథనం బెన్నడును వినియెరుంగము. నీచే శ్రవణానందంబుగా వినగలిగి నే కృతార్థురాలనైతినని యానందింపుచుండె. నంత.

* *

ఉ. శ్రీరమణీయ వైభవ విశేష గుణాకర దీనలోకమం
దార గభీరధీర సముదార సుకీర్తి విహార శత్రు సం
హార యఘ ప్రహార సదయాను శరీర, శుభాకర ప్రభా
కార లసద్విచార జయకారణ పోచమరెడ్డి భూవరా!

క. కదనామర వర తనయా సదమలచారిత్ర రాజసన్నుతగాత్రా,
మదన నిభరూప సంతత మదశాత్రవ హరణ పోచమ క్ష్మారమణా!

పంచచామరము:

భవత్ప్రభూత కల్మషాబ్ధి భంజన ప్రభంజనా
నవీన కీర్తిహార మర్త్యనాయకా శుభాయకా,
యవక్ర విక్రమ క్రమా బుధావనా త్యుపక్రమా
అవిప్రకాశ పోచమ స్థిరాకరా నృపాకరా !

తోటకము.

జయభూసుర సన్నుత సత్కరుణా జయ శాత్రవ సంచయ సంహరణా
జయబంధు మనోంబుజ షట్చరణా జయ పోచమ భూజన సంభరణా !

మాలిని.

ప్రవిమల గుణహారా బంధురా ఘోషదూరా
వివిధ శుభవిచారా, విశ్రుతాచార ధీరా
కవిజలరుహ సూరా, గర్వ దుర్వార శూరా
భువన హిత శరీరా, పోచమ శ్రీవిహారా !

గద్యః

ఇది శ్రీమదేయికూర్తినివాస, లక్ష్మీనృసింహ కరుణా కటాక్ష సంప్రాప్త మహాకవిత్వ విద్యాపారీణ సమహితాంధ్ర గీర్వాణ భాషాప్రవీణ సంగీత లక్షణ ధురీణ సకల విద్వన్మిత్రాత్రేయ గోత్ర పవిత్ర ధర్మనార్యపుత్ర నిఖిల మహీసురాశీర్వాద ప్రవర్ధమాన భాగధేయ వినయవిధేయ లింగన సుకవి నామధేయ ప్రణీతంబైన శ్రీ సీతావిజయంబను మహా ప్రబంధంబునందు సర్వంబు నేకాశ్వాసము.

విశేషాంశములు:

సీతావిజయము అను ఈ గ్రంథమునకు శతకంఠ రామాయణము అను మరొక పేరు కూడ గలదు. దీనికర్త లింగనకవి యని ఆశ్వాసాంత గద్యవలన దెలియుచున్నది. ఈ ప్రతియందు ఒకే ఆశ్వాసములో గ్రంథము పూర్తిచేసినట్లు గలదు. గ్రంథప్రారంభమున, ఇష్టదేవతా ప్రార్థనముగాని, కృతికర్త వంశ వర్ణనలుగాని లేవు. అట్లే కృతి

కర్త గూర్చి వివరములుకూడ నిందు లేవు. కేవలము ఆశ్వాసాంత గద్యమువలననే కృతికర్త నామము తెలియుచున్నది. అట్లే కృతిపతి విషయముకూడ ఆశ్వాసాంత పద్యములవలననే తెలియుచున్నది.

ఈ గ్రంథముయొక్క కృతిపతి పోచయ భూపతి. కవియగు లింగనమంత్రి లక్ష్మీ నృసింహస్వామి భక్తుడు. సంస్కృతాంధ్ర భాషలయందు పండితుడు. సంగీత లక్షణ ములు బాగుగా తెలిసినవాడు.

ఈ కవి వ్యాకరణ విరుద్ధములగు శబ్దములను ప్రయోగించెను. (కౌన్నబ్ధములు, వెక్క సైసొక్కు మొ)

# సీతావిలాసము
## శ్రీనివాసామాత్యుడు

| | | | |
|---|---|---|---|
| ఆక్సేషన్ నెం | : 2296 | కాల్ నెం | : టి 3-1 10 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము. | పత్రములు | : 35 |
| ప్రతి పరిమాణము | : 43 × 3.5 సెం. మీ. | పత్ర పంక్తులు | : 6 |

ప్రారంభము :

.... పరలోకక్రియ లొనర్పంబంచి. యగ్రజున కీవృత్తాంతంబు విన్నవింపం బనిచి, తదనుమతుండై పురంబు ప్రవేశిం ....

గీ. వేడ్క సభజేరి పౌరులు వినుతిసేయ .... .... ....
.... నమునందు రాజసమున నుండి పాలింపు చుండె నీయుర్వి జనులు

వ. అని సునీతుం జెరింగించిన సమాత్యవరులా కుశధ్వ .... పరాక్రమంబులు కొని యాడుచు .... .... బున కచ్చెరు వొందుచు, నగరుచేరి ... జి హారి వలన తమ రాక

యెఱింగించి పుచ్చి తదనుమతి ప్రవేశించి రత్నసింహాసనా సీనుండై యుఖిం సా .....
.... .... కొలువున్న యా రాజవరేణ్యునకు సాష్టాంగముగా ప్రణమిల్లిన, వారల
సత్కాదరంబున గాంచి, తన సమీపంబు ... .... ... .... ... కుశలియె,
వదినయు నఖిల బంధు సమితి, మంత్రి పురోహితుల్ సకల జనులు సుఖులె, యనుచు
... శుభము .... .... .... .... .... ల్మొగిచి వీర వరేణ్య పరాకు
మిమ్ములన్, జనకవిభుండు రమ్మనుచు సమ్మదమొప్పగ దెల్పి మిమ్ములన్ .... ...
.... .... ....

మ. మది నుప్పొంగి సునీతు డాదియగు సన్మంత్రు ల్తనుంగొల్వ ...
మ్మద మారన్ జని వారుదా .... .... ....
.... .... .... ....
.... మార్కొండనగా వెలుంగి వెడలెన్ నుత్సాహసంపన్నుడై.

పంచచామరము.

.... .... ....
తురంగముల్ .... .... .... ....
.... .... .... .... కూడు చామరంబులన్
కరంబులెత్తి జంట ప్రౌఢ కాంత లంత వీవగాన్

0 0 0

ము గిం పు :

క. ఇటు వచ్చిన సురసంయమి చటుకున గని లేచి మ్రొక్కి తాత్పర్యమునం
దట కాంచనమయ పీఠము పటుభక్తిని నునిచె నయము భయము గదు ...

గీ. అర్ఘ్య పాద్యంబు లొనరించి యావునొకట యొసగి మధుపర్క మిచ్చియు నొసటిమీద
చేతులు మొగిడ్చి వినుతించి చిత్తమలర నిలిచి .... ... మేని ఖలికె నిట్లు.

క. భూమీశ నీకు కుశలమె నీ మంత్రి జనమ్ము లెల్ల .... ....
సేమంబు లపేక్షింతురె తామస మణగింతె రాజ్యతంత్రము లందున్.

గీ. సీవు .... హితుండు నీకు మేలైనట్టి విధులు దెల్పు చున్నె .... బొగడ
భటుల రథికవీరుల పాలింతె సామంత హితుల బంధుజనుల హిత ....

ఉ. న్యాయము చేత భూజనుల నందరి బ్రోతె ధనంబొకింత య
న్యాయము మాని చేకొనుదె యాత్మ సమానుల బ్రీతిబ్రోతె ....
.... .... ... రక్షసాయి నౌన ర్తె మహీసురాలికిన్
న్యాయధనంబు లిత్తె నిను నంద .... ణయుచుండగన్.

క. నీయింట నయోనిజనై తా యిందిర బుట్టె నట్టె తరుణీ మ ....
.... .... .... ద్రోయుదురె ని .... ల జనుల దురితము తెల్లన్.

క. అని బలుకుచు .... .... గనుగొని కేల్మోడ్చి నీదు కారుణ్యమునన్
ననుగొల్చు ప్రజలు నేనును యనఘాత్మక .... తనూజ యవనీసురులన్.

వ. మదీయ గురుపుత్రుం డగు శతానందుం డాదిగా నెల్లవారలు సేమంబున నున్నవారమని మరియు నిట్లనియె. .... భవదీయాగమనంబున మత్కులంబు పవిత్రంబయ్యె. నేను ధన్యుండనైతి. తీర్థంబులకు తీర్థప్రభావంబొసంగు నట్టి మీ దర్శన బబ్బుట మదీయ పురాకృత పుణ్యఫల విశేషంబుగాదె. యే మహాత్ముని .... గానంబుచే సంతుష్టుండై యాది మధ్యాంతరహితుండును, పురాణ పురుషుండును ప్రకృతి విరహితుండును, ఆత్రజ .... ణ్యుండును, భగవంతుడు నగు లక్ష్మీరమణుండు పిలునంబడిన వాని తెరంగున, .... హితుండగు, నట్టి మిమ్ము దర్శింపం గంటి కృతార్థం జెందితి. నెవ్వాని యుపదేశంబునంజేసి, స్వాయంభువ ప్రియవ్రతోత్తానపాద ధ్రువ ప్రహ్లాద చిత్రకేతు భరత వాల్మీక వ్యాస శుక ప్రముఖులు పరమ భాగవతోత్తములై చెలువొందిరి అట్టి మీకు నమస్కరించెదనని కొనియాడుచున్న రాజేంద్రునకు మునీంద్రుం డిట్లనియె.

క. భూనాథ నీదు భాగ్యము నేమని .... వినుతిచేతు నృపమాత్రు ....
.... సూదను సుందరి నీనంద (న) .... యయ్యె సురలు నీకున్ సరియే.

గీ. నమ్మహాదేవి పిలిపింపు మనుచు బలుక నట్ల చేయింప నత్తన్వి యరుగుదెంచి
సుర మునీశ్వరునకు మ్రొక్కి సోదరీత్రయంబుతో .... .... ....

0 0 0 0 0

విశేషాంశములు :

ఈ ప్రతి యందు గ్రంథాద్యంతములు లేవు. కృతికర్త, కృతిభర్తల వివరాదులు తెలియుట లేదు. ఇందు ప్రథమాశ్వాసము సగమునుండి ద్వితీయాశ్వాసము కొంత వరకు కలదు. జనకునితో కుశధ్వజుడు దేవ రహస్యములు చెప్పుట, పుత్రకామేష్టి ప్రయత్నాదులు, రావణజనన, ప్రతాపాదులు ఇందలి ప్రథమాశ్వాసమున గలవు. ఇది అసమగ్ర ప్రతి. ద్వితీయాశ్వాసమున సీతాజననాదులు కలవు.

ఈ ప్రతియందున్న పత్రములన్నియు చాల భాగము క్రిమిదష్టములై శిథిలములై పార్శ్వమున కొంత భాగము నశించినవి. లిపి స్పష్టము. అక్షర దోషములు అధికము

# సురభాండేశ్వరోపాఖ్యానము

## ఘట్టు ప్రభువు

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 6121 | కాల్ నెం | : టి 3-619 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము. | పత్రములు | : 18 |
| ప్రతి పరిమాణము | : 43×3.5 సెం. మీ. | పత్రపంక్తులు | : 7 |

ప్రారంభము :

శ్రీమత్కాశీపట్టణ ధాముడు విశ్వేశ్వరుండు ధరణీధరజా
భామాకుచ కుంభ యుగ స్థామల వక్షుండు మము కృతార్థుల జేయున్.

చ. హరిణ పినాక హస్తుని పురాసుర ఘోర మదాపహారునిన్
పరమ పవిత్రునిన్ కుముద బాంధవ పావక మిత్రనేత్రునిన్
సుర గణవంద్యునిన్ శివుని శుభ్రశరీరుని సర్వమంగళా
వరదుని కాశికాపుర నివాసుని విశ్వపతిన్ భజించెదన్.

క. ఏణాంక ధరుని కుధర ద్రోణుని జననాది కర్మ దూరుని నుతగీ
ర్వాణుని హిమాద్రితనయా ప్రాణేశు మహేశు నేను ప్రస్తుతి జేతున్.
.... .... .... .... ....

క. ఆశాంబరునకు నిర్మల కాశ సుధాచంద్ర చంద్ర కల్పక హిమసం
కాశ శరీరునకును శ్రీ కాశీ విశ్వేశ్వరునకు కరకంఠునకున్.

వ. సౌవర్ణంబుగా నా మొనర్పంబూనిన సురాభాండేశ్వరోపాఖ్యానంబునకు కథా క్రమం బెట్టి దనిన.

క. శ్రీనైమిశ కాననమున శౌనక శుక కశ్యపాది సంయము లతి వి
జ్ఞాన నిధి సూతు గను గొని పూనికతో బలికి రధిక పూతాత్మకులై.

ఆ.వె. కాశి మరణమైన కష్ట మానవుడును శివుడు నగునటంచు జెప్ప వింటు
మందు ద్రెల్లియెవ్వరైన లింగంబులై కానబడిన వారు గలరె జగతి.
.... .... .... .... ....

ముగింపు :

తే.గీ. పంకజాసన యీ సురా భాండ నాథు పూజ జేసిన యట్టి సత్పురుషులకును
కాశికా తీర్థ దివ్య లింగముల నెల్ల భక్తి నర్చించి నట్టి సత్ఫలము గలుగు.

వ. అని యిట్లు సురాభాండేశ్వర లింగంబు మహిమ ప్రశంసింపుచు దేవ దేవుండగు పరమేశ్వరుండు కరుణా కటాక్ష వీక్షణంబున దత్సతీ పతుల దివ్య విమానారూఢులం జేసికొని కైలాసంబునకు గొని చనియెనని సూతుండు శౌనకాది మహామునులకు కాశీ పట్టణ ప్రభావంబు దెలియు కొరకు సురాభాండేశ్వర సత్కథా శ్రవణం బొనర్చి మునీంద్రులారా యెవ్వరేనియు మీ కథా శ్రవణంబున కృతార్థులై సకల సుఖంబులం బొందుదురని చెప్పిన విని వారలు పరమ హర్షంబునుం బొంది సుఖంబుండి రంత.
.. .... .... ....

గద్య :

ఇది శ్రీమత్పుష్పమరాంబికా వరప్రసాదలబ్ధ కవితా ధురంధర సరస కవి మిత్ర యెల్లనా మాత్యపుత్ర ఘట్టు ప్రభు నామధేయ ప్రణీతంబైన సురాఖాండేశ్వరోపాఖ్యానంబు నందు సర్వంబును నేకాశ్వాసము.

విశేషాంశములు:

ఈ ప్రతి మంచి స్థితి యందున్నను అటనట క్రిమి దష్టమైనది. వ్రాత చక్కనిది. తప్పు లంతగా లేవు. ఈ కావ్యమును కవి కాశీ విశ్వేశ్వరున కంకితమిచ్చెను. ప్రతిలో వ్రాయసగాని పేరు గాని, ప్రతి వ్రాయబడిన సంవత్సరము గాని వ్రాయబడలేదు.

## సురాఖాండేశ్వరోపాఖ్యానము

## ఘట్టు ప్రభువు

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 5644 | కాల్ నెం | : టి 3-190 |
| ప్రతి | : తాళపత్రము; సమగ్రము. | పత్రములు | : 25 |
| ప్రతిపరిమాణము | : 24 × 4 సెం. మీ. | పత్రపంక్తులు | : 7 |

విశేషాంశములు :

ఈ ప్రతి యందు ఆద్యంతములతో పూర్తి గ్రంథమున్నను, ఒకటి రెండు పత్రములు మాత్రము కొద్దిగా నశించినవి. ప్రతి క్రిమి దష్టమై యుండుటచే కొన్ని యక్షరములు స్పష్టతను కోల్పోయినవి. ఇందలి లిపి స్పష్టము. ప్రతి విలేఖనమున స్వల్ప దోషములు గలవు. వ్రాయసకాని పేరు గాని, ప్రతి వ్రాయబడిన కాలము గాని ఈ ప్రతి యందు పేర్కొనబడలేదు.

సు రా ఖాం దే శ్వ రో పా ఖ్యా న ము

ఘట్టు ప్రభువు

| | | | |
|---|---|---|---|
| ఆక్సేషన్ నెం | : 4649. | కాల్ నెం. | : టి 3-185 |
| ప్రతి | : తాళపత్రము; సమగ్రము | పత్రములు | : 21 |
| ప్రతి పరిమాణము | : 34×4 సెం మీ. | పత్రపంక్తులు | : 7 నుండి 8 |

**వి శే షాం శ ము లు :**

ప్రతి యంతిగా క్రిమి దష్టమైనది. వ్రాత యొకమాదిరిగా నున్నది. అక్షర దోషము లధికము. ప్రతిలో వ్రాయసకాని పేరు గాని, ప్రతి వ్రాయబడిన సంవత్సరము గాని వ్రాయబడలేదు.

# సూక్ష్మ గజేంద్రమోక్షము

## గడ్డం నరసింహారెడ్డి

| | | | |
|---|---|---|---|
| ఆక్సేషన్ నెం | : 2308 | కాల్ నెం | : టి 3-199 |
| ప్రతి | : తాళపత్రము, సమగ్రము. | పత్రములు | : 2 |
| ప్రతి పరిమాణము | : 45×4 సెం.మీ. | పత్ర పంక్తులు | : 5 నుండి 6 |

**ప్రా రం భ ము :**

వనరంగ సంసార వారాశి లోపల పంచభూతిక మనే పర్వతంబు
మూడు శృంగంబులు వేడుకతోనుండు నందులో వర్ణంబు లన్ని గలరు.
నది పంచక్రోశంబు నంతయు వెడలుపు నందుదేవ ........ మతిశయిల్లు.
నాల్గ .... జములు నాట్యగాన విలాస యువతులుందురు తపసు లుందురందు

పక్షిగణములు మితిలేని వృక్షసమితి గృ ..... మృగరాశి జలకాష్ఠ గోచరంబు
తృణ సమూహంబు నై యెప్పు నదివ్యశైల మం .... హరింపుచున్నట్టి యగ్గజరాజు
కదలియొప్పె.

మ. ఒకనా డాశరి మాయగూడి గిరికిన్ వొచ్చెన్ విలాసార్థమై
నకలంకస్థిత క్రీడ సలుపుచు పిపాసాయత్త చిత్తంబునన్
వికలుండై భవకూపమున్ గని మహా వీరప్రతాపోన్నతిన్
సకలేభంబులు జూచి తానరిగె ....సప్రీత చేతస్కుడై.

* * *

ముగింపు :

ఉ. .... జ ఫాలాంతరి .... ష్మ రక్తభ్రముల విస్తీర్ణార్కబింబాధర
ధ్వజ మధ్యాంతర వహ్నిలోపల మహాదీప్త ప్రభారాశిలో
ద్విజ కాంతాఖిల రత్నపీఠమున శోభిల్లుచు సుఖాసీను డా
భుజగారిధ్వజు డా గజేంద్రుని నతుల్ పూరించు శబ్దంబులన్.

సీ. అలించి మేలెంచి కీలించి యోగంబు సాలించి లాలించి సంభ్రమించి
యిభరాజు కిభయంబు నీదలంచి కటాక్ష వీక్షణ చక్రంబు తత్క్షణంబు
పంపిన శతకోటి భాస్కరజ్యోతి .... భవకూపమున జొచ్చి ప్రబలమైన
తన్మాత్ర యుత దీపదారుణ మకరేంద్రు శిరముద్రుంచి హితంబు చేసినతని
గీ. కణగి విడు పింత సిద్ధుడై కాంక్ష యొదలి బయలు సాలించి స్థూలంబు బాసి లింగ
దేహమున జొచ్చి వైకుంఠగేహమునకు భక్తి నేగెను సంపూర్ణ భవ్యమూర్తి.

క. ....గజ మోక్షణంబును నిజముగ పఠియించునట్టి నియతాత్ములకున్
గజరాజ వరదు డిచ్చును గజ తురగ స్యందనంబు కైవల్యమునున్.

సూక్ష్మ గజరాజ మోక్షము సంపూర్ణము.

విశేషాంశములు :

ఈ సూక్ష్మ గజేంద్రమోక్షము చాల చిన్నకావ్యము. ఇది ఒకటిన్నర పత్ర పరిమితము రెండవ పత్రముయొక్క రెండవప్రక్క. శ్రీహరికీర్తనము గలదు. ఇదియు గడ్డం నర సింహారెడ్డి విరచితమే.

ఈప్రతి రెండే పత్రములు. కాని సమగ్రముగ నున్నది. ఈపత్రములు క్రిమిదష్టములై కొన్ని అక్షరములు నశించినవి. పత్రములు శిథిలావస్థలో నున్నవి. భాషాదోషములు స్వల్పముగ గలవు.

# సోమవార మాహాత్మ్యము

## శ్రీపతి పండితుడు

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 3882 | కాల్ నెం | : టి 3- 286 |
| ప్రతి | : కాగితము; సమగ్రము. | పత్రములు | : 37 |
| ప్రతి పరిమాణము | : 23 × 25 సెం.మీ | పత్ర పంక్తులు | : 24 |

ప్రారంభము :

శ్రీ సోమనాథుని శ్రీ సదా శివుని   శ్రీపరమాత్ముని శ్రీ మహేశ్వరుని
శ్రీశంభు శంకరుని శ్రీగురు హరుని   రామాభిరాముని రాజపూజితుని
హేమాద్రి చాపుని ఈశుని ఘనుని   భావజాంతకు సర్వ భక్తవత్సలుని
వేదాంత వేద్యుని వేదగోచరుని   ప్రణవస్వరూపుని ప్రణవనాయకుని
కాశీ పురంబున ఘనమైన మునులు   మాఘ స్నానము శాయ మరివచ్చియున్న
కపిల కణ్వకశ్యప గౌతమ ధీశ   మార్కండేయ మాండవ్య మైత్రయవ్యాస
కర్ణామృతంబుగా కథయు చెప్పెదను   అవ్వేళ నందీశు డానందముగను
శ్రీశైలమున నుండి శ్రీమత నపుడు   హేమ విమానంబు లెక్కింత త్ప్రమథ
వేణు వాద్యంబులు వెస మ్రోయగాను

ము గిం పు :

కైలాసమునకును కడు సంభ్రమమున తోడ్కొని పోయె నా దివ్యతేజుండు
ప్రమథులలోవారు ప్రమథులైయపుడు శివుని సన్నిధి నెపుడు చెలగుచునుండ్రి
అని నంది నాథుండు హరుభక్తుడైన వశిష్ఠునకు చెప్పె వరమునులు వినగ
వరసోమవారంబు వ్రతమున్నవాడు ఘన సోమవారంబు కథవిన్నవారు
ఆయురారోగ్యంబు లఖిలంబుగల్గి పుత్ర పౌత్రులు గలిగి మరి భువిని వర్ధిల్లు
ఐశ్వర్యభోగంబు లనుభవింపుదురు వాహనధనధాన్య వస్త్రాభరణములును
గల్గియు మరి మురిపెంబు గలిగి యలవి తోడుత నుందు రెల్లకాలంబు
వరుసతో ఘన సోమ మహాత్మ్య.... వ్రాసిన చదివిన చూచినవిన్న
వారికి చతుకోర్తి వరములుగలవు దరణిలో నాచంద్రతారకంబుగను

వి శే షాం శ ము లు :

ప్ర తి వి లే ఖ న ము :

ఐస్వలింగయ్య కొమారుడు నీలకంఠము వ్రాసినాడు.

ఇది ద్విపదకావ్యము. ఈ ప్రతి యందు కావ్యకర్త వివరాదు లేవియు లేవు. ప్రతి బాగుగానున్నది. కాని యిందలి లిపి స్పష్టముగా లేదు. ప్రతివిలేఖనమున చాల దోషము లున్నవి. ఇందు సోమవార వ్రతము విపులముగా వివరింపబడినది. ఈ ప్రతి యందు కావ్యము కొంత కొంత చ్యుతమైనను మొత్తముమీద పూర్తికావ్యమున్నది.

## సో మ వా ర మా హా త్మ్య ము

## శ్రీపతి పండితుడు

| | | | |
|---|---|---|---|
| ఆక్సేషన్ నెం | : 8879 | కాల్ నెం | : టి 8 - 288 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము. | పత్రములు | : 71 |
| ప్రతి పరిమాణము | : 28×8.8 సెం.మీ | పత్ర పంక్తులు | : 81 |

ప్రారంభము

శ్రీకరు నంబికా తనయు సింధుర వక్త్రవిశేషదంతునిన్
ప్రాకట హేమవర్ణు శశిభాస్కరులోచన మోదకప్రియున్
శోకదరిద్రదుఃఖ పటుశోషణు విఘ్నవినాశకారుని౯
నాకనివాస వంద్యు గణనాయకు గొల్చెద నిష్టసిద్ధికిన్.

శ్రీ సోమనాథుని శ్రీ సదా శివుని శ్రీమహాదేవుని శ్రీశుభకరుని
శ్రీపరమేశ్వరు శ్రీధరాప్రియుని శ్రీ విశ్వనాయకు శ్రీశైలవిభుని
కాశీపురంబుకు ఘనమైన మునులు మాఘస్నానము జాయ మరి వచ్చియున్న
కపిల ఆగస్త్యాగస్త గౌతమ దధీచి మార్కండ మాండవ్యమైత్రియవ్యాస
అని మునులు ప్రీతితో నడిగిన జూచి నావశిష్ఠుడు లేచి వారికి మ్రొక్కి
జెప్పదొణగెను పూర్వశివకథ లపుడు కర్ణామృతంబైన కరకంఠు మహిమ
ఆవేళ నందీశు డానందమునను శ్రీశైలమున నుండి శీఘ్రమైనపుడు
పసిడి విమానము లెక్కి ప్రమథులు దాను వేణువాద్యంబులు వెస మ్రోయగాను

ముగింపు :

అని శివుడు గణములకు ఆనతిచ్చినను శునకమును బిల్పించి సోమశేఖరుడు
కరుణతో మన్నించి ఘనమైనయట్టి ప్రమథరూపము జేసి పట్టంబుగట్టి
మంగళాష్టకంబులు మహిమతో చదువ సంగీత గీతములు సరసములు బాడ
పంచమ వాద్యంబు పరగ ఘూర్ణిల్ల ప్రమథులు గొనియాడ బ్రహ్మ గీర్తింప
అది విష్ణుడు జూచి ఆశ్చర్యమంద అమరసుర ముని వరులు ఆట తలలూచి
వరసోమవారంబు వారు గీర్తింప అని యిట్లు నందీశ్వరుం డా వశిష్ఠునకు
ఘనసోమవారంబు కథలు జెప్పనియె సహస్రముఖుండును స్వజనులతోడ
పరమేశ్వరు గురుడు భర్గుండు హరుడు ఘనసోమవారంబు కథజెప్పవింటి.
విన్నట్లు జెప్పితిని విను వశిష్ఠుండ అని చెప్పవిని వశిష్ఠుం డానంద మంది
వరసోమవారంబు వ్రతము గైకొనియు యానందినాథునకు నా మునులు మ్రొక్కి
అరిగిరి తమ నిజాశ్రమంబునకు యానంది నాథుండు నరిగె శివపురికి.
హరభక్తవరులకు నానంద కరము సకల జనులకు నెల్ల సంతోషకరము
కర్ణామృతంబైన కథ రచియించితిని నా చంద్ర తారార్కమై యుండు నెలమి

విశేషాంశములు :

ఈ ప్రతియందు కావ్యము పూర్తిగా నున్నది. కాని మధ్యలో 39, 40 సంఖ్యలు గల కాగితములు మాత్రములేవు. ప్రతియందలి లిపి స్పష్టముగ నున్నను కొన్ని యక్షరములు తెలియుటలేదు. ప్రతి బాగుగానున్నది. ప్రతివిలేఖనమున దోషములున్నవి. 3382 నెంబరుగల ప్రతికిని ఈ ప్రతికిని పాఠాంతరములు చాలగలవు. ఈ ప్రతి ప్రారంభములోగల పద్యమాప్రతియందు లేదు.

## సోమవారమాహాత్మ్యము

| | | | |
|---|---|---|---|
| అక్సేషన్ నెం | : 5647 | కాల్ నెం | : టి 3 - 75 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము. | పత్రములు | : 108 |
| ప్రతి పరిమాణము | : 32.5×3.5 సెం.మీ | పత్ర పంక్తులు | : 6 |

విశేషాంశములు :

క్రిమిదష్టము. గ్రంథపాతము కలదు. గ్రంథము శిథిలావస్థలో నున్నది. కొన్ని కొన్ని పత్రములు వరుసక్రమ సూచీ భాగమున శిథిలమైయున్నవి.

# సౌగంధికాపహరణము

## రత్నాకరం గోపాలరాజు

| | | | |
|---|---|---|---|
| అక్సేషన్ నెం | : 815 | కాల్ నెం | : టి 3-195 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము. | పత్రములు | : 75 |
| ప్రతి పరిమాణము | : 42×3.5 సెం.మీ. | పత్రపంక్తులు | : 5 |

ప్రారంభము :

శ్రీరామచంద్రు డాశ్రిత వత్సలుండు తారక బ్రహ్మావతారు డచ్యుతుడు
సుమ శరాసను గన్న సుందరాంగుండు సముచితసూదన ముఖ్యా నానాగీత
రాజకాంత విలాస రాజిత పాద రాజీవు డంభోజ వంశజూడు
నీలాతసూన నీరద శక్ర నీలవర్ణుడు దయా నిర్మలాత్మకుడు
జానకీ చిత్తాంబుజాత మిత్రుండు భూనుత మాణిక్య భూషణాన్వితుడు
పరిపంథిదైతేయ బలభేదనుండు హరివర్ణితుడు శరణార్త రక్షకుడు
దశరథ ధారుణీతలనాథ గర్భ విశదాబ్ధి చంద్రుడు విశ్వంభరుండు
విలసిత సామ్రాజ్య విభవసంపదలు

0 0 0

వినుపింపు మనిన నవ్వేళ .... ........ వృత్తాంతమెల్ల
చెలువంబు రంజిల్ల చెప్పదొడంగె. అవధరింపుము సన్నుతా చార్యులార
యవలీల కథాక్రమంబంత తెలిపెదను కదనరంగములకు కంజాతనేత్రుండు
.... .... .... కలహ భోజనమౌని కైలాసగిరికి
నలువంద బంధురానందుడై పొగడి నన్నిదిక్కుల యందు ననవరతంబు
వెన్నెల నిండార వెస చల్లుదాని ఘోర కామ క్రోధ కుటిల మా ....
.... .... దోలుదాని చారు సౌభాగ్యముల్ సమకూర్చుదాని
తార్మాచలము గాంచి తగవినుతించి యమ్మహా గిరిగాంచి యందందనిండు
కమ్మని వాసనల్ గ్రమ్ము మందార .... .... హార
కనక సాలంబులు గడచి యుత్తుంగ సార చంద్రోపరి సారజాలంబు
ఆరూఢి మీర మహా భోగభాగ్య బంధుర కల్యాణ భవనరజములు

0 0 0

సరసిజాసన సూతి చనుదెంచుటయును కని వధూవరులు చక్కగ నెదురేగి
ఘనభక్తితో మ్రొక్కి వేడ్కలను .... .... లుగావించి వినయముతోచేసి
జననాథ సూనుడా సంయమికనియె సురమునిరాజ భాసురరవితేజ
పరమ దయా స్వాంత పటుసత్యవంత మునుపు నే వనమార్గమున వచ్చునపుడు
వ .... .... వరమిచ్చినాడ యిందీవరానన యిపుడటువంటి

ముగింపు :

యక్షాధి పతికి సహాయంబు బనుట వీక్షించి కురురాజ విభుడు మెచ్చుటయు
సురనది తనయుండు జోక్యేర్పరించి గరిమ ధర్మ తనూజు చెంత మెచ్చుటయు
హరి పాండవులకు సహాయంబు వచ్చుటయు ధరణీ విభుండు మోదంబు నందుటయు
హరి శబరుని మీద నసిచేయ జనుట కురుసైనికులు యక్షకోట్లు ఓడుటయు
భైరవునకు హిడింబానందనునకు పోరగలు జాటి పోరి భైరవుడు
సురవైరి గూల్చుట చూచి కోపించి ధర రథుడు భీమనందనుల ద్రుంచుటయు
హరిశంభు పుత్రుల నవని నొంచుటయు హరితనూజుల శంభు దట్లను చేయ
హరిహరులకు యుద్ధ మధికంబునగుట హరుడు మహాశూల మంకించుటయును
హరియు కోపించి రథాంగంబు బూనుటయు

నయ్యెడ నబ్జజుం డరుదెంచుటయును నయ్యెన నిరుపుర సమ్మతింపుటయు
కలహంబు మానుట కల నిలంబడిన బలములన్నెల్ల బ్రతికించుటయును
అరయంగ ధర్మజు యక్షనాథునకు గరిమ మీరంగ సఖ్యంబు చేయుటయు
హరిహరులును సహాయము వచ్చువారు సరగున నిజ నివాసంబుల కేగుటయు
భూరి సౌగంధిక పుణ్యప్రభావ చారిత్ర మిది కథా సంపూర్ణమయ్యె
వెలయ నీ పాండవ విజయకార్యంబు సలలిత హృదయులై సద్భక్తి గరిమ
నలరుచు బూజించి యానందములను చెలువప్ప గలిగియు చదివినవారి
సలలితంబుగ మాత చనువున బ్రోచి సదమలగతి కథాసావధానముగ
విన్నవారికి నెల్ల విభవ సంపదలు సన్నుత వస్తు భూచయములుగలిగి
నెలమూడు వానలు నెలకొనిగురియు ఫలము లిచ్చును పారిజాతంబువలెను
సురుచిర కల్యాణ శోభంబులును ధరణి జనములెల్ల దనరుచుండుదురు.

విశేషాంశములు :

ఈ సౌగంధికాపహరణమను కావ్యమునకు పాండవ విజయమను నామాంతరముగలదు. ఇది కత్తా కిరం గోపాలరాజు ప్రణీతము. ఇది రెండు ఆశ్వాసములుగ నున్నది. సౌగంధిక పుష్పములను సంపాదించుట, యక్షుని జయించుట యిందలి వస్తువు. ఇది ద్విపద కావ్యము.

ఈ ప్రతియందు 110 తాళపత్రములకు 75 పత్రములే గలవు. రెండు ఆశ్వాసముల లోను కొన్ని కొన్ని పత్రములు నష్టములైనవి. కొన్నిపత్రములు శిథిలములై తునకలే మిగిలి యున్నవి. ఇది అసమగ్ర ప్రతి.

ఇందు భాషాదోషములు చాలకలవు. గ్రంథాది యందలి పత్రములు శిథిలమగుటచే కవి నామముగాని కృతిపతి వివరములుగాని లభ్యమగుటలేదు. ప్రతి నలుపు దిరిగినది. శిథిలావస్థకు చేరుచున్నది. లిపి సుస్పష్టముకాదు. ఆశ్వాసాంతాదులు ఇందులేవు. గ్రంథాంతమున కవి పేరు గలదు.

# హంసవింశతి

## అయ్యలరాజు నారాయణామాత్యుడు

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | ; 4010. | కాల్ నెం | ; టి 3 - 269 |
| ప్రతి | ; తాళపత్రము; అసమగ్రము | పత్రములు | ; 93 |
| ప్రతిపరిమాణము | ; 35.5× 3 సెం.మీ. | పత్రపంక్తులు | ; 7 నుండి 8 |

ప్రారంభము :

క. భీషణ ఖరదూషణ పరి  శోషణ సురపోషణోగ్రశోభనమతికిన్
శేషాహిప భాషాధిప  యోషాహి పరాస్తకీర్తి యూధోన్నతికిన్.

క. సింధు సుపుత్రీ కుచధర  కంధర సమ పిత్రునకును కమలజ సురరా
ట్సింధురముఖ సింధురముఖ  బంధురజాతా ప్తవాహపదనివహునకున్.

క. వక్ర త్రయ చక్రకుచా వక్రతనూరూపవైభవ....జారునకున్
శక్రాహిత చక్రాహిత చక్రమహోప....సంహారునకున్.

క. భామాయత కామాయుత కోమల సౌందర్యదేహ గురుధామునకున్
భీమరిపుస్తోమున వపు స్తేమ తమస్సోమునకును శ్రీరామునకున్.

వ. అంకితంబుగా రచియింపబూనిన హంస వింశతియను మహాప్రబంధమునకు కథాక్రమం బెట్టిదనిన.

సీ. నానాగమస్ఫూర్తి బూని హంసాశ్వస న్మహిమంబునగు ధరామరులు హరులు
తేజోమయంబుల దిక్కుంభిపీఠుల నురుమాడనోపు భూవరులు కరులు
మణి చక్రములు భూరిగణకోటికేతువు లలరగా నొప్పు వైశ్యులు రథములు
వరజన జీవనోద్ధరణ దరఖ్యాతి విలసిల్లు శూద్రులు వీరభటులు

తే.గీ. విమల సుమన ప్రమోదరాగములు దనరి పల్లవప్రాప్తిచే మించు ప్రౌఢ వార
వనిత లారామమున గల్గి వినుతి కెక్క భూమిరత్నంబు నైషధ పురవరంబు.

క. .... .... మహాబలిసంఖ్యా జ్వల విక్రమ నిహత సాలోరుయశో
గలరాజ భరిత మప్పుర తిలకము సమమనగ వచ్చు తేజోవతికిన్.

క. .... .... .... .... .... నూతన రుచికిన్
దాపురమై యభ్రంకష గోపురమై పొగడ నెగడు కుంభిని లోనన్.

వ. మరియు, నప్పట్టణంబు దివ్య సౌరోచ్చయంబుగా .... .... .... పరిఘావేష్టితంబుగావున సంగ్రామ రంగంబును, మహాశుద్ధాంత రంగంబు గావున యోగిజనంబును, నీల గవాక్ష ప్రబలం .... .... రథ సంబు, గావున రసాతలంబును, గంధర్వ ప్రచురంబు

గావున దేవలోకంబును, గురు కవి బుధ ద్విజ రాజ విభాసంబుగావున గ్రహమండలంబు ... కూర్మాదిరూపంబులు వహి.. కమలాలంకృతంబులై శ్రీమహావిష్ణు పురంబుకు వడించు సరోవరంబులు గలిగి, యొప్పునెప్పుడు.

ఉ. అష్ట మే ... నుతించ జను ల్నవ ద్వీయ
ద్వీప వసుంధరాస్థలిని దీనజయాంకరిపు ల్లిఖించిజా
హేపటుకీర్తి నిల్పిన మహారజతోన్నతయూపముల్నిజ
ప్రాపిత ... జయ భాసిలగా నలరారుచున్నతిన్.

ముగింపు:

సీ. స్వామి పుష్కరిణిలో స్నానంబుగావించి శశి పుష్కరిణిసీళ్ల చల్లులాడి
చంద్ర పుష్కరిణిలో జలకంబుఘటి .... .... .... రణి నొచ్చి పొరలి
గుహ పుష్కరిణి నీట కొమరొప్పగావించి అమృత పుష్కరిణిలో నాడివెడలి
నిత్య పుష్కరిణిలో నీటిలోన మునింగి చిత్రపుష్కరిణిలో .... ....

తే. .... .... లోగ్రుంకి చక్రపుష్క రణిమునిగి దేవపుష్కరిణి దొలంచి
క్షీరపుష్కరణి దురికి సేతుపుష్క రణిని మజ్జనమాడి సరళముగను.

సీ. మత్స్య కూర్మ ... .... ... .... .... .... ....
.... మహేంద్ర చక్రగోనారద శంఖపాం డవ శార్ఙ్గ .... గ స్త్యవిజయ జయ
కపిల వశిష్ఠమా .... .... .... .... .... ....
.... .... మోదర కపింజ లశుక కౌండిన్యగాలవ హిరణ్య
వసు కృష్ణశాండిల్య వజ్రకౌశిక ధనం జయ ముక్తిదే .... ....
.... .... పర్వత పరమ కాశ్యప శేష పంచగోప
రైభ్య భరద్వాజ శైబ్య తుంబురు గౌత మ జటిల భార్గవ మాధవ గురు
ఖాండవ పుణ్యగోపాల ము ... .... .... .... .... వింద మోక్ష
కుల్యాచ్యుతామృత గోమంత సురకృప నారాయణ మను జనార్దన హరి
వైకుంఠ కేశవ వాసుదేవ పతంజలి విరజ ధన్వంతరి కురుభో ....

.... .... .... ప్రద్యుమ్న పురుషోత్తమ పరమపురుష సిద్ధ
పాతక నాశన పాపహార .... విమల భాస్కర మరుమేల సోమ

ఆ. నామధేయములను భూమిలో .... .... .... .... మేటి వినగ
దనరు నట్టి నూటయెనిమిది తీర్థాల స్నానమాడి దానవిధులు సలిపె నంత.

వ. మరియును.

క. .. తి కోశమును .... చెరవుమడుగులొడ్డు కుంటపెల ....
.... .... .... .... కుండము కాల్వదిగ్గి ... పిరాయవృలన్.

సీ. సంకల్పములు జెప్పసాగి బ్రాహ్మణులుండ బైరవార్ఘ్యంబిచ్చి భక్తితోడ
స్నానంబు గావించి సంచిమాత్ర .... .... .... ....
... తములు క్రముక పర్ణంబులు గుడమును ఫలములు గుగ్గిలంబు
కానుక ల్వత్తుల కట్టలు పూల స రాలుగైకొని .... ....

గద్య:

ఇది శ్రీమత్కౌండిన్యస గోత్ర అయ్యల రాజాన్వయసుధావార్థి సంపూర్ణిమా చంద్ర నిస్సహాయ కవిత్వ నిర్మాణ చాతుర్య నిస్తంద్ర శ్రీరామ నామ పారాయణ నారాయణా మాత్య ప్రణీతంబైన హంస వింశతియను మహాప్రబంధంబునందు ప్రథమాశ్వాసము.

విశేషాంశములు:

గ్రంథము మిక్కిలి శిథిలావస్థలో నున్నది. పెక్కు పత్రములు శిథిలమై యున్నవి. గ్రంథాంతములేదు. ఆదియందు కూడ పీఠికా భాగమును ఈ ప్రతి వ్రాయసకాడు వ్రాసియుండలేదు.

ఈ ప్రతి షష్ఠ్యంతములతో ప్రారంభమైనది. వరుస సంఖ్యగల భాగము కూడ శైథిల్యమొందినది. ఇందు మూడాశ్వాసములు పూర్తిగాను, నాల్గవ ఆశ్వాసమున 210 పద్యముల వరకును గలదు.

షష్ఠ్యంత పద్యములను బట్టి ఈ గ్రంథము శ్రీరామచంద్రున కంకితమీయ బడి నట్లుగా తెలియుచున్నది.

ఆశ్వాసాంత గద్యమును బట్టి కవి శ్రీరామ భక్తుడని తెలియుచున్నది.

ఇది కేవలము శృంగార ప్రబంధము. వ్రాత దోషములు కలవు.

# హనుమదర్జున సంవాదము

## గడివేముల సంజీవయామాత్యుడు

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం: | 751 | కాల్ నెం | : బి 3 - 76 |
| ప్రతి | తాళపత్రము; అసమగ్రము. | పత్రములు | : 22 |
| ప్రతి పరిమాణము | : 41.5X3.5 సెం. మీ. | పత్ర పంక్తులు | : 6 |

ప్రారంభము :

శ్రీ పార్వతీ కుమారక నా పాలను గల్గి బ్రోవు నమ్మిన నిన్నున్
కాపాడి శుభము లొసగుచు చేపట్టుము కరుణతోడ శ్రీ గణనాథా.

చ. సుమహిత వాక్సు శబ్ద రస శోభితమై పలుకం . . జేయు నీ
సమ . . ను లేదు దైవమని చాటెద కంజ భవాండమందు నా
విమల హృదంత రాంబురుహ పీఠి వసించు మటంచు వేడెదన్
క్రమమున భారతీ కమలగర్భసతీ సుదతీ సరస్వతీ.

క. దండి భవభూతి మాఘుల దండిగ నా కాళిదాసు క . . కవి వరులన్
నిండిన దయతో మ్రొక్కెద నుండుము నా మనసునందు నుత్సాహముతో.

* * *

వ. ఇవ్విధంబున మద్వంశావతారం బభివర్ణించి, హనుమదర్జున సంవాద కథా క్రమం బభి వర్ణించెద

సీ. నైమిశారణ్యంబు నందు గుంపులు గూడి మునులును, ఋషులును సుటము తోడ
స్నానంబు సంధ్యయు జపములు తపములు నొనరించి మౌనులై రొప్పిదముగ
. . సు చంచలములు మరి యించుకయు లేక హరి పద ధ్యానంబు నందు నిలిపి
కడతేర వలెనని కాంక్షతో నందరు యోగ నిష్ఠ సమాధి జోక నుండి
మరియు నొక్క దినంబున మౌనులంత శుకుల వేసెరి సంతోష ప్రకటితముగ
హనుమ దర్జున సంవాద మానతిమ్ము అనుచు దండంబు బెట్టిరి మౌనులెల్ల

వ. ఇట్లు హనుమ దార్జునులకు వివాదంబైన తెరగంత యానతిమ్మని వేడిరి నేను విన్నంత మీ చిత్తానువృత్తిగా వినిపించెద మీ కర్ణోత్సవంబుగా విను డని మునివరులకు శుకుం డిట్లనియె.

క. ధర్మజుడు రాజ్య మేలుచు ధర్మము దప్పకను తాను దయ గల వాడై
నిర్మల బుద్ధి శెలంగగ ధర్మంబును నాల్గు పాద తలములు మోయన్.

క. ఇంద్ర ప్రస్థపురంబున నింద్రుని వైభవము కంటె నెక్కువగాగన్
యింద్ర తనూజుడు గొలువగ చంద్రుని వలె ధర్మరాజు చేసెన్ ధరణిన్.

ఉ. ధర్మజు దేలు రాజ్యము అధర్మము లేకను సర్వ మానవుల్
ధర్మము సేయుచున్ తమ స్వధర్మము దప్పక నిష్ఠ తోడు తన్
నిర్మల బుద్ధి చేత తగు నీతులు బల్కుచు స్నాన సంధ్యలున్
కర్మము లాచరింపుచును కష్టము లేమియు లేక నందరున్.

ము గిం పు :

ఉ. అప్పుడు మంత్రముల్ చదివి యద్భుత . . త్రు ... ట్టు . . ర్చితా
వప్పుగ సేతు . . ట్టి నను వాయుతనూజుడు గ్రుంగ మ్రొక్కినన్

యప్పటి యట్లి నుండ మనసంతయు చిందర వందరలై తగన్
చప్పుడుగాక . . డుసు చాల కపి ధ్వజుడయ్యె పార్థుడున్.

వ. అని రాము బోయిన వృత్తాంతం బంతయు సవిస్తరంబుగా దెలిపిన ధర్మరాజు నాదిగా గల వారందరు సంతోషాయత్త చిత్తులై సుఖంబున నుండిరి. ధర్మరాజు ధర్మంబు పాలింపుచు రాజ్యంబు సేయుచుండె నంత.

క. ఇంద్రాది దివిజ బృందము సాంద్రా నందమును బొందె సామజ పురిలో
యిం . . . . . మరి చంద్రా న్వయు నరుని జ . . ము సాటించి రాగిన్.

మ. హరి రెక్కల్ ఏని యాంజనేయు నరు ఆ యత్యంత రూపంబు వా
నర . . . . నుండి ........ జప్పగా నంత య
చ్చెరులై యందరు నావగా సుతముఖుల్ సంతోషమున్ జెంద త
త్పురి . . . . సూనుడున్ శకునియున్ క్రోధించి .... బునన్.

వ. అంత కౌరవులు దక్క తక్కిన సకల జనంబులు సంతోష చేతస్కులైరి. ధర్మరాజు ధర్మంబు పాలింపుచు తమ్ములతో గూడి ద్రౌపదీసమేతంబుగా కృష్ణ .... సంపన్నులై రాజ్యంబు సేయు చుండె నంత.

.... వేషా, సాధితార క్తి ఘోషా చిదమృత పరి తోషా, క్షీణ దుర్మోహ దూషా
విదిత భువన . . షా విస్ఫురిత్సత్య భాషా విదళిత .... ... షా.

0 0 0 0 0

గద్య :

ఇది శ్రీ హరి హరార్పిత కరుణా కలిత కవితా విచిత్ర చవ్వ రాజు వంశాబ్ధి చంద్ర బుచ్చయ మంత్రి సహజ పాండిత్య, సంజీవయా మాత్య ప్రణీతంబైన, శ్రీహనుమదర్జున సంవాదంబను ప్రబంధంబు నందు దేవతా స్తోత్రంబును, కవి వర సన్నుతంబును, మద్వంశ ప్రకారంబును, నైమిశారణ్యంబు నందు మునివరులందరు హనుమదర్జునులకు సరి వాదం బెట్లాయెనని శకుల నడుగుట యును, శకులు బుషులకు

తద్వృత్తాంతం బింతయు జెప్ప బూనుటయు, ధర్మరాజు యింద్ర ప్రస్థంబున తమ్ము లతో సకల పరివారంబు గొలువ ధర్మంబు పాలింపుచు ద్రౌపదితో కూడి యుండుటయు, పంచ గ్రీవుడనె దనుజ ఉపాధి చేత సకల రాష్ట్ర రాజులు వచ్చి ధర్మరాజునకు దండంబు పెట్టి మాయాపద నివారింపు మనుటయు, వారల నూరడించి, బహుమానంబుగా బంపుటయు, సవ్యసాచి సాత్యకుల జూచి మీరు చతురంగ బ .... తు . . పోయి రాక్షసుని సంహరించి రమ్మని చెప్పుటయు, తక్షణంబ దండ ప్రణామంబు లిడి, చతురంగబల సమేతులై పోయి, పంచగ్రీవుని సంహరించి, ప్రజల యాపద బాపుటయు, తొల్లి శ్రీరాముండు సీతకై కట్టిన సేతువు చూడవలెనని చతురంగ బల సమేతులై నరుగుటయు సేతు దర్శనంబు చేసుక భూషించుటయు, రాముండు కోదండ దీక్షా గురుండు విలు విద్య నిపుణుండు పర్వతంబుల వారధి గట్టెగాని శరములు గట్టలేడాయె నని దూషించుటయు, నేను నాడుంటె శరంబుల వారధి గట్టుదు నని తన ప్రతిజ్ఞ చెప్పు కొనుటయు, నందునొక గుహ యందు హనుమంతుండు రామనామాక్షరంబులు పఠించుచుండు, అనేక నిష్ట .... సమాధి జాలించినప్పుడు యీ కల కల రవంబులు వినుటయు, అర్జునుడు శ్రీరాములను భూషణ దూషణ తిరస్కారంబు చేసిన వాక్యంబులు విని గుహ వెడలి వచ్చుటయు, వాయు పుత్రుని జూచి మీరు విస్మయం బందుటయు, హనుమంతు . . అర్జునుని ధిక్కరించి, నీవు శరాస్త్రములతో వారధి గట్ట లేక పోయితి వాయనా, నా వెంట వనములందు తిరుగ మనుటయు, నరుండు అంబుల వారధి ... నారఖా నకు కపి ధ్వజంబవై యుండవలెనని యుభయులు పంత మాడుటయు, సవ్యసాచి శర వారధి గట్టుటయు, హనుమంతుండు కట్ట విరుగ ద్రొక్క వివృతా .... పోతున్నదని భగవంతుండు కమఠాకారమై అంపశర కట్ట నుండుటయు, హనుమంతుండు యీ మాయ గానక శర వారధి ద్రొక్కిన విరుగక పోయిన చింతా క్రాంతుండై భగవంతుని దూరుటయు, హనుమంతుని పరితాపంబు నివారింప హరి ప్రత్యక్షంబై వైరాగ్యంబు జెప్పుటయు, తన కమఠాకారంబు జూపుటయు, హనుమంతుడు నిస్సంశుడై మనంబున సంతోషించి వోటమి దలంపక, మీరు దలంచి నప్పుడు వత్తునని చెప్పి గుహ జేరుటయు, చతురంగ బల సమేతులై సాత్యకి సవ్య సాచులు నిజ పురంబు ప్రవేశించుటయు, ధర్మరాజునకు, భీమునకు, దండంబు లిడి, నకుల సహదేవుల ద్రౌపతిని నాలింగనంబు చేసుటయు, తాము పోయిన వృత్తాంతం

ఙంతయు జెప్పుటయు. కపి ధ్వజంబు వచ్చిన ముచ్చట విన్నవించుటయు నన్నది హనుమదర్జున సంవాదంబన్నది సర్వమును ప్రథమాశ్వాసము సంపూర్ణము.

0 0 0 0

విశేషాంశములు :

ఈ కావ్యము హరి హరార్పణము గావింపబడినట్లును, తాను సహజ పాండిత్యుడననియు కవి ఆశ్వాసాంత గద్య యందు పేర్కొనెను. ఇది ఏకాశ్వాస గ్రంథము. ఆశ్వాసాంత గద్య యందు కవి గ్రంథాంశముల వివరములను పూర్తిగా నిచ్చెను. కవిత్వము సులభ శైలిలో నున్నది.

ప్రతి మధ్యలో నొక్క పత్రము మాత్రము నష్టమైనది. ఈ ప్రతి చాల వరకు క్రిమి దష్టమై శిథిలావస్థలో నున్నది. భాషా దోషములు గలవు.

# హరివంశము

## ఎఱ్ఱాప్రెగ్గడ

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | ; 3290 | కాల్ నెం | ; టి 3-119 |
| ప్రతి | ; తాళపత్రము; అసమగ్రము. | పత్రములు | ; 287 |
| ప్రతి పరిమాణము | ; 42.5 × 3.5 సెం.మీ. | పత్ర పంక్తులు | ; 9 |

ప్రారంభము :

శ్రీకిం బ్రేమపదంబు భూమికి నతిస్నిగ్ధుండు దుగ్ధాబ్ధి శ
య్యాకేలీరతు డాదివేధకు గృహంబై యొప్పు నాభీష్ట నా
లీకంబుం గలవేల్పు లోకములు పాలింపం బ్రభుం డుత్తమ
శ్లోకుం డన్నమ వేమ భూ విభున కిచ్చున్ సుస్థిరైశ్వర్యముల్.

శా. శర్వాణీ స్తన చక్రవాకములు వక్షస్సారకాసారము
ల్గర్వం బింపెస లారగా దరిసి వేడ్కల్సల్పి రోమాంచమున్
సర్వాంగీణముగా ధరించి లలితేచ్ఛం జేర్చు శంభుం డశే
షోర్వీరక్షణ దక్షు వేమనృపు నిత్యౌత్క్వోజ్జ్వలుం జేయుతన్.

ఉ. తమ్మికి జూలు లోకముల తాత తపస్వుల యొజ్జ యోగి వ
ర్గమ్ముల కాద్యు డాగమ పరంపరకున్ ప్రభవంబు ధర్మ భా
గమ్ముల కర్త భారతికి గాదిలి మువ్వుర తొల్త వేరు ని
త్యమ్ముగు నాయు వీన్నత గుణాఢ్యుడు ప్రోలయ వేమ కొడికిన్.

0 0 0

వ. తత్త్వవిచారణమునకుం ప్రారంభం బెట్టెనిన నఖిలేశ్వరుండగు పరమాత్ముం డాత్మ సంకల్పంబున నాత్మయుం బ్రకృతియు ననుతత్త్వమిథునంబు నిర్మించె. ప్రకృతికి మహత్తును మహత్తునకు నహంకారంబును, నహంకారంబునకుం బంచ మహా భూతంబులుం బ్రభవించె, నాభూతంబులవలన ననేక భూతభేదంబులు పుట్టె. నిది సనాతనయైన సృష్టికి సంక్షేపంబు. తక్కిన యవి దీనికి విస్తరావయవంబులు; నవి యెట్టి వనిన నవహితుండవై యాకర్ణింపుము.

సీ. అఖిల జగత్సృష్టి యాత్మ నపేక్షించి యాత్మోద్భవుండు నారాయణుండు
జలముల సృజియించి సమధికం బగు నిజ వీర్య మందిడుటయు విస్మయమున
విమల హేమాకృతి నమరు మహాండమై కర మొప్ప దద్భూరి గర్భ మూర్తి
యైయుండి బహుల వత్సరాత్మకం బగు కాల మేగిన నది యవియించు కొనుచు
బుట్టె నజుడు, క్రింది వ్రయ్య భువియు, మీది వ్రయ్య దివియు, నడు మంబరము జేసి
దిశలు గాలంబు మనసు బుద్ధియును వాక్కు గామ రోషాది త్యాది సర్గము నొనర్చె.

ముగింపు :

వ. అనిన ఘంటాకర్ణుండు దీనుండగుచు నన్నీల వర్ణనకు సాష్టాంగ ప్రణతుండై, లేచి నిలుచుండి మొగిచిన చేతులు ఫాలతలంబునం గదియించి

ఉ. దేవర సుప్రసాద శుభదృష్టి సుధా విరసంబు నాపయిన్
న్వావిరి గొల్వ నెమ్మనము నందొక వెల్తియు గల్గనేర్చునే
దేవకులేశ యైనను మఱియ మనీష నితాంత భక్తినే
త్రోవల నెమ్మెయిం దొలగద్రొక్కక నిన్ను భజింపజేయవే.

వ. అనిన నవ్వరం బట్ల యొసంగి వాసుదేవుం డతని వీడ్కొలిపిన నాసిద్ధుండును, సిద్ధగతి నరిగెను.

క. అభిమన్యు పౌత్రునకు వా గ్విభు సమర్థుడు ముకుంద వృత్తంబు ముని
ప్రభు డగు వైశంపాయను డభయుడు వినిపించి నట్టి దఖిలము దెలియన్.

మ. భుజగేంద్రాయుత భూరి భూభరణ విస్ఫూర్జ ద్భుజా శ్రీభుజ
స్యజితానేక నరేంద్ర వర్గ మతి మత్సంభావ్య సవ్యామహా
భుజగారిధ్వజ తత్వ బోధన యశో భూయిష్ఠ తేజోధనా
భుజ వీర్యాఖిల భూమిదేవత లతాపూజోల్లసద్భాసితా.

క. రత్నాకర నాయక గుణ రత్నోజ్జ్వల రెడ్డి మల్లరాజిత శశ్వ
ద్యత్నాత్త ద్వీపాంతర రత్నాలంకృత సమస్త రాజ్య రమాంగా.

మాలినీ.
నయగుణ సమపార్థా నవ్యదానాఖిలార్థా జయ విభవ ధురీణా సాధురక్షార్థ బాణీ
హయ హృదయ విధిజ్ఞా హానితాన్వాధిపాజ్ఞా గయ నృగనలతుల్యా గాఢ కల్యాణ కల్యా.

గద్యః
ఇది శ్రీ శంకరస్వామి సంయమీశ్వర చరణ సరోరుహ ధ్యానానంద సౌందర్య ధుర్య,
శ్రీ సూర్యసుకవి సంభవ శంభుదాస లక్షణాభిధేయ యెఱ్ఱయ నామధేయ ప్రణీతంబైన
హరివంశంబునం దుత్తర భాగంబునందు పంచమాశ్వాసము.

విశేషాంశములు :

ప్రతివిశేషములు :

ఈ ప్రతి పరాభవనామ సం॥ మార్గశిర శు॥ ౧ా గురువారం రోజు వ్రాత ఆరంభం. ప్లవంగనామ సం॥ కార్తీక బ॥ ౧౪ సోమవారం సాయంకాలం వరకు శ్రీహరివంశము పూర్వభాగమున్ను ఉత్తర భాగమునందు అయిదు అశ్వాసములున్ను ఆచంద్రతారార్కముగా వమిమిప్రయోగలందులకు పోతుల పాత్రినాయుడు కుమాళ్లు పెదరాజినాయుడు శ్రీ కృష్ణార్పణముగా వ్రాసెను.

ఈ హరివంశ కావ్యము ఎఱ్ఱాప్రగ్గడకవి ప్రణీతంబైనది. ఎఱ్ఱన శ్రీ శంకరస్వామి సంయమీశ్వర శిష్యుడనని చెప్పుకొనెను. ప్రోలయ వేమారెడ్డి ఎఱ్ఱనచే రామకథను వప్పించి పిదప తరువాత తిక్కప్రిజెందక భారత పరాంశమగు హరివంశమును గూడ తెనుగున పలుకతెలుపుమని కోరెను. అట్లే ఎఱ్ఱయ హరివంశమును పూర్వ, ఉత్తర భాగములుగా రచియించి ఆ వేమారెడ్డినే కృతిభర్తను గావించెను.

ఈ ప్రతియందు పూర్వభాగమున 8 ఆశ్వాసములు, ఉత్తర భాగమున 5 ఆశ్వాసములు మాత్రమే యున్నవి. ప్రతి నలువు చిరిగినదిగాని శిథిలము గాలేదు. లిపి స్పష్టముగ నున్నది. అక్షర దోషము లత్యల్పముగ నున్నవి.

## హరివంశము

### ఎఱ్ఱాప్రెగ్గడ

| | | | |
|---|---|---|---|
| అక్సెషన్ నెం | : 8656 | కాల్ నెం | : టి 3-288 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము. | పత్రములు | : 386 |
| ప్రతి పరిమాణము | : 49.5 × 4.5 సెం.మీ. | పత్రపంక్తులు | : 9 |

శ్రీకిన్ బ్రేమ పదంబు భూమికి నతి స్నిగ్ధుండు దుగ్ధాబ్ధి శ
య్యాకేలీరతు డాది వేధకు గృహంబై యొప్పు నాభిస్థ నా

లోకంబుం గల వేల్పు లోకములు పాలింపం బ్రభుం డుత్తమ
శ్లోకుం డన్నయ వేమ భూ విభున కిచ్చున్ సుస్థిరైశ్వర్యముల్.

శా. శర్వాణీ స్తన చక్రవాకములు నక్షత్స్ఫారకాసారమున్
గర్వం బింపెస లారగా దరసి వేడ్కల్ సల్ప కోకాంచమున్
సర్వాంగీణముగా ధరించి లలితేచ్ఛన్ చేర్పు శంకు వశే
షోర్వీ రక్షణ దక్షు వేమన్నృపునిన్ నిత్యోజ్జ్వలున్ జేయుతన్.

ఉ. తమ్మికి జూలు లోకముల తాత తపస్యుల యొజ్జ యోగి వ
ర్గమ్ముల కాద్యు డాగమ పరంపరకున్ బ్రభవంబు ధర్మ భా
గమ్ముల కర్త భారతికి గాదిలి ముప్పురి తొత్తు పేరు ని
త్యమ్ముగ నాయు వీపుత గుణాఢ్యుడు బ్రోలయ వేమశౌరికిన్.

ముగింపు :

వ. అమ్మహాత్మ్యం దట్లేర్పరించి యొసంగి యింద్రుడు పూర్వ దిగ్రాజ్యంబు గైకొనియె. ధర్ముండు దక్షిణ దిశాధిపత్యం బనుష్ఠించె. వరుణుండు పశ్చిమాశానుకారియై నిలిచె. గుబేరుం డుత్తర హరిత్పాలనం బంగీకరించె భుజగవిభుం డధోభువన భరణంబున నుల్లసిల్లె. సోముం డూర్ధ్వలోకాధీశుండై యొప్పె. దక్కినవారలు తమ తమ పదంబునం బ్రమదంబు నొందిరి. ఇట్లు సర్వలోకోపకార వినోదుండై యద్దేవుండు

మ. అదితిం గశ్యపు నిత్య సద్గతి గృతార్థారంభుల జేయుచుం
ద్రిదశా చార్యుడు లోనుగాగల మునిశ్రేణిన్ బ్రియాపాదనా
భ్యుదయ ప్రౌఢి ననుగ్రహింపుచు సురల్ బూజింప బ్రత్యాదర
ప్రదలీలం బ్రసరించుచుం భువనముల్ పాలించు చుండెన్ గృపన్.

వ. అని చెప్పి వైశంపాయనుడు.

ఉ. శౌనకు డాదిగా గల్గు సంయమి పుంగవు లందరుం బ్రమో
దాను భవంబునం బొదలు నాంతర బాహ్య విచేష్టితంబులో

పై నెరయంగ నక్కథకు నంచిత కీర్తి నపూర్వ భూరి స
న్మానములన్ బ్రహర్షమయ మానసుగా నొనరించి రున్నతిన్.

శా. లక్ష్మీలోలా విహాయి ధర్మగుణ కల్యాణైక ధర్మా యన
ల్పిష్టా కల్పిత లోక లోలప వధూ లభ్యావ లోక స్వమ
స్త స్వాభోగ ఫలాత్మ భాగ్య విలసత్సౌభాగ్య యోగ్యా మహా
సూక్ష్మాపాయ హృతాస్య భూప విభవా శూరత్వశక్రోద్భవా.

క. శ్రీ వేమ క్ష్మా వల్లభ భూ వల్లభ పూజనీయ భుజవైభవ ల
క్ష్మీపక్షక గుణ వితరణ పావన వినుమొందు గాత భవ్యకథంబుల్.

మాలిని.

కదన దళన మిత్రా క్షత్ర గోత్ర ప్రవాకు (?)
ప్రదన నివహ కురు క్షేత్రాయుతానీకధాత్రీ
పద పరిణత దృప్యద్భార్గ వాఖిల హేలా
భ్యుదిత వర కుహాళ్యాస్ఫూర్తి యుక్తి ప్రబంధా.

గద్య :

ఇది శ్రీ శంకరస్వామి సంయమీశ్వర చరణ సరోరుహ ధ్యానానంద సౌందర్య ధుర్య శ్రీ సూర్య సుకవి సంభవ శంభుదాస లక్షణాభిధేయ యెఱ్ఱయ నామధేయ ప్రణీతం బైన హరివంశంబునం దుత్తర భాగంబునందు సర్వంబును త్రయోదశాశ్వాసము.

విశేషాంశములు :

ప్రతివిలేఖనము :

వర్తమాన కలియుగే గతాబ్దాః 4959 శాలివాహన గతాబ్దాః 1780 ప్రభవాది గతాబ్దాః 51 అగు నేడు కాళయుక్తి సంవత్సర మాఘ బహుళ ౧౩ బుధవారం వరకు మహా రాజశ్రీ రాజారావు వేంకట కుమార మహీపతి రాయనింగారికి రేమెళ్ల వుప్పాంశయ్య గారు హరివంశ పూర్వోత్తర భాగములు యథామాతృకగా వ్రాసి శ్రీరామ చంద్రా ర్పణంగా దాఖలు చేసిరి.

ఈ ప్రతియందు పూర్వభాగము 9 ఆశ్వాసములుగను, ఉత్తరభాగము 10 ఆశ్వాసములు గను నున్నవి. గ్రంథము యొక్క ఆద్యంతములు ఉన్నవి. కాని ప్రథమ, ద్వితీయాశ్వాసములతో కొన్ని తాళ పత్రములు లోపించినవి కొన్ని పత్రములు శిథిలములై సగభాగములే యున్నవి. ప్రతి కొంతవరకు క్రిమిదష్టమైనది. లిపి స్పష్టము.

ముద్రిత ప్రతులందు ఉత్తర భాగము పది ఆశ్వాసములుగనే విభజింప బడినది. ఈ ప్రతిలోని ఉత్తర భాగము పదమూడాశ్వాసములుగా విభజింపబడుట విశేషము.

## హ రి వం శ ము

### ఎఱ్ఱాప్రెగ్గడ

| | | | |
|---|---|---|---|
| ఆక్సేషన్ నెం | 1795 | కాల్ నెం | టి 3-59% |
| ప్రతి | తాళపత్రము ; అసమగ్రము. | పత్రము | 70 |
| ప్రతి పరిమాణము | 50×5.2 సెం.మీ. | పత్ర పంక్తులు | 20 నుండి 25 |

**వి శే షాం శ ము లు**

ఈ ప్రతియందు ఉత్తర హరివంశము దశమాశ్వాసమువరకు కలదు. కాని కొన్ని పత్రములు విరిగి, కొన్ని క్రిమిదష్టములై యున్నవి. లిపి బహు సూక్ష్మముగ కష్టసాధ్యముగ నున్నది. లేఖన దోషములును గలవు.

# హరిశ్చంద్రోపాఖ్యానము

### వీర శరభకవి

| | | | |
|---|---|---|---|
| ఆక్సేషన్ నెం | 712 | కాల్ నెం | టి 8-158 |
| ప్రతి | తాళపత్రము, అసమగ్రము. | పత్రములు | 108 |
| ప్రతి పరిమాణము | 26X3.5 సెం. మీ. | పత్ర పంక్తులు | 6 |

ప్రారంభము :

వ. అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నా యొనర్పం బూనిన హరిశ్చంద్రోపాఖ్యానం బను మహా ప్రబంధంబునకు కథావిధం బెట్టిదనిన.

ఉ. శ్రీ తరుణీ మనఃప్రియ మశేష విశేష సమస్త ధారుణీ
జాత లతాగుళుచ్ఛ విలసత్ప్రసవ ప్రబలోగ్ర సౌర భా
వేత దిగంతరాళము కృపీటభవప్రభవాభిరామమై
ద్వైత వనంబు సాధు వినుతంబగునీ ధరణీ తలంబునన్.

ఉ. ఆ వన వాటి యందు సముదంచిత కల్ప మహీరుహ ప్రభా
భూవినుత ప్రదీప్త నవపుష్ప శలాటి ఫలావళీయుత
శ్రీ విభవంబు మౌని సురసిద్ధ దిగీశ మనః ప్రమోద పీ
ఠావళబంధురంబగు విశాల రసాలము గల్గు నెంతయున్.

ఉ. నిర్మలమైన యా తరువు నీడ నరణ్య నివాస వృత్తిచే
ధర్మతనూభవుండు తన తమ్ములు దానును కాంతయున్ దగన్
బేర్మి వహింపగా విహిత బృందము గొల్వ సఖీజనంబుతో
ధర్మ కథా ప్రసంగ విశదం బొనరింపుచు నుండె నయ్యెడన్.

0 0 0 0

వ. అనుటయు మునీంద్రుం డిట్లనియె.

చ. బలవ దరాతిలోక మదభంజన, ధర్మతనూజ నీ మహా
సలలిత వాగ్విశుద్ధికి ప్రసన్నుడనైతి హితంబు జేసెదన్
వలనుగ సావధానమతివై వినుమా యనుమాన మేమియున్
దలపక పూర్వపుణ్య చరితంబొకటింబ వినిపింతు వేడుకన్.

క. కలి దోషహరము సంతత
కలిత మనోహర కీర్తికరము విలాసో

జ్వల సంపత్సరికర మగు
వెలయగ నీ పుణ్య చరిత విను వారలకున్.

సీ. మోక్షదాయక మను మున్నెన్నందగు వీడు వీడని చెలువంపు వేగుజుక్క-
చుక్కల దొర మేను సోకు మేడలతీరు తీరని బహురత్న దీప సమితి
మితిలేని సంపత్సమేతంబు గలపట్టు పట్టి చూడంగ పెంపైనవాడ
వాడని పువ్వుల వరుస తోటల చాలు చాలని సిరిలేని జనులమంద
తే.గీ. మందమతులెంచలేని ధర్మప్రసిద్ధి సిద్ధ మేప్రొద్దు యాచక శ్రేణి దండ
దండనాయక శతకోటి దనరుకాపు కాపురంబున కను వయోధ్యాపురంబు.

చ. అలరు తదీయపట్టణ మహామహిమంబు వచింపజాలమిన్
జలరుహగర్భు డాత్మనొక సంశయ మంది జగత్ప్రసిద్ధిగా
వలయము జుట్టినట్లు చెలువై బలువై విరోధియో
ధుల తలగుండనంగ ఘనదుర్గ మనర్గళ మయ్యె నియ్యెడన్.

ముగింపు :

వ. మరియుకుం బసి చని యమ్ముందట ననేక భూత ప్రేత పిశాచ బ్రహ్మ రాక్షసాద్యఖిల యామినీచర నిబిడ కోలాహలంబును కాక గృధ్ర వృక జంబుకాది పతంగ మృగ మనోభీష్టకరం బగు తదీయ స్థలంబు ప్రవేశించి నిజఖడ్గాది సాధనంబులు కరంబునం బెరుకొన పేరంబులాడుచు నానావిధపిశాచ దానవ సంచయంబు నిట్టట్టు గదలనీక, వట్టుపడన్ గొట్టుచు ధటించి యప్పట్టునం గదలకుండి తనపంపున బ్రవర్తించుచు ముదంబున వీరబాహుని సదనంబులకుం బనులు గడుపుచుండుమని నియోగించి యంతట మహోన్నత తాళ మహీజంబు భంగి నుప్పొంగు భేతాళు నొక్కనింబిలిచి ముదం బొదవ మత్సమీపంబు గదలకుండు మప్పట్టునన్ బిట్టగు మంచ బెట్టించు మనుటయు, మహాప్రసాదం బని ధరం బ్రణమిల్లి యతి త్వరితంబున తదీయ కృత్యం బొనరించితి ననుటయు, సమ్మతించి యమ్మంచ పయిన్నిలచి బెడిదం బగు నడిదంబు కడువడిం దనకు దోడుగా దలంపుచు నిర్నిద్ర పరిభావంబున యా రుద్రభూమి మొదలం గదలక నిత్యం బప్రమత్తచిత్తుం డగుచు తన యోపికం గాపుండె నంత.

క. అని మార్కండేయ తపో ధన నిధి వివరింప పాండు తనయాగ్రణి
యానతి మీదటి వృత్తాంతం బనఘా దయచేయవలయునని యడుగుటయున్.

చ. అతుల గుణాభిరామ సము దంచిత రౌద్రగిరీంద్రధామ సం
తతహిమ సాధుభక్తకుముద వ్రజసోమ మహోగ్రఘోరదు
ష్కృత రిపురాడ్విరామ సురకిన్నర యక్షమునీంద్రసిద్ధ సం
స్నుత శుభనామ భాసుర మనోహరభీమ నిరామయోన్నతా.

క. అభ్రనదీ జూట లస చ్చుభ్రాంశుకిరీట కోటి సూర్య మహోద్య
ద్విభ్రాజమాన బుధ చి త్తభ్రమ రవి తానమానితాస్త్రసరోజా

మా లి సి.

విమల గుణ నిధానా విశ్వరక్షాభిధానా కమలజనుత పాదా కల్మషౌఘప్రభేదా
సమయ విజయశీలా చారు విజ్ఞానలోలా శమనగజ మృగేంద్రా సర్వసౌభాగ్యసాంద్రా.

గ ద్య:

ఇది శ్రీ మత్సదాశివ కరుణాకటాక్ష లబ్ధ కవితా విధేయ వీరశరభ నామధేయ
ప్రణీతంబైన హరిశ్చంద్రోపాఖ్యానం బను మహాప్రబంధంబు నందు చతుర్థాశ్వాసము.

వి శే షాం శ ము లు:

ఈ ప్రతి కథా ప్రారంభముతోనే యుండుటచేతను, కావ్యాంతము ఇందు లేకుండుట చేతను కవిని గూర్చిన వివరములు ఏమియు లభ్యముకాలేదు. ఇందు నాలుగు ఆశ్వాసములు మాత్రమే కలవు. హరిశ్చంద్రుడు వీరబాహుని యొద్ద పనికిజేరుట వరకే గల కథ యిందు కలదు.

ఈ ప్రతి యందు అక్షరదోషములు, పాదఛందో భంగములు చాల కలవు. లిపి సులభగ్రాహ మగుటలేదు. ప్రతి సగభాగము స్వల్పముగా శిథిలదష్టమై యున్నది.

# హరిశ్చంద్రోపాఖ్యానము

## శంకర కవి

ఆక్సెషన్ నెం. : 3968 కాల్ నెం : డి 3-25౮
ప్రతి : తాళపత్రము; అసమగ్రము. పత్రములు : 89
ప్రతి పరిమాణము : 31×4 సెం.మీ. పత్ర పంక్తులు : 8 నుండి 9

ప్రారంభము :

శా. శ్రీ వాణీవర వాసవాది విబుధశ్రేణీ శిరోరత్నశో
భావిభ్రాజిత పాద పంకజు డుమాభామా మనోభర్త కా
శీ విశ్వేశ్వరు డిందుశేఖరుడు రక్షించున్ మహోదార వి
ద్యావర్ధిష్ణుని బాచయ ప్రభుని యెల్లామాత్య చూడామణిన్.

చ. జలనిధి కన్య క్రొమ్మెరుగు సంతత కౌస్తుభ వైజయంతికా
విలసిత కాంతి వాసవుని విల్లు కృపారస ధాతువృష్టిగా
నెలమి వహించుచుం బొదలు కృష్ణపయోదము ప్రోదిసేయు స
త్ఫలిత విభూతు లింపెసగ బాచయ యెల్లని కీర్తి సస్యమున్.

... ... ...

వ. అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నారచియింపంగడంగిన హరిశ్చంద్రచరిత్రం బను మహాప్రబంధంబునకు కథా క్రమం బెట్టిదనిన.

ఉ. శ్రీ తరుణీ మనోహర విరించి సమాన మహాతపోధన
వ్రాత నివాస యోగ్య మమరద్రుమతుల్యసమస్త పుణ్యభూ
జాత లతానికేతన వసంతిక ముఖ్య వసంత మెంతయున్
ద్వైత వనంబు బొల్పు వసుధారమణీ హరినీలభూషయై.

చ. మదన విరోధి దానవసమాజము పూజ యొనర్చుదాక ష
ట్పదములు పుష్ప గుచ్ఛములపై భ్రమరింపవు చంద్రశేఖరున్

ముదమున మజ్జనంబు ముని ముఖ్యులు సేయకమున్న హంసము
ల్గదియగబోవు తామరకొలంకుల కప్పెపినాంతరంబులన్.

వ. అందు.

x x x x

వ. ఆసమయంబున.

శా. గండూషీకృత వేదశాస్త్ర నిగమ గ్రంథార్థసారుండు మా
ర్తాండానూన తను ప్రభాంచితుడు సుత్రామాది గీర్వాణసే
వ్యుండంహంకరి సింహపోతము ఋషివ్యాపాగ్రగణ్యుండు మా
ర్కండేయుండు ద్వితీయ బాలశశిరేఖాశేఖరుం డిమ్ములన్.

సీ. భసిత త్రిపుండ్రాంక ఫాలభాగముతోడ రుద్రాక్షమాలికా రుచులతోడ
పల్లవారుణ జటాపటల భారముతోడ నవ్యపలాశ దండంబుతోడ
నుత్తమ వ్యాఘ్రాజి నుత్తరీయముతోడ రమణీయ దర్భాంకురములతోడ
నతి నిర్మల స్ఫటికాక్ష సూత్రము తోడ ధవళ యజ్ఞోపవీతములతోడ

తే. పుణ్యకల్లోల వత్సంబు పూర్ణఘన క మండలముతోడ వినయసంపదలపొదలి
గదిసి భజియింప వరశిష్య గణముతోడ గరిమ జనుదెంచె బాండవాగ్రజుని కడకు.

సీ. అరుగుదెంచిన నతండల్లంత దవ్వుల బొడగాంచి యెదురుగా బోయి భక్తి
ననుజ సమేతుడై యందంద బెక్కు వందనము లొనర్చి తోడ్కొనుచు వచ్చి
పావన సలిలార్ఘ్య పాద్యాది విధుల బూజించి కుశాసనాసీను జేసి
హస్తాబ్జములు మోడ్చి యంతరంగంబున ప్రేమ బొంపిరిపోవ సేమమడిగి.

తే. సమయ సముచిత మృదు వాక్యసరణి దెలియ
గోరి సుఖగోష్ఠి నడుపుచు గొంతప్రొద్దు
జరిపి కుంతి సుతాగ్రణి సంయమీంద్రు
బలికె నిట్లని వినయ సంపదలు పొదల.

ముగింపు:

సీ. అరవిందనాభు డీ యవనీ .... .... .... ....
పాకశాసను డీ దివాకరాన్వయభర్త పౌలోమి యీ పురంధ్రీలలామ
నీహారకిరణు డీ నిత్య సత్యాధను రోహిణి యీ పంకరుహాయతాక్షి
ప్రసవకోదండ విరాజ వేదండంబు రతిదేవి యీ లోకనుతచరిత్ర

తే. యని హరిశ్చంద్ర సార్వభౌమాగ్ర గణ్యు
చంద్రమతి జూచి యానంద జలధి దేవి
పౌరజన బృందములు సుధాసారమధుర
చిత్ర వాగ్వైఖరుల నుతిజేసి నెమి.

వ. ఇవ్విధంబున పౌరజన నికాయసంస్తూయమానుండై యా హరిశ్చంద్రుండు మహా నందంబునుం బొంది నిజమందిరంబు దరసి సముచిత వర్తనంబులం బ్రవర్తింపుచు నయమార్గంబునం బ్రజాపాలన శీలుండై పూజ్యంబగు రాజ్యంబు సేయుచుండెనని.

క. మునిపతి మార్కండేయుం డనఘుండు యుధిష్ఠిరునకు ననురాగమునన్
వినిపించె హరిశ్చంద్రా వనినాథు కథా క్రమం బవార్య ప్రౌఢిన్.

శా. వాగ్భోగేంద్ర సుపర్వ సింధుర శరద్వారాబ్దహాసా సుధా
రుగ్భర్మాచల చాప గోపగరుడ త్రోటీఛటా మల్లికా
స్రగ్భ్రా విభ్రమ శుభ్రకీర్తి రుచిహార శ్రేణికావిస్ఫుర
దిగ్భామాకుచ మండలాగ్ర వివిధార్థి వ్రాత చింతామణీ.

క. అలఘు ప్రతాప కుతంబిన మంకేంద్ర కృపాసమగ్రమహిమాన్విత కో
ర్కొలనిగ్రామనికేతన జలసీమారక్షణైక చాతుర్యనిధీ.

ఉత్సాహ:

రాట్సభాంతరాళ ధీధురంధర ప్రశస్తప్రా
వృట్సమాగమాంబు భృన్నిపీన దాన గర్విత

ద్విట్సమాజదంతి సింహధీర తామరాచలా
షట్సహస్రవంశ దుగ్ధ సాగరక్షపాధిపా.

గద్య :

ఇది శ్రీమదాపస్తంబ సూత్ర పవిత్ర కౌండిన్యముని చక్రవర్తి గోత్ర సకల సుకవి జనానీక మిత్ర దేచనామాత్యకుమార వివేక విద్యాలంకార శంకరకవినామధేయ ప్రణీతంబైన హరిశ్చంద్రోపాఖ్యానంబునందు సర్వంబును పంచమాశ్వాసము సంపూర్ణము.

విశేషాంశములు :

ప్రతి విలేఖనము :

ప్లవంగ సం॥ నిజ జేష్ఠ శు॥ ఇందువారం మూడు యామాలకు హరిశ్చంద్రోపాఖ్యాన ప్రతిపున్న క్రమాన వ్రాసినాడు.

ప్రతి చక్కనిది. 5 ఆశ్వాసములు గలవు.

ఈ గ్రంథ కృతిభర్త ఎల్లయామాత్యుడు. ఇతడు శౌర్యాధికుడు. సత్య వర్తనుడు. సరస జనాగ్రగణ్యుడు. ఈడూరి శాసన కర్త. ఇతని గురువు కేదారేశుడు.

కృతి కర్త తనను గూర్చి కావ్యాదిని అధికముగా బేర్కొనలేదు. పేర్కొని నంత వరకు ఇతడు కౌండిన్య సగోత్రుడు. దేచనామాత్యుని పుత్రుడు. నిరాఘాట వచో దురంధరుడు. శశాంకమౌళి పదసేవా లబ్ధ సాహితీ నిపుణుడు.

## హరిశ్చంద్రోపాఖ్యానము

### శంకర కవి

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 1587 | కాల్ నెం | : టి 3 - 125 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము. | పత్రములు | : 86 |
| ప్రతి పరిమాణము | : 41×3.5 సెం.మీ. | పత్ర పంక్తులు | : 7 |

విశేషాంశములు :

ప్రతి విలేఖనము :

ప్లవంగ నామ సంవత్సర ఆశ్వీజ బహుళ ౧ ఆదివారం మూడు ఝామలకు హరిశ్చంద్రోపాఖ్యానము అవ్వాజ........ మాటూరు వేంకట రాయుడు సంపూర్ణంగా వ్రాసి ఇచ్చెను.

ఈ ప్రతియందు ద్వైదాశ్వాసము లున్నను గ్రంథ మధికముగా క్రిమి దష్టమై పత్రములు శిథిలావస్థలో నున్నవి. భాషా దోషము లధికము. గ్రంథారంభమునందు అవతారిక, షష్ఠ్యంతములు మొదలగున వింధు లేవు కథారంభము నుండియే ప్రతి ప్రారంభమైనది.

హరిశ్చంద్రోపాఖ్యానము

శంకర కవి

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 3642 | కాల్ నెం | : టి 3 - 224 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము. | పత్రములు | : 38 |
| ప్రతి పరిమాణము | : 43×3.5 సెం.మీ. | పత్ర పంక్తులు | : 6 |

విశేషాంశములు :

ఈ ప్రతియందు కావ్యము ప్రథమాశ్వాసము నుండి, చతుర్థాశ్వాసమున కొంతవరకు మాత్రమే యున్నది. పత్రసంఖ్య ననుసరించి చూచినచో 70 పత్రము లుండవలయును కాని ఈ ప్రతియందు 38 పత్రములే యున్నవి. గ్రంథపాత మధికము. లిపి స్పష్టమే కాని పత్రములు క్రిమిదష్టము లైనవి. భాషా దోషములు పెక్కులు.

హరిశ్చంద్రోపాఖ్యానము

శంకర కవి

| | | | |
|---|---|---|---|
| ఆక్సెషన్ నెం | : 4645 | కాల్ నెం | : టి 3 - 66 |
| ప్రతి | : తాళపత్రము; అసమగ్రము. | పత్రములు | : 101 |
| ప్రతి పరిమాణము | : 40.5×3.5 సెం.మీ. | పత్ర పంక్తులు | : 7 |

విశేషాంశములు :

ఈ ప్రతియం దాద్యంతము లున్నను, అటనట కొన్ని పత్రములు లోపించినవి. ప్రతి కిమిదష్ట మైనవి. వ్రాత యొక మాదిరిగా నున్నది. భాషా దోషములు పెక్కులు.

# హరిశ్చంద్ర నలోపాఖ్యానము

## రామరాజభూషణుడు

| | | | |
|---|---|---|---|
| ఆక్సేషన్ నెం | : 1749 | కాల్ నెం | : టి 3-166 |
| ప్రతి | : తాళపత్రము; సమగ్రము. | పత్రములు | : 52 |
| ప్రతి పరిమాణము | : 43×3.5 సెం.మీ. | పత్ర పంక్తులు | : 6 |

ప్రారంభము :

శా. శ్రీ వైదేహ సుతన్ భృగూద్వహ జయశ్రీ నబ్జ భృచ్చాపలీ
లావాప్తిన్ వరియించి సత్కుశల వత్సా మూల్య మాంగల్యదీ
క్షా వాలం బగు నా పరిగ్రహ యుగం బన్యోన్య హార్దంబునన్
సేవింపం దగు రామచంద్రుడు శుభశ్రీ లిచ్చు మా కెంతయున్.

సీ. నిఖిల లోకానంద నియత స్థిరోద్భూతి బొలుచు ననాదృతాంభోజపాటి
యంభోధి మదనా సహాయ శౌర్య వరాప్తి జాలమించు ననాప్త సంఖ్య సీల
పంక దూర కృపిట భవనివేశ ప్రౌఢి బరగు నప్రతిపన్న భంగధామ
యతి లాలితాక్షీణ సుత సంపద దనర్చు నకళంక సహజ కళాధి వసతి
తే.గీ. సుదతులు నుతింప నభినవ సురుచిరమణి యెనయ కుండ నిజాధీశు హృదయ పీఠి
వెలయు సితాభిదాన నవీన లక్ష్మి నిశ్చలైశ్వర్యములు గరుణించుగాత.

0 0 0 0

వ. ఇవ్విధంబున నభీష్ట వరప్రదాన నిస్తంద్రు డగు శ్రీరామచంద్రునకు నంకితంబు సేయం బూనిన హరిశ్చంద్ర నలోపాఖ్యానంబను మహా ప్రబంధంబునకుం గథా క్రమం బెట్టిదనిన.

ఉ. పాండు సుతాగ్రజుండు పరి పాండుర కీర్తి యఖండ శార్ఙ్గ కో
దండ దయానువర్తి యల ద్వైతవనంబున నుండి యప్రమే
యుండు మృకండు మౌని తనయుం డరుదేరగ నమ్మహర్షి మా
ర్తాండుని బూజ చేసి కరతామరసంబులు మోడ్చి యిట్లనున్.

ఉ. ఎన్నడు మాకు గ్రమ్మర సమీహిత రాజ్య సుఖంబు గల్గు మా
యున్న తెరంగునన్ నృపతులోద్భవు లెవ్వరు మున్ను కానలన్
ఖిన్నత నుండి వెండియు నకిల్బిష సౌఖ్యము గాంచిరో గుణా
భ్యున్నత తెల్పవే యన తపోధన చంద్రుడు పల్కె సత్కృపన్.

0 0 0 0 0

గీ. అలరు మణి వప్ర విజిత హిమాద్రి నిషధ
నగర మవతంస మఖిల భూ నగరములకు
లలిత జయ సంపదలు నిల్చు నిలుప యోధ్య
లఘు గభీరాంబు పరిఘా కలాప మగుచు.

సీ. ప్రాత మాటలె కాని బహు వాగ్విహృతి లేని యజు గెల్తు రచ్చటి యవనిసురలు
పరధర్మ మెదలి జీవముగాచు కొన్న భా ర్గవు మెచ్చ రచ్చటి రాజమణులు
నవత బూనిన నిధానముల నుబ్బు గుబేరు బాటించ రచటి కిరాట వర్యు
లొక్క యీశ్వరపె దానోక హాలికుడె యంచు ముసలి నెంచరు శూద్రముఖ్యు లచట
తే.గీ. గజము లచ్చట వెలిజాతి కరటి గినియు వాజు లచ్చట నుచ్చైశ్రవము నదల్చు
నచటి రుచిరాంగులు హరింతు రచిర రుచుల దెగడ నచ్చటి నగకోటి త్రిదశ తరుల.

ము గిం పు :

మ. అపుడా కాంత నితాంత సామజ సమా ........ రుడై
విపులా వర్జిత దాత్మ ........ సామ్రాజ్యభ
ద్రపదశ్రీ నిరవొంది యా ప్రజన చేతశ్చాతక ప్రీతి దా
న పయోదా నఘ మూర్తియై వెలసె భూనాథాగ్రణుల్ గొల్వగన్.

సీ. అతను పావక .... డిందె నక్షామ హర్షసామగ్రి జెందె
వన చరాళి దురారవ ప్రకంపముజారె నిష్టలీలాస్ఫూర్తులి ....
రాజకర జాతకాతరత్వమడ .... .... గములు వోగి
మధుమత్త పరభృత స్మయభయంబు శమించె నాకల్ప సద్విధు లతిశయించె
నమరనుత వైభవుని .... ధవుని దేజోరవింద ....
.... లకుగ్ర....ర నెఃసి వసుమ తీ మహారాజ్యలక్ష్మి సుస్థిరత నిలువ.

క. అని యిట్లు పాండు సుతునకు జననుతుడు మృకండు సుతుడు చతురత నెరిగిం
.... ... .... ఘనులకు సిరులొసగు మహిమకర వంశభవా.!

శా. నమ్రారామ వసంత సంతతనుతి న్యస్తాదరాహార్యజా
క్రమస్వాంత నిశాంత శాంత ... లతకృ
ద్ధామ్రాషాది కృతాంతతాంత భృగురాడ్డోదర్పతేజోమ
.... శిక్షణ దాంతదాంత జననంత్రాణైక చింతామణీ

గద్య:

ఇది శ్రీమద్రామచంద్ర చరణారవింద వందన పవననందన ప్రసాద సమాసాదిత సంస్కృతాంధ్ర సామ్రాజ్య సర్వంకష చతుర్విధ కవితా నిర్వాహక !సాహిత్య రస పోషణ రామరాజభూషణ ప్రణీతంబయిన హరిశ్చంద్ర నలోపాఖ్యానంబను మహా ప్రబం ధంబునందు .... పంచమాశ్వాసము.

విశేషాంశములు :

ఈ హరిశ్చంద్ర నలోపాఖ్యాన మను ఈ కావ్యము ద్వ్యర్థి కావ్యము. రామరాజభూషణు విరచితము. కవి యీగ్రంథమును శ్రీరామచంద్రున కంకితము గావించెను. కవి తాను పవమాన నందన ప్రసాద సమాసాదిత సంస్కృతాంధ్ర సామ్రాజ్య సర్వంకష చతుర్విధ కవితా నిర్వాహక సాహిత్య రసపోషణుడ నని గద్యయందు చెప్పుకొనెను. శ్లేషార్థములుగల ఒక పద్యరచనయే బహుసామర్థ్యము నపేక్షించు ననుచుండ హరిశ్చంద్ర చరిత్ర, నలచరిత్రలను రెండు విభిన్న చరిత్రలను స్ఫురింప జేయు నేక కావ్యముగ యీ ద్వ్యర్థికావ్యరచన గావించిన రామరాజభూషణుని సమర్థత కడు ప్రశంసనీయము. ఇదై దాశ్వాసముల కావ్యము.

ఈ ప్రతియందు పూర్తిగా నై దాశ్వాసముల గ్రంథము గలదు. కాని 3వ పత్రము మాత్రము లేదు. ఈ ప్రతిలోని పత్రములు కొన్ని పార్శ్వభాగములయందు శిథిలములై యున్నవి. కొన్నిచోట్ల ప్రతివిలేఖరికి పద్యభాగములు లభింపనందున కాబోలు ఖాళీ స్థలములను వదిలెను. ప్రతి నలుపు దిరుగుచున్నది. అక్షర దోషములు స్వల్పముగ నున్నవి.

## హరిశ్చంద్ర నలోపాఖ్యానము

### రామరాజభూషణుడు

| | | | |
|---|---|---|---|
| ఆక్సేషన్ నెం | ; 4634 | కాల్ నెం | ; టి3 46 |
| ప్రతి | ; తాళపత్రము; అసమగ్రము. | పత్రములు | ; 41 |
| ప్రతి పరిమాణము | ; 46×3.5 సెం.మీ. | పత్ర పంక్తులు | ; 6 నుండి 7 |

విశేషాంశములు :

ప్రతి క్రిమిదష్టమై శిథిలావస్థలో నున్నది. గ్రంథపాత మధికము. గ్రంథాద్యంతములు లేవు. ఇందు సుమారు నాలుగాశ్వాసములున్నను, ఏ ఒక్క ఆశ్వాసము పూర్తిగా లేదు. వ్రాయసకాని పేరుగాని ప్రతి వ్రాసిన కాలముగాని పేర్కొనబడలేదు. వ్రాతదోషము లధికము. ఇది ద్వ్యర్థికావ్యము. వ్యాఖ్యానము లేదు.

అనుబంధము I

# యోగసక్తా పరిణయము

## మద్దిపట్ల అప్పన్నశాస్త్రి – కొట్రవేంకటరామకవి

| | | | |
|---|---|---|---|
| అక్సెషను నెం | : 5891 | కాల్ నెం | : టి 3 - 625 |
| ప్రతి | : కాగితము, అసమగ్రము. | పుటలు | : 101 |
| ప్రతి పరిమాణము | : 22 × 32 సెం.మీ. | పుట పంక్తులు | : 41 |

## 1వ ఆశ్వాసము

ప్రారంభము :

శా. శ్రీరాజీవభవామర ప్రముఖ సచ్ఛ్రేయోవహ ప్రస్ఫుర
ద్ధీరాంచద్ఘన రత్నసంఘటిత కోటీరప్రభా భాసితాం
ఘ్రీ రాజీవ యుగాత్ము మౌనివర సత్క్షేత్ర ప్రబుద్ధస్థితి
స్ఫారాకారభవుం బరాత్పరు శివుం బ్రజ్ఞాప్తికై మ్రొక్కెదన్.

సీ. ముది పాల్కడలి లేమ ముత్రోవ ద్రిమ్మరి పంకజీవన తుంగభంగ కలిత
మనుజ మార్గనిరోధి మధువైరి పదజాత గోత్రభిత్త్రుట సత్వ గురుభుజంగ
సహచరి సుడిగొట్టు జడధిగామిని మధు పాళి సమాక్రాంత పద్మ వేల్పు
వాక నౌదల నూని వదల వౌ మేల్మేలు సర్వమంగళ నార్యసతిని నన్ను

తే.గీ. సామి సామేన దాల్చితి చనునె నీకు ఘటన యఘటన యఘటన ఘటనఁ జేతు
వన్న గిరిజను మరు మాటలాడి యలర జేయు శంకరు డిడు మాకు శ్రీసమృద్ధి.

* * *

వ. అని యిష్టదేవతా ప్రార్థన గురు వందనంబు నొనర్చి తత్ప్రచ్ఛృతుల పురాతన కథ లరసి యభ్యుదయ పరంపరాభివృద్ధిగా మా యొనర్పం బూనిన యోగసక్తా పరిణయంబు. బను మహాప్రబంధంబునకుం గథాక్రమం బెట్టిదనిన.

తే.గీ. శ్రీల కధివాసమై మునిసేవ్య మగుచు సప్తతంతు క్రియార్చిత సప్తజిహ్వ ధూమపూత మహీరుహ తుంగశాఖ రమ్యమై యొప్పు నైమిశారణ్య మెపుడు.

* * *

క. ఈ జగముల కూర్ధ్వంబుగ రాజత్ప్రాకార సౌధరథ్యాపణ వి భ్రాజితమై సిరి కిరవై తేజోవత్యాఖ్య పురము దివి జెలువారున్.

ము గిం పు :

సీ. తదనంతరమున సమ్మద మానసుం డయి కమనీయ కర భూషణముల చేత దాంబూల తాంబూ నదాంబరంబులచేత సకల బంధువులను సత్కరించి గురున కనేక సుందరమణి వ్రాతంబు కుండలాది మనోజ్ఞ మండనములు మౌనీంద్రులకును, సమ్మదమార వరసువ ర్ణమ్ముల యాజన ద్రవ్యచయము

తే.గీ. గరుడ కిన్నర యక్ష ఖేచరుల కెల్ల నమిత భూషణముల నిచ్చి యంపకంబు సేసి మోదంబుతో సుఖాసీను లగుచు సానగాదులు నిలిచిరి స్వస్థలముల.

క. ముదమున ననేక వర్షము లుదితుండు ప్రభావసుండు యోగాసక్తా మదవతిని గూడి పిమ్మట సదమల సంతానమంది జానువహించెన్.

వ. ఇట్లు శౌనకాది మహామునులకు సూతుండు ముదంబున నెఱింగించిన వార లత్యంత సంతోషితాంతరంగులై యుండిరంత.

* * *

క. విశ్వగురు రూప చిదచి చ్ఛశ్వదముల చిద్ద్రుతాప కాంత సుతాపా ప్రశ్వసిత విశ్వకర్మా ఖ్యాశ్వాసిత లోకతాప హరణోద్దీపా.

గద్య :

ఇది శ్రీమహా రాజరాజేశ్వరీ పరీరంభ ఝరీపరిత సరీసృపాధిప గ్రైవేయ కాభిరామ మహ దేవ వరప్రసాద లబ్ధ కవితామాధురీ ధురీణ శ్రీమదశ్వలాయన కులపవిత్ర భారద్వాజ గోత్ర నృసింహశాస్త్రిపుత్ర నిగమాగమ ప్రవీణ వినుత గుణగణ మద్దిపట్ల వంశపయ పారావార రాకాసుధాకరాప్పనశాస్త్రి ప్రణీతంబైన యోగసక్తా పరిణయం బను ప్రబ ధంబునందు ఆంగీరసుండు సత్యలోకంబునకుం జని బ్రహ్మాదిదేవతలను విష్ణుశంకరులన వివాహంబునకు బిలుచుటయు ...............

* * *

నాకబలియును అనంతరంబున గృహప్రవేశంబును నను కథలుం గల సర్వంబు ద్వా శాశ్వాసము సంపూర్ణము.

ప్ర తి వి లే ఖ న ము :

గు॥ చం॥ గారికి యీ యోగసక్తా పరిణయంబను యీ గ్రంథము దుర్ముఖి సంవత్స మార్గశిర శుద్ధ 15 శనివారం తారీఖున ప్రతినుండి నండూరి బంగారయ్యాయిచే వ్రాయబడమయి గుడివాడ చంద్రకాంతం గారికి చెందియున్నది. (ది 19 మార్చి 1896.

వి శే షాం శ ము లు:

ఈ కాగితపు ప్రతిలో కొన్ని పుటలు అడ్డముగా, కొన్ని నిలువుగా చినిగి జోడింపబ శిథిలావస్థలో నున్నవి. ప్రతిపుట రెండువైపుల ఉలిపిరి కాగితము అంటించబడి పు కముగా బైండు చేయబడినది. కాగితములు గోధుమరంగుతిరిగి యున్నవి. లిపి సుల గ్రాహ్యము కాదు. లేఖన దోషములు కలవు. పద, పాదచ్యుతములు కలవు. ఈ కాప మునకు మొదట విషయసూచిక కూడా కలదు.

# అనుబంధము - II

# గ్రంథకర్తృ సూచి

| క్రమ సంఖ్య | గ్రంథకర్త | పుట |
| --- | --- | --- |
| 1. | అయ్యలరాజు నారాయణామాత్యుడు | 194 |
| 2. | ఎఱ్ఱాప్రెగ్గడ | 202,205,208. |
| 3. | కాకరపర్తి కృష్ణకవి | 181 |
| 4. | కామసముద్రము అప్పలాచార్యులు | 128 |
| 5. | కుమార అచ్యుతరామరాజు | 46,48. |
| 6. | కూచిమంచి తిమ్మకవి | 27 |
| 7. | కృష్ణదాసు | 117,119. |
| 8. | కొలని గణపతిదేవుడు | 15,17,19,20,21. |
| 9. | కోట శివరామయ్య | 160,165. |
| 10. | కోనపల్లి వేంకటరంగకవి | 10,12. |
| 11. | గడివేముల సంజీవయామాత్యుడు | 198 |
| 12. | గడ్డం నరసింహారెడ్డి | 186 |
| 13. | గోమఠ శ్రీనివాసాచార్యులు | 44 |
| 14. | ఘట్టు ప్రభువు | 183,185,186. |
| 15. | చేమకూర వేంకటకవి | 165,167,168,169. |
| 16. | చేకుమళ్ళ రంగశాయి | 140 |
| 17. | తూము రామచంద్రావనీపాలుడు | 59 |
| 18. | దోనయామాత్యుడు | 152,155. |
| 19. | ధూర్జటి | 39,41. |
| 20. | పరశురామపంతుల రామమూర్తి | 30 |
| 21. | పాలవేకరి కదిరీపతి | 32 |
| 22. | పాల్కురికి సోమనాథుడు | 21 |

## అనుబంధము - III

# ప్రతివిలేఖన వివరముల పట్టిక

| క్రమ సంఖ్య | ప్రతి విలేఖకుడు | విలేఖకుని తండ్రి | లేఖన కాలము | పుట | అక్సెషన్ నెంబరు |
|---|---|---|---|---|---|
| (1) | (2) | (3) | (4) | (5) | (6) |
| 1. | కొమ్మనాపల్లి కృష్ణమ్మ | సన్యాసి | కాలయుక్తి నామ సం॥ వైశాఖ బ॥ 13 జయవారము నుండి అధిక జ్యేష్ఠ శుద్ధ 15 గురువారము. | 5 | 2747 |
| 2. | కొమాండూరి కృష్ణమాచార్యులు | వేంకటాచార్యులు | ప్లవ నామ సం॥ ఫల్గుణ శుద్ధ 8 శనివారము. | 7 | 2299 |
| 3. | .... | .... | ప్రజోత్పత్తి సంవత్సర వైశాఖ బహుళ 5 నుండి జ్యేష్ఠ బహుళ 12. | 9 | 3970 |
| 4. | .... | .... | ధాతనామ సంవత్సర పుష్య బహుళ 10 భౌమవారము. | 12 | 4000 |
| 5. | భాగవతుల సీతారామ స్వామి | .... | ప్రమాది సం॥ నిజాశ్వీజ బహుళ త్రయోదశి. | 12 | 2797 |

| (1) | (2) | (3) | (4) | (5) | (6) |
|---|---|---|---|---|---|
| 6. | .... | .... | క్షయ నామ సంవత్సర శ్రావణ శనివారము. | 19 | 490 |
| 7. | .... | .... | ప్రమాదీచ నామ సంవత్సర పుష్య శుద్ధ 15 గురువాము. | 22 | 5544 |
| 8. | కొమ్మనాపల్లి కృష్ణమ్మ | సన్యాసి | కలయుక్తి నామ సంవత్సర వైశాఖ బహుళ 12 సోమవారము. | 27 | 2749 |
| 9. | గొల్లూరు పెద్దయ్య | .... | పింగళ నామ సంవత్సర చైత్ర బహుళ త్రయోదశి సౌమ్య వారము. | 31 | 704 |
| 10. | .... | .... | భావనామ సం॥ అధిక ఆషాఢ శు॥ 12. | 36 | 3999 |
| 11. | చేవెళ్ల పేరయ్య | వేంకట రాముడు | వికారి నామ సం॥ చైత్ర శుద్ధ 13. | 43 | 4650 |
| 12. | లక్ష్మణాచార్యుడు | .... | రౌద్రి నామ సం॥ ఫాల్గుణ శుక్ల ఏకాదశి ఖరకర తనయ వాసరము. | 47 | 4651 |
| 13. | శేషం రంగయ్య | .... | కాలయుక్తి నామ సం॥ మార్గశిర బ॥ 13 శనివారము. | 52 | 4642 |
| 14. | అల్లూరు సీతారామరాజు | .... | విశ్వావసు నామ సం॥ ఆషాఢ బ॥ 8 స్థిర వారము. | 55 | 458 |
| 15. | నలదీగె శఠగోపాచార్యులు | .... | కీలకనామ సంవత్సర వైశాఖ బహుళ సప్తమీ సౌమ్య వారము. | 59 | 6114 |

| (1) | (2) | (3) | (4) | (5) | (6) |
|---|---|---|---|---|---|
| 16. | .... | .... | వి(క్రమ నామ సంవత్సరము. | 63 | 1793 |
| 17. | కోవూరు పుల్లయ్య | తిమ్మన్న | రాక్షస నామ సంవత్సర జ్యేష్ఠ శుద్ధ 10. | 65 | 4590 |
| 18. | .... | .... | ప్లవంగ సం॥ వైశాఖ శుద్ధ 12 భౌమవాసరము. | 66 | 4591 |
| 19. | ముంగర నరసన్న | .... | నందన నామ సం॥ మార్గశిర బహుళ 7 భానువారము. | 67 | 407 |
| 20. | అప్పరాజు వాసుదేవుడు | .... | రక్తాక్షి నామ సం॥ వైశాఖ బహుళ 3. | 70 | 5005 |
| 21. | .... | .... | రుధిరోద్గారినామ సం॥ (శ్రావణ బహుళ 5. | 72 | 3788 |
| 22. | .... | .... | దుర్మతి నామ సం॥ వైశాఖ బహుళ 10. | 73 | 3987 |
| 23. | .... | .... | కాలయుక్తి నామ సం॥ అషాఢ శుద్ధ 12 గురువారము. | 75 | 721 |
| 24. | లయ(గాహి నర్సప్ప | .... | (క్రోధన నామ సం॥ ఆషాఢ శుద్ధ ద్వాదశి ఆదివారము. | 76 | 3450 |
| 25. | వేంకట రామానుజం | .... | సిద్ధార్థి నామ సం॥ ఫాల్గుణ బహుళ పంచమి గురువారము. | 77 | 4594 |
| 26. | అక్కిరాజు | .... | శార్వరినామ సంవత్సరము. | 77 | 4595 |
| 27. | ముంగర నర్సన్న | .... | విజయ నామ సం॥ వైశాఖ బ॥ 7 భృగు వారము. | 79 | 425 |

| (1) | (2) | (3) | (4) | (5) | (6) |
| --- | --- | --- | --- | --- | --- |
| 28. | గొల్లపూడి పాపయ్య | .... | సిద్ధార్థి నామ సం॥ చైత్ర బ 8 ఇందు వారము. | 81 | 1558 |
| 29. | .... | .... | శోభ కృతు నామ సం॥ భాద్రపద బహుళ 7 శుక్రవారము. | 81 | 3981 |
| 30. | ప్రబంధాల జగ్గయ్య | లక్ష్మయ్య | దుర్మతి నామ సం॥ ఆషాఢ బహుళ సప్తమి నుండి శ్రావణ శుద్ధ చవితి మందవాసరము. | 82 | 6124 |
| 31. | శంకరయ్య | .... | భావ నామ సం॥ కార్తిక బహుళ 3 నుండి పుష్య శుద్ధ 2. | 88 | 415 |
| 32. | వేంకట కృష్ణారెడ్డి గోవిందు రెడ్డి | చలిదిళ్ల లింగారెడ్డి | దుర్ముఖి నామ సం॥ ఫాల్గుణ బహుళ 12 మంద వాసరము. | 85 | 4597 |
| 33. | ముడుంబ రంగాచార్యులు | .... | పింగళ నామ సంవత్సర అశ్వీజ శుద్ధ 7 ఆదిత్యవారము. | 87 | 4598 |
| 34. | శ్రీరంగం చూడయ్య | .... | విరోధి కృతు నామ సం॥ వైశాఖ బహుళ 3 శనివారము. | 88 | 437 |
| 35. | .... | .... | క్షయనామ సం॥ శ్రావణ బహుళ 5 శుక్రవారము. | 92 | 3974 |
| 36. | తరుణమరి కృష్ణయ్య | .... | పరాభవనామ సం॥ ఆశ్వీజ బహుళ ఏకాదశి శుక్రవారము. | 93 | 4016 |

| (1) | (2) | (3) | (4) | (5) | (6) |
|---|---|---|---|---|---|
| 37. | అక్కినెపల్లి వెంకటరాముడు | .... | .... | 96 | 4611 |
| 38. | వైశ్యరాజు ముఖలింగరాజు | కామరాజు | సాధారణనామ సం॥ చైత్ర శుద్ధ అష్టమి గురువారము. | 100 | 3411 |
| 39. | .... | .... | మన్మథనామ సం॥ కార్తీక బహుళ పాడ్యమి. | 102 | 127 |
| 40. | .... | .... | రౌద్రినామ సం॥ మార్గశిర శుద్ధ దశమి గురువారము. | 103 | 713 |
| 41. | దాగలేటి రామదాసు | .... | శ్రీముఖనామ సం॥ పుష్య శుద్ధ 5 సోమవారము. | 105 | 819 |
| 42. | .... | .... | సౌమ్యనామ సం॥ మాఘ బహుళ 10 ఇందువారము. | 106 | 1556 |
| 43. | గొల్లపూడి పాపయ్య | .... | సిద్ధార్థినామ సం॥ చైత్ర బహుళ 30 సోమవారము. | 107 | 5637 |
| 44. | .... | .... | క్రోధినామ సం॥ కార్తీక బహుళ 5. | 107 | 708 |
| 45. | సుదర్శనంస్వామి తియ్యరు | .... | పరీధావి నామ సం॥ ఆషాఢ బహుళ 14 గురువారము. | 108 | 4600 |
| 46. | .... | .... | రక్తాక్షినామ సం॥ ఆశ్వీజ శుద్ధ త్రయోదశి గురువారము. | 124 | 1729 |
| 47. | సూరా వేంకటశివుడు | రామన్న | .... | 133 | 2824 |
| 48. | .... | .... | శార్వరినామ సం॥ మార్గశిర బహుళ 2 గురువారము. | 136 | 3908 |
| 49. | శిరసాగరం వెంకయ్య | అనంతయ్య | విశ్వావసు నామ సం॥ ఆషాఢ బహుళ దశమీ మంగళవారము. | 138 | 5937 |

| (1) | (2) | (3) | (4) | (5) | (6) |
|---|---|---|---|---|---|
| 50. | .... | .... | దుర్మతినామ సం॥ మాఘమాస ధూర్జటివారము. | 145 | 5646 |
| 51. | .... | .... | వికృతినామ సం॥ కార్తీక బహుళ దశమీ బుధవారము. | 147 | 8644 |
| 52. | .... | .... | భావనామ సం॥ పౌష్య శుద్ధ 10 శుక్రవారము. | 148 | 5606 |
| 53. | భీమన | సింగన్న | రక్తాక్షినామ సం॥ గురువారము. | 158 | 747 |
| 54. | మూలంపల్లి రాజమల్లు | రాజశేఖరం | ప్లవనామ సం॥ చైత్ర శుద్ధ 2 సౌమ్యవారము. | 164 | 489 |
| 55. | ఆగసాల నాగన్న | .... | విళంబినామ సం॥ నిజ ఆశ్వీజ బహుళ 9. | 165 | 4029 |
| 56. | అత్తలూరి మల్లయ్య | వీరేశలింగం | స్వభానునామ సం॥ మార్గశిర శుద్ధ 5. | 168 | 718 |
| 57. | .... | .... | వికారినామ సం॥ చైత్ర బహుళ 12 అంగారకవారము. | 171 | 2827 |
| 58. | నీలకంఠం | బసవలింగయ్య | .... | 169 | 8882 |
| 59. | పోతుల పెదరాజినాయుడు | పాత్రినాయుడు | పరాభవనామ సం॥ మార్గశిర శుద్ధ 8 గురువారమునుండి ప్లవంగనామ సం॥ కార్తీక బహుళ 14 సోమవారము. | 205 | 8290 |
| 60. | రేమెర్ల ఉప్మాకయ్య | .... | కాళయుక్తినామ సం॥ మాఘ బహుళ 13 బుధవారము. | 207 | 8656 |

| (1) | (2) | (3) | (4) | (5) | (6) |
|---|---|---|---|---|---|
| 61. | .... | | | | |
| 62. | మాటూరు వేంకటరాయుడు | .... | ప్లవంగ నామ సం॥ నిజ జ్యేష్ఠ శుద్ధ ఇందువారము. | 215 | 3968 |
| | | .... | ప్లవంగనామ సం॥ ఆశ్వీజ బహుళ 1 ఆదివారము. | 216 | 1537 |
| 63. | నందూరి బంగారబ్బాయి | .... | దుర్ముఖి సం॥ మార్గశిర శుద్ధ 15 శనివారము. (19-3-1896) | 223 | 5391 |



